# శ్రీమదాంధ్ర

# మహాభారతము.

ండిత పరిశోధితము

హిత్య విద్యాప్రవీణ
చివుకుల
సుబ్బరామశాస్త్రి
గారి
లఘువివరణ
సహితము.

## శాంతిపర్వము

భాగము 2.

ప్రకాశకులు

## ఆంధ్రగ్రంథమండలి

కోటంరాజు వేంకట దుర్గావరప్రసాదరావు, బి. ఎ.,
ప్రొప్రైటరు.

చందాదారులకు రు 0-11-0.

ఇతరులకు రు 1-0-0.

శ్రీ

హరిహరనాథాయనమః.

సీ. ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబని
యధ్యాత్మవిదులు వేదాంతమనియు
నీతివిచక్షణుల్ నీతిశాస్త్రంబని
కవివృషభులు మహాకావ్యమనియు
లాక్షణికులు సర్వలక్షణసంగ్రహం బనియు
నైతిహాసికు లితిహాసమనియుఁ
బరమపౌరాణికుల్ బహుపురాణసముచ్చ
యంబని మహిమఁ గొనియాడుచుండ
వివిధతత్త్వవేది వేదవ్యాసుఁ
డాదిముని పరాశరాత్మజుండు
విష్ణుసన్నిభుండు విశ్వజనీనమై
పరఁగుచుండఁ జేసె భారతంబు.

నన్నయ.

# విజ్ఞప్తి

వేదవ్యాస మహామునీంద్రునిచే సకలలోక హితార్థము సంస్కృతమున రచింపబడి యాంధ్రకవిత్రయముచే భాషాంతరీకరింపబడి "పంచమవేదమై బరగు భారతసంహిత"యని వాసిగాంచిన గ్రంథరాజ మాంధ్రలోకవిదితము. ఇట్టి యుత్కృష్ట గ్రంథము జదివి యానందించి కృతార్థుడుగా నెంచుట సర్వసహజమై యున్నది.

మేము పండితసానుభూతి ననుసరించి సర్వాంగ సుందరముగ ప్రచురింపనెంచి పీఠికాసహితముగ శాంతిపర్వము ప్రకటించితిమి. జనసామాన్యమునకు నీగ్రంథమాధుర్య మనుభవింప వీలగునట్లు రసవంతములును కఠినములు నగు తావుల లఘుటీకను పండిత సహాయమున జేర్చి యున్నారము.

ఈ మా సదుద్యమమును ప్రోత్సహింప నాంధ్ర మహాజనుల బ్రార్థించు చున్నాము.

పసుమర్తి రామకృష్ణయ్య,

మేనేజరు.



# విషయసూచిక



## శాంతిపర్వము - తృతీయాశ్వాసము.


కాలనిరూపణాదులగు రణోపాయంబుల ప్రకారము 1

ధర్మజునకు భీష్ముఁడు శకునాపశకునములు దెలుపుట 4

రాజు పగఱయెడ నుండవలయువిధము 6

కాలకవృక్షీయమహాముని క్షేమదర్శికిఁ జెప్పినహితవాక్యములు 7

ధర్మజునకుభీష్ముఁడు గణజనులం బాలించుప్రకారంబు సెప్పుట 11

ధర్మరాజునకు భీష్ముఁడు ధర్మసూక్ష్మత తెఱం గెఱింగించుట 12

పాపనిస్తరణప్రకారము 14

వ్యాఘ్రగోమాయుసంవాదము 15

భీష్ముఁడుధర్మజునకు సహాయసంపన్నత్వంబావశ్యకంబగుట సెప్పుట 20

సముద్రసరిత్సంవాదము 22

కురుకు రనీచత్వముం దెలుపునట్టియితిహాసము 23

భీష్ముఁడు ధర్మజునకు దండనీతిప్రభావం బెఱింగించుట 27

వసుహోముఁడుమాంధాతృనకు జెప్పినదండోత్పత్తిప్రకారము 29

భీష్ముఁడు ధర్మజునకు ధర్మార్థకామంబుల తెఱం గెఱింగించుట 31

... ... సుమిత్రుఁ డనురాజుచరిత్రంబు సెప్పుట 37

భీష్ముఁడు ధర్మజునకు గౌతమోపాఖ్యానము సెప్పుట 42

... ధర్మజునకు దీర్ఘదర్శి మొదలగుమత్స్యముల తెఱం గెఱింగించుట 44

పలితలోమశు లనుమూషికమార్జాలంబులసంవాదప్రకారము 47
బ్రహ్మదత్తునితోఁ బూజని యనుశకుని కైనసంవాదప్రకారము 55
కణికుండు శత్రుంజయున కుపదేశించినహితవచనముల
ప్రకారము 58
విశ్వామిత్రచండాలసంవాదము 61
భీష్ముఁడుధర్మజునకుశరణాగతరక్షణసుకృతం బెఱింగించుట 66
కపోతంబు తనశరీరమును బోయ కాహారంబుగా నిచ్చుట. 69
భీష్ముండు ధర్మజునకు గృధ్రజంబుకోపాఖ్యానము సెప్పుట 77
,, ,, పవనశాల్మలీతరు సంవాదంబు సెప్పుట 82
,, ,, దమంబుప్రభావం బెఱింగించుట 86
,, ,, తపంబువిధము సెప్పుట 87
,, ,, సత్యస్వరూపాదులు సెప్పుట 88
,, ,, అరిషడ్వర్గాదులు దెలుపుట 89
భీష్ముండు నకులునకు ఖడ్గప్రభావంబు నెల్ల నెఱింగించుట 93
ధర్మజునితో విదురాదులు ధర్మార్థకామంబులతారతమ్యంబు
సెప్పుట 96
నాడీజంఘునిచరిత్రము 99
నాడీజంఘుఁడు కృతఘ్నబ్రాహ్మణుచేమృతుఁడై మరలఁ జీవించుట 104

## శాంతిపర్వము - చతుర్థాశ్వాసము

భీష్ముఁడుధర్మజునకు సర్వోత్తమం బగుధర్మంబు సెప్పుట 111
మేధావి యనుబ్రాహ్మణకుమారుఁడు తనతండ్రితోఁ
జేసినసంవాదము 115
మంకి యనుబ్రాహ్మణునిచరిత్రము 119

| | |
|---|---|
| ఆజగరచరిత్రవతము | 122 |
| పృథివ్యాదిభూతోత్పత్తిక్రమము | 127 |
| భృగుమహాముని భరద్వాజునకుం జెప్పినవర్ణాశ్రమాచారక్రమము | 131 |
| భీష్ముఁడు ధర్మజునకు నాచారవిధి యెఱింగించుట | 135 |
| ధర్మజునకు భీష్ముఁడు యోగప్రకారంబు సెప్పుట | 138 |
| యమకాలమృత్యుభూసురేక్ష్వాకుల సంవాదము | 139 |
| కౌశికునకు నిక్ష్వాకుమహారాజునకు నయినసంవాదము | 141 |
| కౌశికేక్ష్వాకులు బ్రహ్మపదప్రాప్తు లగుట | 146 |
| మనుబృహస్పతిసంవాదము | 148 |
| బృహస్పతి మనువున కుపదేశించినమాయాప్రకారము | 151 |
| భీష్ముఁడు ధర్మజునకు విష్ణుమంత్రప్రభావంబు తెఱంగెఱింగించుట | 155 |
| ఆధ్యాత్మవిద్యాప్రకారము | 166 |
| కాలచక్ర ప్రభావము | 169 |
| స్వప్నాద్యవస్థల తెఱఁగు | 177 |
| పంచశిఖుం డనువిప్రుఁడు జనకునకుఁ దత్త్వోపదేశంబు సేయుట | 181 |
| ఇంద్రప్రహ్లాదసంవాదప్రకారము | 186 |
| ఇంద్రబలిచక్రవర్తిసంవాదప్రకారము | 190 |
| ఇంద్రనముచి సంవాదప్రకారము | 195 |
| ఇంద్రబలిసంవాగప్రకారము | 197 |




శ్రీ

హరిహరనాథాయనమః.

# శ్రీమదాంధ్ర
# మహాభారతము.

## శాంతిపర్వము, తృతీయాశ్వాసము.





ధుర్యకరణ సన్ము
గోప్యధాత్మవిహరణ దివిజ సుపూజ్యచరణ యా
రాధకభరణ 1నిరాధి
వ్యాధికరణ సౌమ్యకిరణ హరిహరనాథా. 1

### కాలనిరూపణాదు లగు రణోపాయంబుల ప్రకారము.

వ. దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె నట్లు శూరులు పుణ్యతమపురుషు లని విని కుంతీనందనాగ్రజుండు గంగానందనుతోఁ గాలనిరూపణాదు లగు రణోపాయంబు లెఱింగింపు మనుటయు నతండు భరతావరుం కై. 2

---

1. నరాధి, వ్యాధిహరణ,

సీ. వానయు సీతును వర్జించి మంచువే
సవి గాక మున్న సస్యములపంట
కోఁదవెడుతఱి నెత్తు నది శత్రుపయిఁ బూరి
గట్టియల్ నీళ్లులుఁ గలుగు నెరువు
గాఁ జూచి నడచుట గర్జంబు సిద్ధములుఁ
గంకటంబులును బాల్కాలును వివిధ
మొదలగునాయుధంబులు రథ గజ హయం
బులసవరణాలు న పూర్వభంగి

తే. నొప్పి యరిభీకరంబులై యుండవలయు
శంఖకాహళపటహాని స్సాణముఖము
లైనతూర్యముల్ మంచివి యైన లెస్స
యధిప విడిదల సమతల మగుట మేలు. 3

క. చరులఁ బనిచి యరుల తెఱఁ
గరయుచు వా రెమరు నడచు నట్టి దయిన దె
ప్పరపుం దెరువున దప్పిం
బొరసినయెడ విడియుచోటఁ బోషుచు గూరఁ వాసన్. 4

ఆ. నిమ్మర వోవుచోట నీరు దవ్వై పడఁ
బడినయెడను 1గూడు దడసి 2సొలసి
నపుడుఁ జెదరి యున్న యవసరమునఁ బగ
వారిఁ బొడిచి చెఱుప వలయు నధిప. 5

---

1. జాల. 2. యాలసి; సొలసి.

సీ. చెట్టును బాయును । మిట్టయుఁ బల్లంబుఁ
గలిగినచోటు గా । ల్బలమునేల
వినుము నీళ్ళును రొంపి । యును లేక సమవిశా
లము నైనచోటు గు । ఱ్ఱములనేల
కమ్మిగ్రుంగక 1గదు । గదుప రొంపులు గలు
గమి నొప్పుచోటు ర । థములనేల
యెడనెడ మ్రాఁకులు । మడువులుఁ గలచోటు
కురునాథ యెఱుఁగుము । కరులనేల

ఆ. యేబలంబు దనకు । నెక్కుడు గలిగె న
బ్బలమునేల పోరు । గలను గాఁగ
నినుఁడు సీతు గాలి । వెనుకగా నొన నడ
పించి పోడువ సంభ । వించు జయము. 6

చ. పలకలవార లగ్రమునఁ । బన్నఁగ విండులవారి ఘోటకం
బులఁ గరులన్ రథంబులను । భూవర వెన్వెనుకం గ్రమంబునన్
నిలిపినఁ గూడి నిల్చినయ । నీకమునం గడుమంచియోధులం
గలయఁగనెందునయ్యుఁబ్ర । కారమువారలనిల్పబల్పగున్

ఆ. బంటు లుత్సహించి । పగఱ పోయిరి పోయి
రంచుఁ గడఁగి బొబ్బ । లార్పులెసఁగ
నతిరయమున నడరు । నట్లుగ దొర సము
ద్ధతి యొనర్ప వలయుఁ । దాఁకుదలల. 8

వ. అనుటయుఁ గౌంతేయాగ్రజుండు శాంతనవునితో బంట్లెట్టి
వారు గావలయు నని యడిగిన నతం డిట్లనియె. 9

---

గదు। గదుప; కడ। కడప.

తే. ఏనుఁ గేనుఁగుఁ జేర్చిన ట్లెనసి మెసఁగు
నంగములసొంపుఁ బులికిని సింగమునకు
బుట్టినట్టియుగ్రతయును గట్టి మెఱయు
వలనుఁ గలయోధవీరులు వలయు ననికి. 10

వ. దేశవిశేషంబు లాకర్ణింపుము గాంధారసింధుసౌవీరులు కఠారంబుల సబళంబులం బరిశ్రమంబు గలిగి బలశౌర్యసమగ్రులై సర్వసమరంబులకుఁ జాలి యుండుదు రౌశీనరు లెల్ల కైదువులకు నోర్చు సత్త్వవంతులై యుండుదురు ప్రాచ్యులేనిక కయ్యంబునకు నేర్తురు కపటయోధులై యుండుదురు యవనులుఁ గాంభోజులును మథురచుట్టు దేశంబులవారును గుస్తీపుబవరంబులకు నలవడి యుండుదురు ఘూర్జరులు ప్రద్దపరుల నడిదంబులం బరిణతులై యుండుదురు మాళవులు రథంబులు మొదలైన చతురంగ బలంబుల సంగరంబులం జతురులై యొక్కండొక్కండ పెక్కండ్రకైన నోర్చి యుండుదురు గొందఱఁ గొందఱ నిర్దేశించితి మఱియు ననేకదేశంబులవారు వివిధప్రకారంబుల నుండుదు రయ్యెతెఱంగు లెఱింగి పెనంగించి జయంబు గొనునది యనిన ధర్మనందనుండు జయించు సైన్యంబులం దోఁచులక్షణంబులు విన నలతు ననవుడు భీష్ముఁ డతని కిట్లనియె. 11

ధర్మజునకు భీష్ముఁడు శకునాపశకునములు దెలుపుట.

క. సైనికులమనము లుత్సా
హానూనము లగుచు నుండు హయఘోషణముల్

పీనులకును సాగియించు గ
జానీకము లుబ్బ విజయ ౯ మగుసైన్యమునన్. 12

క. మృగములుఁ బక్షులు ననులో
మగతిం జరియించు వెనుక ౯ మందానిలుఁ డిం
పుగ వచ్చి మెలఁగుఁ గడుమే
లగుమాటలు వాడము గెలుచు ౯ నట్టిబలమునన్. 13

క. వెలు నెడఁ దెలివితో న
గ్నులు వలపల సుడియు శిఖలఁ౯గోమ రగుఁ దూర్యం
బులు గంభీరధ్వనులం
జెలఁగును జయము గొనునట్టి ౯ సేనఁ గుమారా. 14

క. అని చెప్పి మఱియు నతఁ డి
ట్లను ముట్టినపగఱసొంపు ౯ నడఁచుట యొప్పుఁ
పిను కయ్యమునకుఁ గాల్ది
వ్వినఁ బాటిలు దురిత మెట్టి ౯ విభునకు నైనన్. 15

క. చెఱువునడు మవిసినను బెను
వెఱమెకములు సెదరినను వి ౯ వేకనిధీ యు
క్కఱి బహుళసైన్య మఱిముఱిఁ
బఱచిన నాఁగంగ రాదు ౯ బలియుర కైనన్. 16

క. విను కొంద ఱైనఁ గడుఁదెం
పున మార్కొని కడిమి మీఱి ౯ పొంగి [illegible]

మొన యెంత యైన విఱుగుం
జనునే కయ్యంబు 1వాఁడువ శక్తుల కైనన్. 17

క. క్షమ మే లగు నైన నతి
క్షమ దైన్యముఁ దెచ్చు నెపుడు గర్వించినఁ గ
య్యము వాఁడిచి గెలిచి యరిశే
షమునెడ సదయక్షమావిశదుఁ డగు టొప్పున్. 18

### రాజు పగఱయెడ నుండవలయు విధము.

వ. అనిన నప్పాండవోత్తముండు పుడమిఱేఁడు పగఱయెడ నెట్టివాఁడు గావలయు ననవుడు నాభూపతితో భీష్ముండు బృహస్పతి దివస్పతి కెఱింగించిన తెఱం గుపదేశించెద నని యిట్లనియె. 19

చ. విను మరిఁ జంపనుం జెఱుపనుం వేచుట లెస్స ప్రతాపభాషణం
బున వెడ నుల్లికుట్టులనుఁబొంకుల వానిఁ గలంగఁ జేసి శేఁ
చినఁ దనపూఁపు దప్పునఱిఁసేయనిచందమునమ్మియున్నచా
డ్పునుమెఱయంగఁబల్లుచుఁగడుఁదమదినమ్మికయుండఁగాఁదగుఁ

చ. అరిపయి వీఁక నెత్తి చను నప్పుడుఁ దేనియ లుట్టునట్లుగా
నరపతి వానివారలు వినఁ బ్రియ మాడుట మేలు పక్షిఁదాఁ
దిరముగఁ2జేయఁగామృగము తేఁకువవాపనువేఁటగాఁడుతత్
త్స్వరములుసూపికాచెతుడిఁజంపఁదెగుందనబాఱిఁబాఱినన్.

ఉ. వేఁడుఱు శత్రునిం బరిభవించుట రిత్తకు రిత్తవైరము
దా మదిఁ బెట్టికోలు సుఖతంత్రముగాదనుసంధికాలమున్

1. వాఁడుప్రశక్తుల కైనన్. 2. జేరఁగా.

సీమ దగంగ 1రూపడఁగఁ జేయుటయున్ వలదగ్గమైన వాఁ
డేమెయి 2నైనవధ్యుఁడను నిట్టివినిశ్చయమాత్మఁ 3గల్గుటన్.

క. కాలవిపర్యయమున నర
పాలుఁడు దా మొక్కి యైనఁ ఽ బగతుఁ గలసి త
చ్ఛీల మెఱిఁగి తఱి యైనం
గాలునిపురి కనుచునది సు ఽ కరముగ వానిన్. 23

క. అనదతనంబును బెడిదపుఁ
దనమును లేకుండఁ బరఁగి ఽ దరి యొత్తెడునే
అనుబోలె నొత్తవలయును
మనుజేంద్రుఁడు మార్తురం గ్ర ఽ మంబున నధిపా. 24

క. పెక్కంద్రతోడ నీరస
మొక్కటఱిన కొనక తఱిఁగి ఽ యున్నపగతుతో
ను క్కాడి బంధుభావముఁ
దక్కటిపగఱయెడ వలయుఁ ఽ దా నెఱపంగన్. 25

కాలకవృక్షీయమహాముని క్షేమదర్శికిఁ జెప్పిన హితవాక్యములు.

వ. అనిన శంతనుపుత్త్రుతో నజాతశత్రుండు నిజపరివారదోషం
బున నైనను బరులచేత నేనియు సంపద సెడుట నాపదం
బొరసిన ధరణీశుండు నెవ్వగ నెవ్విధంబునం బాపికొను
నెఱింగింపు మనుటయుఁ దొల్లి కోసలపతి యైన క్షేమదర్శి
విదేహపతిచేత భూమి గోల్పోయి వగం బొంది మున్ను

1. రూపిడక; రూపికడ; రూపడక. 2. నేన-నైన వధ్యుఁడగు; నైన వంధ్యుఁడగు. 3. గల్గినన్.

దనకు మంత్రియై యుండి తాను రాజ్యంబు సేయుచుండం
బరమశాంతి నొంది వనంబునకుం జనిన కాలకవృక్షీయు
నాశ్రయించి యిట్లు యడిగిన నమ్మనుజపతికి నమ్మునిపతి
సెప్పిన వాక్యంబులు సెప్పెద విను మని యక్కురుపితా
మహుం డిట్లనియె. 26

తే. అర్థవంతుఁ డై భోగంబు ♩ లనుభవించు
చున్నయప్పుడ యిది యిట్టు ♩ లుండ నేర
దస్థిరము తాను లోనుగా ♩ నని యెఱుంగు
నతఁడువగఁబొందఁ డేది యె ♩ న్లైన నధిప. 27

క. కానియటు లుండి 1నెఱిఁబడు
నైన తెఱఁగు దోఁచి మాయ ♩ మగు నిబ్బంగిన్
మానసమున కుబ్బ వగయుఁ
దేనొం బనులు బుధుఁడు ♩ దేలఁడు రెంటన్. 28

క. జననీజనకులును సుహృ
జ్జనులును దెగునపుడు గావఁ ♩ జనమి దెలియదే
ధనములు వారలకంటెనె
మనుజేశ్వర వగపు వాని ♩ మగిడించునొకో. 29

క. గతమునకును వగవ కనా
గతమునకును నోరు దెఱచి ♩ కడుఁ గోరక దీ
నతఁ బొందక దైవం బే
గతిఁ బుచ్చిన దానఁ బోదుఁ ♩ గా కనవలయున్. 30

1. నెఱినగు,

క. వెరవును లావును గలిగిన
పురుషులు లేరెట్లు లోక ♩ మున నెవ్వరికిన్
సిరి శాశ్వతంబె యని వగఁ
బొరయఁడు ధీరుండు కలిమి ♩ పోకకు నధిపా. 31

క. సారపు[1]సిరి చేటు నరుఁడు
గోరకయే వచ్చునట్లు ♩ కోరక యుండన్
శ్రీ రాక గలుగు దైవము
కారుణ్యము గలిగెనేని ♩ గాఢవివేకా. 32

క. సిరి విడుచును బురుషుని విను
పురుషుఁడు సిరిఁదొరఁగు నిది య ♩ పూర్వమె ఫలమూ
లరతుండై వాఙ్నియతిం
బొరసి యునికి యట్టిచోటఁ ♩ బురుషున కమరున్. 33

క. కలఁగిన పెద్దమడువు విను
తెలివిఁ బొరయు నెట్లు దాన ♩ ధీరుం డట్ల
గ్గలము లయినదురితంబులఁ
గలఁగియుఁ దనయంతఁ దేఱు ♩ గౌరవ మొప్పన్. 34

వ. అని చెప్పి యిది యుపశమనప్రకారంబు నీతి యెఱింగించెద
నాకర్ణింపు మనుటయు నమ్మునివరుతో నమ్మనుజవరుండు
మహాత్మా నిన్నుఁ జేరి యేను దురితంబులం దొలంగ వలదె
యూనతిమ్మనిన నతం డతని కిట్లనియె. 35

---

1. సిరి చెడు నరుఁడుం గోరిన నే వచ్చు.

సీ. తద్దయు శాంతుఁ డై తక్కువ కోర్చి శ
త్రునిఁ గని యొడఁగూడి మనఁగవలయు
1మన్నె రాజులభూమి మర్దించి సైన్య మ
ల్లన కూర్చి వైరిపైఁ జనఁగవలయుఁ
బ్రబలునిఁ జేరి యారాధించి యాతని
సేన తోడుగ నరిఁ జెరుపవలయు
విషమున మాంత్రిక విధిఁ బాపుపోటున
నలయక రిపుఁ దెగ టార్పవలయుఁ
తే. బొంచి భేదం బొనర్చి క లంచి యేని
నంగనలఁ గొని వారిమా యలఁ దగిల్చి
యైన మఱియును బహువిధో పాయములను
దెగువ డింపక పగతు సా ధింపవలయు. 36

వ. అని చెప్పె నని చెప్పి గాంగేయుండు వెండియుం జెప్పె నా కౌసల్యుం డధర్మోపాయ విధాయకంబు లగు నుపాయంబులకుం జొరం జాల ననిన నమ్మ్మని తద్విరోధియగు విదేహ విభు రావించి యేకాంతంబున నాత్మీయదర్శిం బేర్కొని నీ వతని రాజ్యంబు గొనియున్న వాఁడ వన్నరపతి యొంటుమైఁ గార్యంబు సూచుట యొప్పదు సంధి సేయు మని వెరవు కలిమి నొడంబఱిచి యిరువురకును సంధి యొనర్చి నెయ్యంబు వాటించి వీడుకొల్పినఁ గౌసల్యుం డొడ్డొని చని యత నికిఁ దనకూఁతు నిచ్చి కరితురగాదివివిధపదార్థంబు లొసంగి విదేహజనవల్లభుం డవ్వసుమతీవల్లభుని నిజపురంబున కనిచి

1. వన్య రాజులభూమి / నర్థించి.

పుచ్చె రాజులకు జయాపజయంబు లనుభావ్యంబులం మద
విషాదంబు లనాదరణీయంబు లనవుడు ధర్మనందనుండు పరి
జనంబులయందు గణంబులై యున్నవారిం బరిపాలించు
సమ్యక్ప్రకారంబు సెప్పు మనుటయు నమ్మహీకాంతునకు
శాంతనవుం డిట్లనియె. 37

ధర్మరాజునకు భీష్ముండు గణజనులం బాలించు ప్రకారంబు సెప్పుట.

క. విను మర్థార్జకులును గా
ర్యనిపుణమానసులు నాయుధాజీవులుఁ ద
క్కనుగలపనులజనులుఁ గల
రనఘా యొక్కండ్లవార లైనజనంబుల్. 38

క. వారు గదా గణములు పతి
వారలలోఁ గలసి మెలఁగు వడువున నయ్యో
వారితెఱఁగెఱుఁగ వలయును
వారికి నెమ్మి గలిగించు వల నొదవుటకున్. 39

సీ. కుల మొక్కఁడైనఁ దేఁకువ లేక బుద్ధియు
శౌర్యంబుఁ బెంపును సరకుగొనక
యెట్టివారలతోడ నెవ్వరైన నను మత్స
రంబు గల్గుదురు గణంబుజనులు
దాన నంతర్భేద మైన శత్రులు వాపి
కొంద్రు గొందఱ నది గ్రొచ్చు రాజ్య
మూలంబుఁ గావున మఱి భూపాలుండు
వారి నందఱుఁ దగు వచనరచన

తే. నీకి మన్ననఁ గలఁగంగ నీక పొదివి
యధికముగ గణముఖ్యుల నాదరించి
పనులు గొనునది తమలోనఁ బాయ కుండఁ
1బ్రోవు లెడలిన రాజ్యంబు పొలుపు దప్పు. 40

క. ఏకార్యములను గణజను
లొక్కటి యై మెలఁగు చున్న నుర్వీశునకుఁ
మిక్కిలి సిరి యగుఁ గావునఁ
2దక్కనియరయంగవలయుఁ దగ గణవిధముల్. 41

ధర్మజునకు భీష్ముండు ధర్మసూక్ష్మత తెలం గెఱింగించుట.

వ. అనుటయు ధర్మజుండు ధర్మంబులు బహుశాఖలం గలిగి
యుండు నన్నియు ననుష్ఠింప వచ్చునే యెయ్యది యాచరించి
పురుషుం డైహికాముష్మిక సుఖంబులం బొందు ననిన
మందాకినీనందనుం డతని కిట్లనియె. 42

సీ. విను తల్లియును దండ్రి యును గురుండును సేవ
నీయులు సద్భక్తి నిత్యనిరతి
వారలఁ గొలుచుచు వా రెద్ది సెప్పిన
నది యాచరించుట యధికధర్మ
మాగమత్రయమును నగ్నిత్రయంబు లో
కత్రయంబును దేవ తాత్రయంబు
ననువస్తువులు వార లందును జనని గౌ
రవమున నెక్కుడు రాజవర్య

1. బోరులు వెడలిన, 2. దక్కక. 3. సుఖంబులు.

తే. యీజగంబున దివమునం ౯ బూజవడయు
మాతృభక్తుండు పితృభక్తి ౯ మానసుండు
నట్ల యవ్యయానందసం ౯ ప్రాపణంబు
గురుపదాబ్జసమారాధ ౯ కుండుఁ గాంచు. 43

వ. అనవుడు నజాతశత్రుండు గంగాపుత్రునితో సత్యానృతం
బులు జగంబులం బరఁగి యుండుఁ బురుషుండు వానియెడ
నెబ్భంగివాఁడై ధర్మపరుం డగు నని యడిగిన నమ్మహీపతి
కమ్మహాత్ముం డిట్లనియె. 44

సీ. సత్యంబు వలుకుట ౯ సర్వధర్మములకు
మిక్కిలి యనృతంబు ౯ మేటిపాత
కము తద్విశేషంబు ౯ గలదు చెప్పెద నొరు
నర్థంబుఁ బ్రాణంబు ౯ నపహరింపఁ
జూచుపాతకులతో ౯ సూనృతం బాడుట
పాపంబు బొంకులు ౯ వలికి యట్టి
వారి హింసించుట ౯ వరధర్మమిది యొక్కఁ
డేల భూతములకు ౯ హితము సేయు

తే. బొంకు లెల్లను ధర్మముల్ ౯ భూతబాధ
కంబు లగునిక్కములు పాత ౯ కములు వినుము
భూతముల దుష్టశిష్టత్వ ౯ ములు వివేక
సూక్ష్మతావేద్యములు వానిఁ ౯ జూడవలయు.

## పాపనిస్తరణప్రకారము.

వ. అనినం గౌంతేయాగ్రజుం డెట్టివారు దురితంబులు నిస్తరింప నేర్తు రని యడిగిన సురనదీసూనుం డిట్లనియె. 46

సీ. వర్ణాశ్రమాచార ॥ వంతులు నవిషయా
సక్తులుఁ బ్రతికార ॥ శక్తులయ్యుఁ
1దిట్టులు వడి సైఁచు ॥ ధీరు లుదారులు
నతిథిపూజకులు న ॥ ధ్యయనరతులు
నగ్నిహోత్రపరులు ॥ నాజిఁ బిఱిందికి
నడుగు వెట్టక తెగి ॥ నడచువారు
సత్యవాదులు సాధు ॥ జనపోషకులు సర్వ
దేవతాసములు నై ॥ భావ మొందు

తే. నిలిచెనమ్మూర్తి భక్తిమైఁ ॥ గొలుచువారు
దురితదుర్గముల్ నిస్తరిం ॥ తురుపురాణ
పురుషుఁడవిచింత్యుఁ డచలుండు ॥ పుండరీక
లోచనుండు సద్భక్తులఁ ॥ గాచు నధిప. 47

క. విను మగ్గోవిందుఁడు సఖుఁ
డును బంధుఁడుఁ గార్యకర్మకోవిదుఁడు నై నిన్నుం
గొనియాడు చుండ దురితం
బను పేరును గలదె నీకు ॥ ననఘచరిత్రా. 48

ఆ. ఇంద్రుఁ డజుఁడు విష్ణుఁ ॥ డెవ్వాని వైదిక
స్తోత్రములఁ బ్రసాద ॥ తుని గఁ జేసి

---

1. దిట్టాటవడి.

యెలమిఁ గొలుతు రమ్మ | హేశ్వరుఁ గొలుచువా
1రెందు నెపుడుఁ గీడు | నొంద రధిప. 49

క. విను మివ్వాక్యము లెవ్వఁడు
గొనియాడుఁ బఠించు విప్ర | కోటికిఁ జెప్పున్.
జననాథ వాఁడు దురితం
బనుదుర్గము నిస్తరించు | నక్లేశమునన్. 50

వ. అనిన విని ధర్మనందనుండు. 51

వ్యాఘ్రగోమాయుసంవాదము.

క. సౌమ్యు లసౌమ్యులభంగి న
సౌమ్యులు సౌమ్యులవిధమున | జనవర చిత్తా
గమ్యతఁ దోఁతురు వారిని
సమ్యఙ్నిశ్చయతఁ గాంచు | చందము సెపుమా. 52

వ. అనుటయు నాపగాతనయుం డేతత్ప్రయోజనంబైన వ్యాఘ్రగోమాయుసంవాదం బనునితిహాసంబు గల దాకర్ణింపు మని యిట్లనియె. 53

ఆ. పురిక యనఁగఁ బరఁగుపురిఁ బౌరికుం డను
నృపతి క్రూరకర్మనిష్ఠఁ బరఁగు
నవ్విభుండు సచ్చి | యధిప గోమాయు వై
పుట్టెఁ బుట్టెఱుంగు | బుద్ధితోడ. 54

1. రెండు నిందు.

వ. ఇబ్భంగిం బుట్టినయానక్క మహితవ్రతశీలం బయి మాంసంబు దినక హింససేయక వనంబునం బతితఫలంబులుం బత్త్రంబులు నాహారంబులుగా వర్తించుచుండం దోడినక్క లిది యేటివ్రతంబు మాంసం బేము దెచ్చి యిచ్చెద ముపయోగించి సుఖివై యుండుమని ప్రార్థించిన నమ్మాయికిం జొరక దృఢనిశ్చయుండై యుండె నంత నొక్కనాండు మృగంబుల కెల్ల ముఖ్యంబైన శార్దూలం బత్తెఱం గెఱింగి వచ్చి యగ్గోమాయువుతో నిట్లనియె. 55

క. నిను సౌమ్యుండ వని యెఱింగితి
ననఘా ననుం జెంది నిలిచి ♦ యతులసుఖము లం
దిన మేలు నన్నుం గూర్మిం
డనులోకం బిదియు నుడుప ♦ నగు నీశిక్షణ. 56

వ. నాతోడి బాంధవంబు సేయుమనిన నగ్గోమాయు విట్లనియె.

క. నీ వాశ్రయణీయుండవు
గావే విను భోగపరము ♦ గాకున్నది మ
ద్భావం బటు గావున నా
కీవచనము లింపు సేయ ♦ విద్ధగుణాఢ్యా. 58

వ. అది యట్లుండ భోగంబులు గాకున్న నేమి నీకుం గార్యాకార్యంబులు నాయెఱింగిన తెఱంగున నుపదేశించుచు మైత్రి వాటించి యునికి గర్హణీయంబై భవదీయమూలభృత్యు లసూయ సేసి భేదింతురు దాన నొప్పమి వచ్చు నీవు వారలు గలంచినం గలంగ కుండుటకును నాబుద్ధి పాటించుటకును

సమయంబు సేసి నన్ను మన్నించికొని యుండు మట్లైన
నీకడ వర్తించి యుండెద ననుటయు నావ్యాఘ్రం బాభంగి
నడపం గలయదియై. 59

ఆ. సాతసంబుతోడ సమయంబు సేసిన
నెలమిఁ బొంది నక్క ఽ పులికి బుద్ధి
చెప్పికొనుచుఁ దగ వ ఽ సించెఁ దదీయని
కేతనమునఁ బులియుఁ ఽ బ్రీతి సలిపె. 60

వ. కొండొకకాలంబునకు నమ్మృగరాజు మన్నించువిధంబును
నగ్గోమాయువు దదీయ హితాహితంబు లరసి బుద్ధిసాచి
వ్యంబు సేయు తెఱంగును జూచి చూపోపక యప్పులిమూల
భృత్యులు దమలోనం గూడికొని యొక్కనాఁడు. 61

క. పులి నమలెడుమాంసము వెర
వలవడఁ దా మపహరించి ఽ యానక్కకు ని
మ్ముల నిల్వం గావించిన
నిలయంబున గొందిఁ బెట్టి ఽ నేర్పారంగన్. 62

వ. ఉన్నంత భక్ష్యపదార్థపరిరక్షణంబును దాన చేయునది
గావున నగ్గోమాయు వప్పనికిం జొచ్చి మాంసంబు గానక
యెవ్వ రేని ముచ్చిలి కొనుటగా నెఱింగినది యై శార్దూ
లంబున కెఱింగించిన నా ముచ్చిమి యప్పులి యరయం
దొడంగిన నెప్పటి కపటభృత్యులు గపటోపాయంబు వన్ని.

క. నెమకుపరివార మమ్మాం
సము గను తెఱఁగును ఘటింప ఽ శార్దూలముచి

త్తము నక్కవలన విరస
త్వము నొందిన నెఱిఁగి భృత్యతతి యిట్లనియెన్. 64

ఆ. నక్క కేటివ్రతము | సుస్రిక్కక యిమ్మాంస
మపహరించినపుడ | యబ్బె నేని
నేమి యైనఁ జేయు | నిది పాపశీలంబు
గపటధర్మకంచు | కంబు సువ్వె. 65

క. తా నటె మాంసముఁ దిన దటె
యీనక్కయు బేలుపెట్టె | నిన్నాళ్లును నీ
యాన మఱుమాట వలుకం
గా నోడితి మిదియ నడపఁ | గార్యములయెడన్. 66

క. అనుటయు మృగపతి మనమునఁ
[1]గన లడరిన నక్కఁ బట్టఁ | గాఁ బంచి వధిం
పను బుచ్చె దాని నంతయు
విని యప్పులితల్లి గరము | వేసఁ జనుదెంచెన్. 67

వ. చనుదెంచి యావ్యాఘ్రవరునితో నిట్లనియె. 68

క. [2]ఇట్టివి కృత్రిమములు గల
వట్టిదె యానక్క చేల | వైతివి భృత్యుల్
పుట్టినకోలెను గుటిలత
లెట్టెట్టివి సేయ రకట | యెఱుక గలఁగెనే. 69

తే. బుద్ధిమంతునివలన దుర్బుద్ధు లధిక
వలన హీనులు రూపసివలనఁ గొనటి

1. గనలు గదిరి. 2. ఇట్టియు [illegible].

వారసూయలు సేయుదుశరీరసమున
నింత యెఱుఁగంగ వలవదే యీవు గొడుక. 70

క. ధర్మ మధర్మముభంగి న
ధర్మము ధర్మంబుమాడ్కిఁ దనయా తోఁచున్
నిర్మలమతి నరయ వలయు
ధార్మికతన కోరువాఁడు దన కేర్పడఁగన్. 71

క. విను మాగోమాయువు వ
చ్చినయంతటనుండి మనకుఁ జేసినహితముల్
గనికొన వలవదె యీతర
మునవాఁడిటు సేయఁ డను సమీహయు వలదే. 72

క. హితుఁ డగుమంత్రిం గుటిలుల
యతికపటోపాయములకు నగపడి చెఱుపన్
మతిఁ దలఁతురె పతి సుపరీ
క్షితంబు గావింప కొకటి సేయం దగునే. 73

చ. అనవుడు నక్కరాఁ బనిచి యప్పులి గౌఁగిటఁ జేర్చి బాష్పము
ల్గనుఁగవఁ గ్రమ్మనుం బలుకులం దగఁ బెద్దయు గారవించిన
న్వినుము మృగేంద్రమున్నటుల నీవు సభన్ ననువీఁడుమంచివాఁ
డనికొనియాడి యిష్టుదెగటార్చితి పెంపును నాదుమానమున్

వ. అని పలికి యగ్గోమాయువు వెండియు. 75

క. నను నీవు పదస్థునిఁగా
నన ఘూ చేయఁగఁ దలఁచినప్పుడ నీత్రు

త్యనికాయము కఱపులఁ బడ
కునికియు నాబుద్ధి వినుటయును మఱవమికిన్. 76

వ. బాస సేయవే యట్లుం గాక. 77

ఆ. ఎఱిఁగి యైన నెఱుఁగ కేనియు నొక్కని
భంగపెట్టి పిదప సంగతుఁడుగఁ
జేసికొనుట మేలె సిరి గలవారికి
నట్టినిలుపు వాని కగునె హితము. 78

క. అని పాసి యరణ్యమునకుఁ
జని యనశనదీక్ష నొంది సద్భావఖ్యా
తి నెఱయఁ బరమస్థానం
బున కగ్గోమాయు వరిగెఁ బురుషవరేణ్యా. 79

వ. ఈకథ పూర్వాపరవాక్యంబులయొదలి తాత్పర్యంబు నిరూ
పించి. 80

క. వారిరిమాటలఁ దేలక
భావంబునఁ గీడు మేలుఁ బరికించి యస
ద్భావుని సద్భావుని నవ
నీవర [1]యేర్పఱుప నెఱుఁగ నేరఁగ వలయున్. 81

భీష్ముఁడు ధర్మజునకు సహాయసంపన్నత్వం బావశ్యకం బగుట సెప్పుట

వ. అనిన విని సంతోషించి కౌంతేయాగ్రజుం డేమిభంగివర్త

1. నీ వేర్పరింప నేరఁ గ

నంబున భూపాలుండు సుఖియై యుండు ననుటయు నన్నర
పతికిం గురుపితామహుం డిట్లనియె. 82

సీ. ఆలస్యమును నన । హాయత్వమును నొప్ప
వవి లేనిపతి సుఖి । యై చరించు
విను తొల్లి యొకయుష్ట్ర । మనితరసాఘ్యత
పంబు సేయఁగ మెచ్చి । బ్రహ్మ వచ్చి
యర్థించినది యేమి । యనిన నాలొట్టెనుఁ
గొప్ప నామెడ శత । యోజనప్ర
మాణం బగుట కోర్కి । వాణీశ నావుడు
నట్లగుం గాకని । యతఁడు సనియె

తే. నదియు వరగర్వమున సహోరయంబు నొల్ల
[1]కలసభావంబుతో నుండి । వలచి యొక్క
నాఁడు దనయజ్ఞు సాఁచి కా । ననములోన
[2]వీనుకొని మేయఁగా బెను । వాన వచ్చె. 83

క. వచ్చినఁ దనమెడ సాఁగిన
యచ్చటిగుహలోన నుత్తమాంగం బిడి తా
నిచ్చ మెయి నిదురపోవఁగ
విచ్చలవిడి నొక్కనక్క । వెలఁదియుఁ దానుఁ. 84

వ. ఆగుహం బొచ్చెం జొచ్చి యాఁకటిపెల్లున నాలుం దానును
నొక్కట నాలొట్టెనుఁగుకుత్తుక కబళించి నెత్తురుం గండలు
నా పాలాన మ్రింగం దొడంగిన నది మేలుకని మొద వేర

1. కలస...నుండు (నొలసి. 2. వంగికొని.

ల్చినంతకు నాసక్కలు నరంబులు ద్రెవ్వం గఱచిన నెఱి
దప్పి యయ్యుష్ట్రంబు నిర్గతప్రాణం బయ్యె నట్టిచందంబు
గాక నీ వనాలస్యుం డవును సహాయసంపన్నుండవును నై
నెగడు మనిన నజ్జగతీశుం డతనితో శత్రుం డధికుం డైన
నల్పబలుం డగురాజే యోజ నాపద నిస్తరించు ననవుడు
నతండు సముద్రసరిత్సంవాదం బాకర్ణింపుము దాన నీయడి
గినయర్థంబు దేటపడియెడు నని పలికి యిట్లనియె. 85

## సముద్రసరిత్సంవాదము.

తే. ఉదధి సుఖగోష్ఠి నున్నప్డు । నదులతోడ
మీఁతటంబులతరువులు । మీఱ వాంగి
తఱిని పాఱినఁ గూలు వే । తసము లేల
పెఱికి పో వవి మీకేమి । ప్రియ మొనర్చె. 86

వ. వాని నున్మూలింప మీకు శక్యంబు గామిం జేసియో వాని
కిం జేటు వాటిల్ల దిదియేమి యనవుడు గంగ యిట్లనియె.

క. బిగు వెడలక నిలిచి పడుఁగ
నగిములు వేతసచయంబు । నమ్రం బై పె
ల్లగుమావేగము గడపి యె
[1]సఁగుఁ బూర్వస్థితిన బ్రదుకు । సమసూరంగా. 88

వ. అనియె నా[2]ప్రబ్బలిచెట్లు తెఱంగు కనికొని. 89

ఆ. అరినృపాలుపెంపు । నాత్మీయశక్తియు
నెఱిఁగి పూర్వస్మృతి । నెసఁగుసడక

1. సగోనుఁ బురాస్థితిన. 2. పలిచె. పలిద-చెట్లు.

యుచితవృత్తి నతని ౹ యుద్ధతి మేవడిఁ
గడపి హీనబలుఁడు ౹ సెడక నిలుచు. 90

వ. అనిన విని యుధిష్ఠిరుండు దస్యుపదంబులకుఁ గులవంతు లగు పరిజనులు దొరకొనకున్న నరనాథుం డేమి సేయం గలవాఁ డని యడిగిన నప్పుడమిఱేనికి భీష్ముం డిట్లనియె. 91

కుర్కురనీచత్వముం దెలుపునట్టియితిహాసము.

సీ. విను మొక్కయితిహాస ౹ మనుపమంబగుతపం
బునఁ బేర్చువాఁ డొక్క ౹ మునివరేణ్యు
నాశ్రమంబునఁ దద్ద ౹ యావిశేషంబున
నఖిలజంతువులును ౹ నచట నచట
వసియించి సుఖ ముండు ౹ వానిలో నొక్కకు
ర్కుర మెప్డు భక్తిమైఁ ౹ గొలిచితిరుగు
నమ్మౌని మెలఁగిన ౹ యచట నెల్లను దాను
వర్తింప నొకదువ్వ ౹ వైర మెత్తి

తే. కఱవ వచ్చిన నమ్మౌని ౹ కడకుఁ బాఱు
దెంచె నాకుక్క నాతఁడు ౹ దీప్తరూప
మైనదువ్వఁగా జేసిన ౹ నదిగడంగి
కవియ భయమంది పాఱె ము ౹ న్కవియుదువ్వ.

సీ. అట్లు బెబ్బులి వచ్చి ౹ యడరిన బెబ్బులిఁ
గాఁ జేసి గెలిపించెఁ ౹ గరుణ మెఱయ
నొకమత్తకరిఁ జూచి ౹ యోటమై నొదిఁగిన
నుద్ధతకరిఁ జేసి ౹ యొసఁగె జయము

సింహంబుచేసి భీతిఁ జెంది పాఱించిన
ఘనసింహముగఁ జేసి గర్వ మిచ్చి
శరభంబుధాటికిఁ జకితమైన నదఁగ్రి
శరభంబుఁ జేసి యుత్సాహిఁ జేసె

తే. నిట్లు దివసక్రమంబున నెక్కుడైన
సత్త్వముగఁ జేయఁగాఁ గుక్కశరభభావ
మండితం బయి తిరుగుచునుండి పూర్వ
వాసనాసిచ మగుమనోవర్తనమున. 93

వ. ఇట్లని విచారించె. 94

చ. ననుఁ గని యొండుసత్త్వము మనంబున బెగ్గలి పాఱునప్పుడీ
మ్మునివరుఁడిట్లపోలెఁ గృపనెమ్మెుక్కలమై శరభంబుగాఁగఁ జే
యునో తగ దాని నట్లయినననుద్ధతి నాకుఁ జరింప లేదు గా
వున నితనిఁ వధింతు వెరవున్ బలముఁ సరి నుల్లసిల్లఁగన్

తే. అనువిచారంబు దివ్యబోధాఢ్యుఁడైన
యమ్మునీశ్వరుఁ డెఱిఁగి యీయధమజాతి
యున్నతస్థితి యెఱుఁగునే మున్నపోలెఁ
గుక్క యయి యుండుఁగా కన్నఁ గుక్క యయ్యె.

వ. కావునం గులహీనులు మాననీయులుగా రట్లుం గాక విశే
షం బాకర్ణింపుము. 97

చ. కుల మని పట్టి చిత్తమునఁగూరిననికీ డరయంగ లేక యు
గ్గలపువిభూతి దుష్టునకుఁగల్గఁగ జేయుట గ[illegible]

త్యులమవియున్నరూపరసికయుత్తమమధ్యమహీన[illegible]
త్రలకుఁ దగంగ నయ్యయిపదంబుల నిల్పుట నీతి భర్తకున్.

క. శౌర్యము సత్యంబును స
త్కార్యజ్ఞానమును భక్తితాత్పర్యము గాఁ
ధైర్యముఁ గలిగినఁ గురుకుల
వర్య కులం బేల సిరికి వాఁడుర్హుఁ డగున్. 99

క. ఇది సిద్ధాంతం బన రా
దుదితయశా యెట్టు లైననున్నతవంశున్
విదితగుణుం డగుపురుషు
న్వెదకి నిలుప వలయు మాననీయపదమునన్. 100

వ. అది యెట్లంటేని. 101

ఉ. ఒక్కటి యేను జెప్పెద మహోగ్రపుఁగేసరి కైనఁదోడు గా
నుక్కును లావునుం గలుగునుజ్జ్వలసత్త్వచయంబుఁగొన్న
గా । కెక్కుడుకృత్యముల్ నడపనెట్లగు నిట్టివి సాలునంచుఁ
దాఁ గుక్కలఁ గూర్చి చేయఁ దనకుం దలఁపుల్ దల
కూడ నేర్చునే. 102

చ. వలనుఁ గులంబు లేనిపరివారము గోటియు నేల నేర్పు న
గ్గలికయు 1భక్తిపెంపు మదిఁ గల్గి సుహృజ్జనమిశ్రమౌబలం
బిలువడి గల్గెనేని నిలయెల్లను నేలఁగఁ జాలు 2వేయుర
జ్ఞులు విను రాజు నేర్పరియుశూరుఁడుఁ గావలయుం జుమీ
నృపా. 103

1. నొప్ప భక్తి. 2. వేయురాజులు-వేయు నాజులు.

వ. అని చెప్పి వెండియు. 104

సీ. వినుము మయూరంబు విధమున బహుచిత్ర
భంగులఁ బ్రజయంతరంగ మాత్మ
వశము సేయుచు మృదువాక్యముల్ వలుకుచు
మంత్రంబు నెడఁదన మాట వెడల
కునికి శరత్సమయోచితక్రియచొప్ప
గాఁగ ధర్మంబు శిఖా ప్రకార
మొంది తనర్చు సముల్లాసిపక్షమై
యానంబు గైకొంచు నధికతరస

తే. మున్నతత్వంబు సంశ్రియయోగ్యమగుటఁ
గాంచుచును దఱి వచ్చినఁ గారుకాల
మేఁచు తెఱఁగున నేఁచుచు నీచకుటిల
గతులఁ దునుముచు నెగడుట పతికి నీతి. 105

క. కిరణములభంగిఁ జతురపుఁ
'బరిజనముల నెంతఁ జొనిపి పరకృత్యంబుల్
నిరతంబును గనుఁగొనుచును
దరణికరణి వెలుఁగు టొప్పు ధరణీశునకున్. 106

తే. అలుక గూరిమి ఫలదంబు లగుచు నుండఁ
గృత్యములఁ దానెఱుంగుచు నిత్యవిధుల
నాయములును వ్యయంబులు నరసి కోశ
సంపదలు గాంచి యునికి రాజన్యగుణము. 107

వ. అనిన విని యుధిష్ఠిరుండు రాజులకు దండంబు 1సర్వసాధా

1. సర్వసాధనంబు.

రణంబు తదీయస్వరూపంబు విన వలతుం జెప్పు మనిన
నన్నరదేవునకు దేవవ్రతుం డిట్లనియె. 108

భీష్ముఁడు ధర్మజునకు దండనీతిప్రభావం బెఱింగించుట.

సీ. అసితోత్పలచ్ఛాయమై దంష్ట్రికాచతు
ష్టయమును భుజచతుష్టయము జిహ్వా
కలు రెండుఁ బాదాష్టకంబును శంకుక
ర్ణములును బహునయనములుఁ గల్గి
యూర్ధ్వరోమంబులు నుగ్రారుణాస్యంబుఁ
గపిలజటాజాలకంబు నొప్ప
నసి గదా శక్తి శరాసన ముసల చ
క్ర ప్రాస శర తోమర త్రిశూల

తే. పరశుముఖసాధనంబులఁ బాపజనులఁ
దరతరంబ సంఛేదనతాడనాదు
లైనవివిధప్రహతుల నేపడఁచుచును జ
రించు దండంబు సుజనులు ప్రియము నొంద. 109

సీ. పరుఁ డసంగుఁడు ధర్మపాలుండు ధర్ముండు
విజయుండు శాస్త్రంబు విశసనుండు
గ్రహ మక్షరుఁడు ప్రజాగరము దురాసదుఁ
డసి సత్యగుండు నిత్యగుఁడు శాస్త
ప్రాగ్వచనుండు శస్త్రంబు బ్రహ్మము తీక్ష్ణ
వు శివంకరుండు

కౌమారిసుతుఁడు శ్రీగర్భుండు వ్యవహార
తంత్రంబు సగుప్తమంత్ర మనఁగఁ
తే. బరఁగుపేళుల నొప్పి యధ్వరమయాత్ముఁ
డైనవిష్ణుండు దండమై యావహిల్లు
శ్రీ సరస్వతి యనువిశిష్టదండ
నీతినామాంతరంబులు నృపవరేణ్య. 110

వ. ధర్మాధర్మంబులు సుఖదుఃఖంబులు నయానయంబులు నర్థా
నర్థంబులు బలాబలంబులుఁ బ్రమాదాప్రమాదంబులు
మొదలైనసకలావస్థలును దండంబున సమ్యగసమ్యక్ప్రకా
రంబులం గలుగుం గావున సమ్యక్ప్రకారంబుచేత దండంబున
రక్షింపంబడిన ప్రజ రాజు నభివృద్ధి నొందించు నట్లగుట
దండంబు రాజునకుం బరాయణంబు. 111

క. సత్యప్రకారధర్మము
నిత్యాన్వేష్య మది సునీత మగుచు నా
దిత్యపతిఁ బ్రీతుఁ జేయఁగ
నత్యున్నతి నెసఁగు నాతఁ డన్నప్రదుఁడై. 112

వ. దానంజేసి దండంబు ప్రసన్నంబై వెలుఁగుఁ దదీయాభిధా
నంబులు మఱియునుం గల వాకర్ణింపుము. 113

ఆ. పురుషుఁ డీశ్వరుండు భూతాత్మకుండు జీ
వుండు ప్రాణుఁ డక్షయుండు సత్త్వ
మనఁగ నేడుపేరు లష్టమంబు ప్రజాప
తి యనఁ బరఁగు దండదేవుపేరు. 114

వసుహోముఁడు మాంధాత్రునకుఁ జెప్పినదండోత్పత్తిప్రకారము.

వ. దండంబు సాక్షాద్దేవుం డట్లగుటం దెలిపెడునది యొక్కయితిహాసంబు గల దంగదేశాధీశుండు వసుహోముం డనురాజు హిమశైలంబున ముంజపృష్ఠం బనం బ్రసిద్ధం బగుశృంగంబునకు దేవీసహితంబుగాఁ జని యందు వసియించి మునిగణపూజితం బగువృత్తంబున నుదాత్తుం డయి యుండు నమ్మహీపతికడకు మాంధాత్రుండు సనుదెంచి సవినయంబుగాఁ బ్రణమిల్లిన నబ్బూభువల్లభునకు నతండర్ఘ్యపాద్యాదు లగు నుపచారంబు లాచరించి వచ్చినపనియేమి యని యడిగిన నప్పుడమిఱేఁడు సవిస్తరంబుగా దండప్రకారంబు వినుటకై నిన్నాశ్రయింప వచ్చితి ననవుడు నమ్మహాత్ముం డతని కిట్లనియె. 115

సీ. అజుఁ డధ్వరంబు సే  యంగఁ దలంచి ఋ
త్విజు నాత్మసదృశుని  వెదకి యెందుఁ
గానక తా నొక్క  గర్భంబు ధరియించి
వేయేండ్లకును దుమ్మి  వెలువరించె
క్షుతసంభవతఁ జేసి  క్షుతుఁ డనుపేరిటఁ
బరఁగెడునా ప్రజా  పతియు ఋత్వి
జుండుగఁ గ్రతువొన  ర్చుచునుండ నంతర్హి
తం బయ్యె వలచుచం  దమున నడచు

ఆ. నట్టి దగుట దండ  మధిప కార్యాకార్య
తంత్రభేద మెడలె  దానఁ జేసి

మహిఁ గలుగఁ గడు న । మర్యాద వర్తించెఁ
గమలజుండు విష్ణు । కడకుఁ జనియె.

క. చని సంప్రార్థించి యతనిఁ
గొని రుద్రునిఁ గాంచి నీసఖుం డీతఁడు న
చ్చినకార్యము గృపతోడను
విను మని దండంబు తెఱఁగు వినిపించెఁ దగన్. 117

వ. అట్లు లోకరక్షకుం డగుపుండరీకాక్షు దండగొని దండాభా
వంబున జగంబుగలుగు టెఱింగించిన నవ్విరించిపలుకులు
మనస్కరించి మహాదేవుండు నిజప్రభావంబు దండంబుగాఁ
గల్పించి దండనీతి కాశ్రయుం డై పరఁగు చుండె. 118

సీ. వినుము ఋగ్వేదాది । వేదముల్ నాలుగుఁ
గల్పాదు లైనయం । గంబు లాఱు
బెరసి విద్యలు పది । పేర్చుపురాణంబు
లనియును నొకవిద్య । యధిప ధర్మ
విధులు సెప్పెడుశాస్త్ర । వితతి యంతయు నొక
విద్య సర్వన్యాయ । విస్తరంబు
నొకటి మీమాంస బా । నొక్కటి యిట్టులు
వివరింపఁ బదునాల్గు । విద్యలయ్యె

తే. వైద్యకోదండ గాంధర్వ । విద్య లర్థ
శాస్త్ర మగునీతివిద్య త । త్సహితవృత్తి
నెలయఁగాఁ [illegible]
దేర్పరించె జగత్త్రయ । హితము పొంచె. 119

వ. ఇట్లు సమకట్టి దండంబును దండనీతిప్రపంచంబు లయినయ
విద్యలను విష్ణువశగతంబులు సేసె నాసర్వేశ్వరుం డత్తఱిమ్మి
చూలికిఁ దమ్మి ఘటించి యీభంగిం బ్రజాపతి ప్రసవంబు
గావించె దండనీతి సమగ్రరూప యై చెల్లె నెల్లజగంబులుం
బ్రియం బందె నరవిందభవునియోగంబును సుప్రయోగం బై
నడచె విష్ణుండు దండనీతిశాస్త్రంబు సకలంబు నాంగిరసున
కిచ్చె నాంగిరసుం డింద్రమరీచులకు మరీచి భృగునకు భృ
గుం డనేకమునులకు నిచ్చె నీక్రమంబున నది జగంబులం
బరఁగె దండంబుజాగరణంబున లోకంబు మర్యాదామహి
తం బై వర్ధిల్లెఁ గపర్ది శంకరుండు రుద్రుండు భవుండు స్థాణుం
డుమాపతి యను పేళ్లం బరఁగునద్దండదేవుని నతులధర్మంబున
నయించు భూపాలుం డైహికాముష్మికసిద్ధులం బొందు. 120

క. అని వసుహోముఁడు సెప్పిన
విని మాంధాతృండు దండవిభవజ్ఞుం డై
యనఘ మహీపరిపాలన
మొనరించెను నీతి దండశక్తి వెలయఁగన్. 121

క. ఈయాఖ్యానము విని భూ
నాయకుఁ డెవ్వం డిలాజనంబుల నతుల
న్యాయంబునఁ బాలించుఁ జి
రాయుష్స్థిరపుణ్యభాగి యగునతఁడు నృపా. 122

భీష్ముఁడు ధర్మరాజునకు ధర్మార్థకామంబుల తెఱం గెఱింగించుట

వ. అనిన విని ధర్మనందనుండు ధర్మార్థకామంబులనడవడి యెట్లు

యిన మేలై చెల్లునని యడిగిన భీష్ముఁ డిట్లనుఁ దొల్లి యాం
గిరిష్ఠుం డనునరవరుండు కామందక నాముఁ డైనమునిని ని
ట్లని యడుగ నతం డతనికిఁ జెప్పినభంగిం జెప్పెద నాకర్ణిం
పుము. 124

చ. అనయముఁ బేర్చు కామమున నర్థము ధర్మముఁ గ్రాఁగుఁ గాన తం
త్రనిరతుఁ డైనవాఁడు సుపక్షప్రతిపన్నుఁడు గాఁడు దుష్టదం
డన మొనరింపఁ డట్టిపతి డాయరు సాధులు నార్యులుం సుహృ
జ్జనులును దానఁ జేటునగుఁ జావును బాటిలు నెల్లభంగులన్.

ఉ. కావున ధర్మసిద్ధికి ముఖం బగు నర్థము నందు నిష్ఠమై
నేవిధి నైన ధర్మరతి యెక్కుడుగా మదిఁ జొన్పు టొప్పుఁ గా
మావిలబుద్ధి గాక యుచితాగతసౌఖ్యము లాచరించుచున్
భూవిభుఁ డిష్టభూమిసతిఁ బొందిరమింప మహోన్నతుం డగున్

క. అన విని ధర్మతనూజుఁడు
జనమ్ము శీలమ్ము నధిక సంస్తుత్యముగాఁ
గొనియాడుఁ దత్స్వరూపం
బనఘా వివరింపవే దయారతి నాకున్. 126

వ. అనుటయు నాపగాతనయుండు విను మని యతని కిట్లనియె.

క. మున్నింద్రప్రస్థంబున
నున్నతిమెయి ననుజతనుజ యుక్తంబుగ నీ
వున్నతెఱఁగు దుర్యోధను
కన్నులు గమరింప నతఁడు గడు వగ నొందెన్. 128

వ. భవదీయసభయొప్పునకును రాజసూయంబు చెల్లిన యుల్లాసం బునకును నట్లసహ్యపడి ధృతరాష్ట్రునితో భవద్గృహంబున నిచ్చలుం బదివేవురు భూసురులు పసిండి పళ్లెరంబులం బా యసాహారంబులు గొనుట మొదలుగాఁగ లక్ష్మి నెపం పుగ్గ డించి తనవగపు దోఁపం బలికిన నతం డతని కిట్లను మను రాన్న పానమణిభూషణ నరవాహనాదులం జేసి యుజ్జ్వలం బై యున్నది భ్రాతా నీయైశ్వర్యం బనదే పాండవాగ్రజుం డెక్కుడు మెఱసి యునికియుం గలదు వినుము చెప్పెద.

ఆ. శీలవంతు లైన ♦ సిరిఁ బొందుదురు ధర్మ
తనయునింటిసిరికి ♦ నెన యనంగ
నెక్కు డనఁగ లక్ష్మి ♦ యొసకం బెసఁగ నీవు
శీల మలవరింపు ♦ చిత్తమునను.　　130

వ. మాంధాతృండు నాభాగుండు మొదలయిన మేదినీపతులు శీలంబునం గాదె యీ లోకంబునం బెంపు వడసి రివ్విష యంబునకు నొక్క యితిహాసంబుగల దాకర్ణింపుము. 131

క. దనుజవిభుఁడు ప్రహ్లాదుం
డనిమిషపతి రాజ్యలక్ష్మి ♦ యతులితశీలం
బునఁ గొని త్రైలోక్యంబును
దనకు వశగతంబు సేసె ♦ ధర్మం బలరన్.　　132

క. దానికి రోసి బృహస్పతి
తో నమరేంద్రుండు మేలు ♦ దొరకొనువిధ మె

ట్లో నావుడు భార్గవునిం
గానఁగఁ జను మతఁడు సెప్పెఁ గరుణాన్వితుఁడై. 133

క. అని గురుఁడు పంప నింద్రుఁడు
సని భార్గవుఁ గాంచి మేలు సమకూరు తెఱం
గనఘా యుపదేశింపవె
యనినం బ్రహ్లాదుఁ జెందు మతఁ డెఱిఁగించున్ 134

ఆ. అతని నాశ్రయించి యవ్వర విప్పించి
కొనిన మేలు వొందు మనియె భార్గ
వుఁడు వజ్రి బ్రాహ్మణుం డయి ప్రహ్లాదుఁ
జేరి శిష్యవిధులు సేయు చుండె. 135

వ. అంత నద్దానవేంద్రుండు ప్రసన్నుం డై భూసురాకృతి యయి నసురపతితో సంభాషించిన నతండు నీకుఁ ద్రైలోక్యరాజ్యంబు సంప్రాప్తం బైనకారణం బేమి యెఱింగింపవే యనుటయు. 136

ఆ. దనుజనాథుఁ డిట్టు లను రాజ ననుగర్వ
మున ధరామరులకు మనసు గందఁ
జేయ నెపుడు నే నసూయాదు లమ్మహా
త్ములకు ధనము లిత్తు నెలమితోడ. 137

వ. వారలు మెచ్చునట్టిశీలంబునం బ్రవర్తిల్లుదు దానంజేసి మహోన్నతుండ నైతి. 138

క. అనవుడు నీశీలము నా
కనఘా దయ నొసఁగవే మహాత్ములఁ దగఁ [illegible]

దినవారు బ్రదుక వలదే
యని దీనత దోఁప ననిమి । పాధిపుఁ డరిగెన్. 139

క. విని ప్రహ్లాదుఁడు గృప దన
మనమునఁ గదురంగ విప్ర । మాత్రుఁడు గాఁడీ
తనిభంగిఁ జూడ ననువెఱ
పును బుట్టఁగ నిచ్చె శీల । ముం బెం పెసఁగన్. 140

తే. పడసి యింద్రుండు శీలసం । పన్నుఁ డగుచుఁ
జనియెఁ దదనంతరంబ య । ద్దనుజవరుని
తనువునం దుండి తేజిష్ఠ । తనువిలాసుఁ
డైనపురుషుండు వెడలిన । నతఁడు సూచి. 141

వ. నీ వెవ్వండ వన నప్పురుషుం డేను శీలంబ నీవిచ్చినయవ్విప్రు పాల వసియింపం జనియెద నని చెప్పి పోయెం దదనంతరంబ క్రమంబునం దేజోమయరూపంబులు నిజదేహంబుననుండి నిర్గమింప నద్దానవేశ్వరుం డడుగుచు. 142

క. ఉత్తమధర్మము సత్యము
వృత్తంబు బలంబు నగుట । వినఁబడె బడిఁ ద
చ్చిత్తము విషాద మంద మ
హత్తరమూర్తి యొక వారి । జానన వెడలెన్. 143

క. వెడలిన నీ వెవ్వత వని
యడిగిన నాతనికి నిట్టు । లను దీనత న
ప్పడఁతి సిరి నేను బల మె
క్కడకు నరుగు నందుఁ బోవఁ । గడఁగి వెడలితిన్. 144

చ. అనిన భయంబు నొంది యతఁడాసతితోఁ బరమేశ్వరీ మహా
వినయమతిన్ ననుం గొలిచె విప్రవరుం డతఁ డెవ్వఁ డన్న న
వ్వనిత సురాధినాథుఁడు భవద్ఘనరాజ్యవిభూతి యింతయుం
గొనుటకు నిన్నుఁ జెందె నిటు గోల్పడి తీవును నీసుశీలమున్.

వ. వినుము చెప్పెద శీలంబున ధర్మంబు వెలయు ధర్మంబున సత్యంబు దొరకొను సత్యంబున వృత్తంబు సొప్పడు వృత్తంబున బలంబు వాటిల్లు బలంబున నేను గలుగుదుం గావున సమస్తంబునకు మూలంబు శీలం బని చెప్పి సిరి పురందరు పాలికి ధర్మాదులతోడఁ గూడం జనియె ననుటయు దుర్యోధనుండు శీలం బెట్టిదనిన ధృతరాష్ట్రుం డతని కిట్లనియె. 146

క. ఒలసి మనోవాక్కాయం
బుల ద్రోహాభావ మఖిలభూతములయెడం
గలిమి విను శీల మది మే
లొలయించును దాన నుల్లమూన్పుము పుత్రా. 147

క. పరహితము సిగ్గుపాటుం
బొరయక యుండంగ నెదిరిఁ బోధించుటయున్
నరసముదయంబు వొగడెడు
చరితము శీలమున కంగసంపద వత్సా. 148

క. అనియె నని చెప్పి భీష్ముం
డను ధర్మజుతోడ నీకు నది నైజము యే
నును బోధించితి శీలము
మనమ్మున నం దిరము సేయుము మనుజాధీశా. 149

వ. అనిన విని యజ్ఞనపతి భీష్మునితో నాశ యనునది యనంత
మైయుండు నది నిరర్థక మైన నయ్యోడుదుఃఖం బధికం బది
దుర్యోధనుం జేర్చి కలసియుండం జూచితి నమ్మహాత్మునకు
దేలిక మదీయాశఁ గుంఠితంబుఁ జేసి నన్ను దుర్బుద్ధిం గావిం
చెనది విషాదంబు సేయు నాశ నడంచుట యరిది గదే
యనుటయు నాశాదోష నిరాసకం బైన యొక్కయితిహా
సంబు గలదు వినుమని యక్కురుస త్తముం డిట్లనియె. 150

భీష్ముఁడు ధర్మజునకు సుమిత్రుఁడనురాజుచరిత్రంబు సెప్పుట.

సీ. హైహయుండు సుమిత్రుఁడనురాజు వేఁటవో
యినచోటఁ దనచేత నేటువడిన
మృగ మమ్ముతోఁబాఱఁదగిలె వెన్వెంటన
యదియును నొకమరి యగ్గమయ్యె
నొకమరి ద వ్వయ్యె నొకమరి దృష్టి క
గోచరం బయ్యెను ఖురపదంబు
లరసి పాఱిన నింత నంతఁ దోఁచియు నాశఁ
బెనుచుచుఁ జని మహా వనముసొచ్చె

ఆ. నవ్విభుండు డస్సి యచ్చట నొకముని
పల్లె కేఁగి మునులు ఫలజలములఁ
దృప్తుఁ జేయ డప్పి దేఱి యున్నెడ ఋష
భాఖ్యుఁ డైనతపసి యతనితోడ. 151

క. వనమున నెక్కటి నీ వే
పనికై చనుదెంచి తేల పరమవిషాదం

బునఁ బొందెదె దనిన నాతం
డను నొకమృగ మమ్మునితోడఁ జరుగఁగ వెనుకన్. 152

క. ఆసాసల వచ్చితినను
గాసిం బెట్టి యది యడవిఁ గలసెను మృగయా
వ్యాస క్తుఁడు వగచుం దన
యేసినమృగ మనఘ తప్పి యేఁగుటకుఁ గడున్. 153

వ. అది యింత దుర్నివార యగునే యనిన నమ్మునిపతి యమ్మ
నుజపతి కి ట్లనియె. 154

క. విను తీర్థయాత్ర సని యే
ననుత్తమం బైనబదరికాశ్రమమున నొ
క్కనిఁ గాంచితిఁ గృశగాత్రునిఁ
దనుఁ డనుపేరింటివానిఁ దాపసవర్యున్. 155

క. కని భక్తిం బ్రణమిల్లుచు
ముని యాతిథ్యం బొనర్ప మోదంబున నా
తనిపాల ధర్మఘటితులు
విను చుండఁగ నొక్కధరణివిభుఁ డేతెంచెన్. 156

వ. విషాదవివర్ణుం డగుచు సపరివారంబును సదారంబునుగాఁ
జనుదెంచి యజ్జనపతి మునిపతిం గాంచిన నతం డతిథిపూజా
సత్కారంబులు సేసి యాగమనకారణం బడిగిన నన్నర
నాథుండు. 157

చ. తనయుఁడొకండ వాఁడు గుణధాముఁడు క్రీడనవాంఛనా [illegible]
ననమున కేఁగి కాడుపడిన నం దడవం జనుదెంచి యొ[illegible]గా

నన మదియాశ ద్రిప్పికొనికొనఁ వెగ డందుచు వచ్చినాఁడ న
న్ననతఁడువల్కకుండెవదకొనంబొకయించుకీవాంచిచింతతోన్

క. చింతించునతనితో భూ
కాంతుం డిట్లనియె మఱియు గాఢతరాశా
క్రాంతత దుర్లభఫల యగు
టెంత యసహ్య మగునయ్య యెడఁద మునీంద్రా. 159

వ. అనుటయు నత్తాపసోత్తముం డమ్మహీపతియాననం బాలో
కించి. 160

క. ఏనరుఁడు మానసము ధృతి
నూన నుచితవృత్తి నుండుకొనుదిలగొనక యెం
దైనను నెయ్యది యేనియు
వానికి దుర్లభము లేదు వసుధాధీశా. 161

క. అర్థాదు లగుఫలంబులు
ప్రార్థించినచోట సిగ్గు వఱుపక తగ న
య్యర్థి సులభార్థుఁ జేయుకృ
తార్థుఁడు దుర్లభుఁడు దలఁప నఖిలజగములన్. 162

వ. అని పలికి పూర్వాచారస్మారకత్వంబున నిట్లనియె. 163

క. వినుము గుణవంతుఁ డొకరుఁడు
ధనవంతుం డైనయొక్కధరణీనాథుం
దనకూడఁసీరకై కాం
చన మడిగి తదీయబాలికొశత్వము వేడ్మిన్. 164

క. విహతాశుండై లజ్జా
మహితం బగునాశ దొఱఁగుటె మదితో సకల
స్పృహయును నెవ్వనియందును
వహింప నని యతుల మైనవ్రతము బూనెన్. 165

వ. అని చెప్పి యప్పార్థివుం దొల్లి తాను ధన మర్థించి యఫలిత
ప్రయత్నుండై తత్కాలజనితవైరాగ్యంబునం దపస్వియగుట
దేటపఱిచి వెండియు. 166

చ. ఒడఁబడి యీనివానియెడ నుల్లమునం దమఁ గృతఘ్నతాగడుఁ
జెడు గగుమర్త్యునీతు నెడఁజిత్తము కోర్కికిఁ బట్టు సేసి లే
వడి యగునీచకాంతయెడ వారక యాసలు సాఁగు నిట్లు పె
క్కడలను బాఱునాసగమి యెల్లఁ దొఱంగుము సౌఖ్య
మొందెదున్. 167

వ. అని యాసపజ్జం బోనమి సుఖకరం బగుటం దెలిపి యవ్వీర
ద్యుమ్నునకుం గరుణించి యతనికొడుకు భూరిద్యుమ్నుం
దనతపోమహిమ నాకర్షించి పీడుకొలిపెనని చెప్పి ఋష
భుండు సుమిత్రునిచిత్తంబు మృగయాశాయత్తంబు గాకుం
డునట్లుగాఁ బోధించెఁ బాండవాగ్రజా నీవును నివ్వాక్యంబు
లాదరించి సుస్థిరుండవై నిరాశత్వంబున సంతాపంబు దక్కి
సుఖివి గమ్మని పలికిన భీష్మునితో నబ్భూపతి భవదీయవచ
నామృతాస్వాదంబున మనంబు దృప్తిసన దింకను ధర్మ
ప్రకారంబులు వివరింపు మనిన నతం డతని కిట్లనియె. 168

క. తనభూమిఁ బరులభూమిని
ధనము లుపార్జింప వలయుఁ ధరణీశునకున్

ధనములు మూలము రాజ్యం
బునకును మూల మగు ధర్మమునకు నరేంద్రా. 169

క. అది పెట్టిదంపు వెరవున
మృదుభూతోపాయమునను మెయికొనద ప్రజం
బొదువ వలయు నాజ్ఞాసం
పద [1] గలసాకతముతోడం బతి యవహితుఁడై 170

క. విను బండారము వెరుఁగని
జనపతికి బలంబు మిత్రసంపదయును గ
ల్గును బలమిత్రవిహీనున
కొనరునె రాజ్యంబు విభవ మున్నత మగునే. 171

ఉ. కావున నర్థసంపదలు గల్మియ యింతకు మూల మైన ను
ర్వీవరుఁ డాత్మశక్తి కతిరిక్తము లైనసముద్యమంబులం
దా వలియం దలంచి సముదగ్రతఁ గైకొను టొప్ప దవ్విధం
బావిభుతోంటికల్మికిని హాని యొనర్చు హరించుఁ బ్రాణముల్

క. తనకొలఁది నుపాయంబుల
నొనరిచి ధనవంతుఁ డగుట భూపగుణము ని
ర్ధనుని నిజప్రజయును గై
కొనదు విరోధులును సరకుగొనరు కుమారా. 173

క. కసువాటున ముచ్చిమి ను
ష్టపు లగుకూరులకు మూఁక దోరం బగు న
న్నెవరిదారల బలంబుగ
బాణీగుఁను గూర్చుకొనుట సైన్యము పెచ్చున్. 174

---

1. గలస్వాగతముతోడ.

క. అన్యాయమున బొదలిన
సైన్యముచే సమరజయము సమకూరదనూ
నన్యాయపరులు గాంతురు
మాన్యత్వము దస్యులైన మనుజాధీశా. 175

వ. ఇట్లగుటకు నుదాహరణం బగునొక్క యితిహాసంబు గల
దాకర్ణింపుము. 176

భీష్ముండు ధర్మజునకు గాపవ్యోపాఖ్యానము సెప్పుట.

సీ. అవనీశ పారియాత్రాచలంబున నుండు
నొకబోయ ధర్మసంయుక్తబుద్ధి
వింట నేర్పరి మృగవితతిప్రకారజ్ఞు
డారణ్యదేశసంచారశాలి
తల్లికిం దండ్రికిం దద్దయు భక్తుడై
ఫలమూలమధుమాంసములును మేలి
కూడుగూరలు దొరకొల్పి వారికిం దృప్తి
యావహించుచు శయనాసనాదు

తే. లగుపదార్థముల్ హృద్యంబు లుగ నొనర్చు
వలయునాహారములు మునివరుల కిచ్చు
బగఱం దోచినం బరిమార్చు భండనమున
నొకండ వేవురనైన మహోగ్రగతుల. 177

క. కాపవ్యుం డనుపేరను
దీపించినయతనిభూరితేజము గని ర

క్షాపరుఁడు వలయు మన కని
యాపాలమునఁ గల్గుదస్యులందఱుఁదమలోన్. 178

ఆ. అతనిఁ దమకు నెల్ల నాధిపత్యము సేయు
వానిఁగా వరించు వారు గాఁగ
నిశ్చయించికూడి నెమ్మిమైఁ జనుదెంచి
కాంచి యిట్టు లనిరి గారవమున. 179

క. బలవిక్రమసంపన్నుఁడ
వలఘుచరిత్రుఁడవు మమ్ము నందఱుఁ బ్రభువై
తలకొని రక్షింపుము నీ
వలచినపని గొనుము పుత్ర వర్గముఁబోలెన్. 180

వ. అనిన విని యతండు వారల కిట్లనియె. 181

సీ. శిశుజనమునిజన స్త్రీజనంబులఁ జంపఁ
గా దెట్టివాఁడైనఁ గడఁగి మీఁదఁ
గవియక పొడుచుట కల్మషం బంగనఁ
జెఱపట్టఁ దగదు విశేష మొకఁడు
వినుఁ [1]డెల్ల సత్త్వంబులను బెంటిఁ జంపుట
పాపంబు గోవుల బ్రాహ్మణులను
సంకటపెట్టంగఁ జనదు తదీయహి
తము గోరి పూని యుద్ధంబు సేఁత

తే. యధికపుణ్యంబు సస్యక్రి యావిఘాత
మాచరించుట గడుదోష మవనిప్రజకు

---

1. డెట్టిసత్త్వజాతిని బెంటి.

బాధ గావించి కుడిచి శరీరంబు దొలుచు
పుల్విపుగతి నది వొలియంగఁ బొలియు నతఁడు. 182

వ. అని చెప్పి మీర లీధర్మాధర్మంబు లెఱింగి నాపంచిన తెఱం
గున బ్రదికెద రేని మీకు ముఖ్యుండ నయి సఖ్యంబు
సౌఖ్యంబుఁ బెనుప మీయోగక్షేమంబు లరసెద ననియె
దానికి వార లందఱుఁ బ్రీతిం బొంది యాతని 1వశంబున
వర్తించి వర్ధిల్లి రిట్లు కాపవ్యుండు సాధులకు హితం బగు
నట్లుగా దస్యులం బాపంబులకుం బాపి తానును వారును
నిహపరసిద్ధులం బ్రశస్తి వహించె. 183

క. కాపవ్యోపాఖ్యానము
పాపహరము దీని శ్రవణపఠనము లటవీ
వ్యాపారక్షేమంకర
రూపము లగు దస్యుమృగవిరోధము లడఁచున్.

భీష్ముఁడు ధర్మజునకు దీర్ఘదర్శి మొదలగుమత్స్యముల తెఱం
గెఱింగించుట.

వ. అని చెప్పి భీష్ముండు వెండియు ని ట్లను దీర్ఘదర్శియుఁ బ్రా
ప్తకాలజ్ఞుండును దీర్ఘసూత్రుండును నను మత్స్యంబులు
మూఁడు జలచరబహుళం బగు నొక్క యేటి మడువునఁ
[illegible]లోనం బొంతు గలిగి యుండునవి వేసవి సొచ్చిన దీర్ఘ
[illegible] దక్కటి రెంటిని గూడం బిలిచి. 185

1. వచనంబున.

క. మను వింకఁగఁ బొఱెడు నీ
రెడఁ ద్రెవ్విన కొండుసోటి కేఁగఁగ రాదె
ప్పుడు నింకనినీళ్లులు గల
మడువునకుం బోవ వలదె మనకిట్టియెడన్. 186

తే. అనినఁ బ్రాప్తకాలజ్ఞుఁ డిట్లనియె నేది
ప్రాప్తమయ్యె నక్కార్యంబు భంగినెఱిఁగి
యప్పటికిఁ దగునట్లు సేయంగ వలయు
మానితోపాయవృత్తి నేమఱుట లేక. 187

వ. అనిన నయ్యిరువెఱుఁగులపలుకులు విని దీర్ఘసూత్రుం డి
ట్లనియె. 188

క. జడనిధిచందంబున ని
మ్మడు వొప్పఁగ నిప్పుడేమి మాఁడెనె యిమ్మై
నడిచిపడ రిత్తనెవ్వఁగ
లుడుగుఁడు మఱి చూచికొందమెయ్యన తఱితోన్.189

క. అనుటయు నిది కర్జము గా
దని పల్కుచు దీర్ఘదర్శియంబుసోత్రితో
జనితాభయ మగుపథమునఁ
జని చొచ్చెం బెద్దమడుపుసమ్మదలీలన్. 190

వ. ఒక్కన రెండును నంద నిలిచె నిట్లు నిలిచినయమ్మత్స్యద్వయం
బునకు భయంబు జనియింపం గతిపయదివసంబులకు. 191

క. పాఱెడునీ రెడ త్రెవ్వఁగఁ
దాఱి బెడిద మైనయొండెదనుకఁగ నివురం

బాఱె మడు వంత వేడుక
కొఱలు జాలరులు సొచ్చి క్రిందుకొనంగన్. 192

క. వెరవున నూఁతల నెత్తెలఁ
గరముల మత్స్యములఁ బట్టి కడుసంతసముం
బొరయుచుఁ దార్ళ్లం గ్రివ్వఁగఁ
గర [1]మూహించి మదిఁ బాత్రె[2]కాలజ్ఞుండున్. 193

క. ఇం దొకతాఁ్రిడు గఱచి యె
నొందంగాఁ గ్రిచ్చినట్లొ యుండెద ఏ రీ
క్రిందుకొనుట మానంగ న
మందత నది యెడల విడిచి మసువు దఱిసెదన్. 194

క. అని యొకగుదిమీలనడుమ
నెనయంగాఁ దూఱి కఱచి యిరుదాడలఁ దాఁ్రి
డొనరంగఁ బట్టుకొని గ్రి
చ్చినచందము దోఁప మూర్ఛఁ జెందినభంగిన్. 195

వ. ఉన్నంత వేఁట దీఱె యగ్గది గలయతండు. 196

క. తెలిసిట లొంపి వోవం
[3]దొలుచునెడం దాఁ్రిడు విడిచి మఱితంబునకుం
దొలఁగి పొరదప్పి యం దొక
జలచర మున్నయెడ కేఁగెసంభ్రాంతగతిన్. 197

క. ముట్టఁబడి దీర్ఘసూతుం
డిట్టట్టరుగఁగ నుపాయమేది యొకనిచేఁ

---

1. మూహించుకొని. 2. కొలఙ్ఞుఁడనున్. 3. దొలఁచునెడ[illegible],

బట్టువడెఁ దనదుడెందము
పట్టు 1వదలి చకితవికలభావేంద్రియుఁడై. 198

క. విను దాదవ్వులఁ గార్యము
గనికొని వలయుపని మున్నకావింపఁగ నే
రనిజడుఁడు దీర్ఘసూత్రుం
డనునమ్మత్స్యంబుభంగినాపద నొందున్. 199

తే. అప్పటికిఁ దోఁచినట్టులు దప్పకుండ
ననువుతో ధృతి గల్గి కార్యంబు నడపు
నతఁడు ప్రాప్తకాలజ్ఞాఖ్యునట్లపోలెఁ
బరమసంశయ మయ్యెడు బ్రదుకు గాంచు. 200

క. ధుర్యత ననాగతము లగు
కార్యము లూహించి పని తగంగఁ జేయునయా
చార్యుఁడు సౌఖ్యముఁ బొరయును
నార్యస్థితి దీర్ఘదర్శియనుమీనుక్రియన్. 201

## పలితరోమశు లను మూషికమార్జాలంబుల సంవాదము.

వ. అనిన విని ధర్మనందనుండు పెక్కండ్రు పగఱకు నగ్గమై
హీనబలుండైన నరపతి యెప్పరుసున నాపద నిస్తరించువాఁ
డని యడిగిన నప్పుడమితేనితో భీష్ముండు మార్జాలమూషి
కసంవాదం బనునితిహాసంబు గల దది నీదగుప్రశ్నంబునకు
సదుత్తరం బగు విను మని యిట్లనియె. 202

1. గదల జనితవికల.

సీ. అడవిలో నొకమఱ్ఱి యడుగున లాఁగలఁ
బలితుండు నాకొక్క యెలుక యుండు
నమ్మహీజముమీఁద ననిశంబు రోమశుం
డనుపిల్లి వసియించు నాసమీప
మున సంజకడ నిత్యమును మృగంబుల కురు
లొడ్డివేఁకువ వచ్చి యొక్కమాఁలఁ
డగపడ్డవానిఁ గొంచరుగు నొకప్పు డా
హారంబునకుఁ బిల్లి యచటఁ దిరుగఁ
తే. బోయి యురిఁ బడి యుండంగఁ బొంచి చూచి
భయము దక్కి యచ్చోటనపలితుఁ డెరకుఁ
గుఱిమ్మరఁగఁ జందఱికుం డనుగూబపులుఁగు
హాలికుఁ డనుముంగియు నింతనంతఁ దోఁచె. 203

వ. ఎరలకై వచ్చి యిట్లు దోఁచిన నమ్మెలుక యూరెంటిబారి
కిం దప్పి పోవ రామిదలంచి బెగ్గలించియు ధైర్యంబుకలిమిం
గార్యం బూహించి యప్పిల్లిం గొండొక సేరం జనుచు
దానితో నిట్లనియె. 204

క. ఉరి దెగ్గ్వఁ గొఱికి యిప్పుడ
వెర వారఁగ నీకు నేను విడుగర సేయం
దొరకొనుట నీదుభాగ్యం
బరిత్వము దొఱంగి మైత్రి యలవఱుపు మదిన్. 205

క. ముంగికి గూబకు నగపడి
యంగంబులు వడఁకుచున్న యవి నాకిమ్మై

సంగతి గలిగిన నీయు
త్సంగంబున నుండి భయము దక్కుదు నేనుఁ. 206

చ. అనవుడుఁ బిల్లి యిట్టు లను నార్తశరణ్యుఁడ వయ్యె దిట్టినీ
కనఘ హితంబు సేయ వలదయ్య జగత్పతి సాక్షి గాఁగ ని
ప్పుని దగఁబూనితిఁ వెఱపుఁ బాచి ననుం గదియంగ రమ్మువ
చ్చిన నకులంబు గూబయును జేరఁగ నేరవు నాకు నోడుటన్

ఆ. అనిన నట్ల యగుట నాత్మ నెఱింగియ
కాదె సంధిమైన నాదు బ్రదుకు
నీదువిడుగరయును నిజ మగు టూహించి
నిన్నుఁ జెందె బుద్ధి నిశ్చయంబు. 208

క. అని పలికి పిల్లి పొదిగిట
ననయము నిశ్శంకవృత్తి నయ్యెలుక వసిం
చినఁ జూచి యయ్యులూకం
బును నకులము నచటు వాసి పోయె నిజేచ్ఛన్. 209

క. నకులము నులూకమును బో
కకు సంతస మంది యుండి గ్రిక్కున సమ్మా
మిక మయ్యెరిచేరులు గొఱు
కక యలసత నల్ల నల్లఁ గఱచుచు నుండెన్. 210

వ. అమ్మెయిఁ బలితుండు గొనకొని యయ్యెరిం గొఱుక
కుండుట యెఱింగి రోమశుం డిట్లనియె. 211

క. తగునే యిట్లు కృతార్థుఁడ
వగునీ కురి గొఱుక కిట్టు లాలస్యము సేఁ

త గటా కృతఘ్నతకు నెల
వగు టొప్పునె కొఱుకు కడఁక నద్రోహుఁడ వై. 212

చ. అనుటయు నెల్క యిట్టు లను నాశ్రితరక్షణశీలు నిన్నుఁ గీ
డునఁ [1]బొరయింతునే యిదికొడుం జెడుగుందన మేనుభీతినా
నినమదితోడ నమ్మిమిన నెట్టన యియ్యెరిఁ ద్రెంప[2]నయ్యెదన్
మనమున నెగ్గుగాఁ గొనకుమాలనిఁ గాంచినయప్డ త్రెంచెదన్

క. ఉరిఁ బాసి యేమి దలఁతో
యరిత్వమున వినుము ప్రబలుఁ డైన యతనితో
వెరవున సంధి యొనర్చియుఁ
గరంబు నమ్మమియ నీతిగాఁ గొండ్రు బుధుల్. 214

ఉ. మాలనిరాక చూచి భయమర్దిత మైనమనంబుతోడ న
క్కాలమునందు నీకుఁ జనఁగావలయున్ వెస మ్రానిపైకినా
యాలయముం జొరన్ సమయమప్పుడనాకును గానయత్తఱి
న్మేలొనరింతు నమ్ము మిదినిక్కము గర్జము నీ వెఱుంగవే.

క. అనవుడు నల్లెల తలఁప
వినుము భవత్ప్రాణరక్ష వెసఁ జేసితి నే
ననఘా నీవును నమ్మెయి
నను నాపదఁ బాప వలదె నమ్మి రయమునన్. 216

ఆ. అనినఁ బిల్లి కిట్టు లను నెల్క వేగిర
పడకు ముచితకాల భావ్య మైన
యత్నవిధిగదా సమగ్రఫలత్వంబు
నొందు నొండు దలఁప కూరకుండు. 217

---

1. బొరయంగ నిత్తునె కదుం. 2. నియ్యెడన్

వ. అని యి ట్లప్పలితుండును రోమశుండును నొండొరులతో
మాటలాడు చుండ వేకువ యయ్యె నట్టియెడ. 218

క. తనతోఁ గొందఱు కుక్కలఁ
గొని యొతేరంగఁ గేలఁ గ్రూరకృపాణం
బును భీకరభంగిగ వెసఁ
జను దెంచెన్ మాలఁ డధికసంరంభమునన్. 219

ఆ. పరిఘనాముఁ డైనపాపాత్ముఁ గని భయ
మడరఁ బిల్లి యిట్టులనియె నింక
నేమి సేయువాఁడ నిదె వచ్చె జముదూత
పోలె సత్వరముగ మాలవాఁడు. 220

క. అనిన విని యోడ కోడకు
మనుచుం దెగఁ గొఱికె వేగ మయ్యెడఁ బలితుం
డనయముఁ జకితాత్ముఁడై
చనియెన్ రోమశుఁడు నవనిజము పైకి వెసన్. 221

చ. ఎలుకయు1బొక్కలోఁ బలికి నేఁగిముదంబునఁ బొంచిచూడ సం
కులముగ నేఁగుదెంచి పరిఘుం డురి నుగ్గగుటెల్లఁ జూచి ని
ష్ఫలతకుఁ జిత్తమెంతయు విషాదము వొందఁగఁ బోయెఁ బిల్లియ
య్యెలుకకు నిట్లనుం జెవికి నింపగు రీతి నుదాత్తభంగిగన్.

ఆ. మేలు సేసి తగినమిత్త్రునిఁ బడసి త
త్సుచరితముల వచ్చుసుఖము లనుభ
వింపఁ జూచు టుడిగి వేర్పడి యుండుట
యరయ నీతివిదుల తెరువు గాదు. 223

1. బొక్క.

చ. అనఘ భయంబు నొందుటదిన్ యారయ బేలతనంబు నెమ్మిమై
మును నను నమ్మి చెందిభయ న్మోక్షణముం గని నాకుఁ జాల మే
లొనరఁగఁ జేసి తీవు దుది న్నుల్లమునం దగ విశ్వసింప కి
ట్లునికి సుఖంబె నా మసిరిన్1కుత్తుఁడ వయ్యెదు రమ్ము ప్రీతితోన్

క. బలవంతు లైనచుట్టం
బులు నేనును నీకు మేలు న్వొనరింపఁగ ని
మ్మాల మనుట యొప్పదే ననుఁ
గలసి మెలఁగు విడువు శంకన్ గను మభిమతముల్. 225

వ. అనిన విని యప్పలితుండు రోమశునితో నీపలుకు లుచితం
బులు నామాటలు విను మని యిట్లనియె. 226

చ. అరులను మిత్త్రులం దెలియ న్నారయు టెంతయు సూక్ష్మకృ
త్యము। వైర వతిదుర్లభం బరులు న్వీరన నుండియు మిత్త్ర
భావముం। బూరయుటయున్ సుహృజ్జనుల న్పోలికి గల్గియు
శత్రుతాగుణ। స్ఫురణ మొకప్డు సూపుటయు న్జూతుము
గాదె ధరిత్రి నెల్లెడన్. 227

వ. కావున నిన్నుఁ బెద్ద గదియుట గర్జంబు గాదు నీవును మద్వ
శగతిం బొందుటఁ జూచి తేనియు నేమఱం జన దెట్లంటేని.

క. బలవద్రిపులు ప్రయోజన
ములకై లోఁబడుట గల్గు న్బాలముల నేనుం
గులు దీమంబులపజ్జఁ ద
గిలి నెట్టన పట్టువడిన న్క్రియఁ జతురమతీ. 229

1. కుక్తుఁడ,

చ. అరియెడమిత్త్రభావ మొకయప్పుడు కార్యముపొంటఁ గల్గిన
న్వైరవునఁ బాముఁ బట్టునెడ నిక్కము నమ్మక దానివాతికిం
గరము దొలంగఁ జేయునరు కర్జము వట్టి చరించు నొప్పదే
పొరుగుననుండి నీకు హితము న్దగఁ జేసెద నెప్డు పంచినన్.

మ. విను నీకామిషమేను నీయెడఁగడున్ విశ్వాసముం బూని చే
రిన నీచిత్త మొకప్పు డుద్గతవికారీభూత మై దుర్వినో
దనహింసా1రుచి నొందు నీసుతసుహృద్బంధువ్రజంబేని మున్
ననుఁగన్నన్ సహియింపదాత్మఁ గరుణన్మన్నింపుమిట్లుం డెదన్ 232

వ. అని యంత నిలువక.

క. 2బలుపుటురిఁ జిక్కి పేరాఁ
కలితో నే యెల్ల నున్నకతమున నీకుం
జలిది వలసి పిలిచెద విటు
వలయునె నీపలుకు నమ్మ వత్తునె చేరన్. 233

ఆ. అనుడు నిట్టు దలఁపనగునె మత్ప్రాణర
క్షకుఁడ వైననిన్ను శత్రుఁగాఁగఁ
దలఁతునే కృతజ్ఞతయుఁ బౌరుషంబును
గలుగ నేను వెఱవవలవ దనఘ. 234

వ. అనిన రోమశునకుఁ బలితుం డిట్లనియె. 235

క. నీవలన నేను బ్రదికితి
నీవును నాకతన మూలనికి నగపడవై
తీవిధమునఁ గల్గుసుహృ
ద్భావము చాలు నినుఁ జేరఁదగ దిటమీఁదన్. 236

1. రతి. 2. బలితపుటురిఁ బడి పేరాఁ.

వ. ఇవ్విధంబునకు శుక్రవాక్యంబులుం గల వాకర్ణింపుము. 237

క. బలవంతుఁ డైనశత్రుని
వలనఁ బ్రయోజనము గలిగెనేవలను కలిమిఁదా
గలిసియు నదిగడచనఁగాఁ
దొలఁగ వలయు నమ్మ నేనిఁకేదుడిఁ గీ డొలయున్.238

ఆ. నమ్మఁ దగనివారినమ్మక యున్నది
తగినవారి నైనఁదద్ద నమ్మ
యుండఁ దగదు తన్నునోరులు నమ్మెడునట్లు
యుండి యొరుల నమ్మకుండు నీతి. 239

వ. ఇట్టిద బ్రదుకుఁదెరు వగుటం జేసి. 240

క. నినుబోంట్లను నమ్మక యే
నును బ్రదికెద ననఘ నీవునేనుం గనిచ యుండా
లునియట్టివారిమాయలు
నినుఁ బొందక యుండ బ్రదుకునేనెటిఁబొమ్మింకన్. 241

క. అనిన విని సిగ్గువడి తన
చనుచోటికిఁ జనియెఁ బిల్లినమ్మతిఁ బలితుం
డును వేఱొకతగులాఁగకుఁ
జని సముచితవర్తనమున సౌఖ్యముఁబొందెన్. 242

క. బలుపగఱవలనియాపద
దలుఁగుటకును రిపుని హీనతరు నైనఁ దనుం
గలపికొని బ్రదుకుటకు ని
య్యెలుకయుఁ బిల్లియును వెరపునెటిఁగించెదగన్.243

వ. అనిన విని కౌంతేయాగ్రజుండు శాంతనవునితో నెవ్వరియెడ
విశ్వసింప కున్నం జిత్తంబునకు విశ్రామంబు గల్గదు విశ్వసిం
చిన దురితంబులు దొడరు నట్లగుటంజేసి విశ్వసించుటయు
విశ్వసింపక యుండుటయు ననురెంటిలోనను బరమకర్త
వ్యంబెయ్యదియో నిశ్చయింప నేర ననుటయు నమ్మహీపతి
కమ్మహాత్ముం డిట్లనియె నీయర్థంబు దేలపఱుచునట్టి యితి
హాసంబు సెప్పెద నాకర్ణింపుము. 244

బ్రహ్మదత్తునితోఁ బూజని యనుశకుని కైనసంవాదప్రకారము

సీ. బ్రహ్మదత్తుం డనఁ । బరఁగిన నరపతి
నగరఁ బూజని యను। నామ మొప్పఁ
జతురభాషిణి యొక్క । శారిక వర్తించు
నది పిల్లఁ బెట్టి యిం। పారుపండ్లు
దెచ్చి యర్మిలి దాని। కిచ్చుచో మే లేటి
యధిపపుత్రున కిచ్చు। నందుఁ గొన్ని
వాఁడును మచ్చిక । వచ్చి యప్పిల్లతో
జర్లాట మాడుచు । సంచరించు

ఆ. నొక్కనాఁడు దాది। యొద్ద లేకుండ న
ద్దారకుండు పిల్ల । తల నొగిల్చి
చంపె దానితల్లి । సనుదెంచి కని మది
నిట్టు లనియె శోక। మెసక మెసఁగ. 245

తే. అకట కూడి మెలంగి యే। మొకటియైన
నర్థి నిదియును దానును। ననుభవించుఁ

బట్టి యాడుచు నుండు నిప్పాపజాతి
పడుచు సంపునె యిటు దీని నిడుకమిడుక. 246

ఆ. రాచకొడుకు గాఁడె రాచవారికి నేటి
పరిచయంబు వేగ కరుణ విడుచు
హితవు మఱచు రాజు లెందు నమ్మికకుఁ బా
త్రములె సమదమతులు క్రౌర్యరతులు. 247

వ. అని నిందించి. 248

క. ఈపగ దీర్చెద నంచుం
గోపంబున రాజుకొడుకు గ్రుడ్డులు రెండుం
బోపడు నట్లుగ గోళ్లన్
వే పెఱికి రయమున గగనవీథికి నెగసెన్. 249

వ. ఎగసి యచ్చోట నిలిచి బ్రహ్మదత్తుంజు విననిట్లనియె. 250

క. చేసె నఘము దత్ఫలముం
జేసేతం గుడిచెఁ గాని శిశువు నెడన్ నా
చేసిన కార్యము లే దేఁ
జేసితి మా ఱొండు గీడు సెందదు నన్నున్. 251

చ. అనవుడు బ్రహ్మదత్తుఁ డది యట్టిద నీదెసఁ గీడు లేదు నీ
చనుటకు నామనంబతివిషాదముఁ బొందెడుఁ దొంటియట్ల నె
మ్మినని లుమన్నఁ బూజనిశమించు నెయొండొరు చేతఁ బడ్డయీ
పెనుఁబగ నొంచి మాటపస చెల్లడి క్రమ్మఱఁ జేరు టొప్పునే.

వ. అనిన విని యతండు. 253

క. చేసినదానికి మాఱుగఁ
జేసినఁ బగ యంతతోడఁ ♦ జెడుఁ గాక గుణుల్

1డాసిన నమ్మెలు విడిచి
దోసముఁ బట్టుమరె యెట్టి తుచ్ఛులుఁ జతురా. 254

వ. అనిన నతనికి శారిక యి ట్లనియె. 255

క. నెయ్యము సెడినను మాటల
తియ్యఁదనము వట్టి పగ మఱిచినఁ జా
వయ్యెం జేటయ్యెఁ గలఁక
యయ్యె నొకటి మూఁడుఁ గాక యది మే లగునే. 256

ఆ. వినుము నేల 2దోఁచికొనినను దాయాదు
లైన మాటమాటకేని నాఁడు
వారియెడను గీడు వారక చేసినఁ
బగ జనించు నిట్లు భంగు లైదు. 257

ఆ. 3పగయుఁ గల్గెనేని పాయునె గూఢ మై
ప్రమాన నగ్ని యున్నమాడ్కి నుండుఁ
గాన నమ్మ బేల కాలాంతరంబున
నైనఁ జెడును సందియంబు వలదు. 258

క. జననీ జనక సహోదర
తనూభవుల సఖుల నమ్మఁ దగ దనినను నె
మ్మనమునఁ బగ గలవారలఁ
జను నే నమ్మంగ విడువు చతురవచనముల్ 259

వ. అనుటయు బ్రహ్మదత్తుం డిట్లనియె. 260

క. కాలవశంబునఁ గీడు
న్మేలును జనులకును మూఁడు నీకును నాకున్

1. డాసినయమ్మెలు. 2. ద్రోచికొనినను. 3. పగయ కలుగు నేని.

వాలి యవి సేయ వచ్చునె
బేలనె యే నంత యేలఁ బెడఁబాయంగన్. 261

వ. అనిన విని శారిక యతనిమొగంబు దేఱఁకొనం జూచి. 262

క. విను చల్లనిమాటలలో
మునిఁగి యలుక 1గుబ్బతిలు సముద్రజలములో
నన యుండి యాఱ కెప్పుడు
గనగన మనుబాడబాగ్నికరణి నరేంద్రా. 263

క. అని పలికి యవిశ్వాసము
మనమున నెలకొల్పి రాజుమాటలకుం దే
లని వెరవుతోడ నా పూ
జని దన కిమ్మైనయెడకుఁజనియెఁ గుమారా. 264

వ. అదియునుం గాక. 265

క. జననాథునకు నవిశ్వా
సనిరూఢత వలయు నెల్లజనములయందుం
దనుఁ దనసిరిఁ గాచుటకై
యని నీతులు సెప్పుదురు బృహస్పతిముఖ్యుల్. 266

కణికుఁడు శత్రుంజయున కుపదేశించినహితవచనముల ప్రకారము

వ. అవ్వాక్యంబు లాదరింప వలయునని పల్కి వెండియు భీష్మా
దు పాండవాగ్రజుతో సౌవీరపతి యగు శత్రుంజయునకు

1. గుబ్బటిలు.

భారద్వాజవంశవర్యుం డైన కణికుం డుపదేశించిన హితవచనంబులు గలవు వానిం జెప్పెద నాకర్ణింపు మని యిట్లనియె.

క. వికచముఖుఁ డగుచు శాత్రవు
లకు హితు లగునట్టివారలం గని భూపా
లకుఁ డెడ్డ కత్తెరయు నా
లుక బెల్లము నై [1]మనంబులుం గన వలయున్. 268

ఉ. జ్ఞాతుల [2]నమ్మి తోడుకొని శత్రులనోర్చి యహీనరాజ్యముం
బ్రీతి వెలర్పఁ జేకొనినపిమ్మట సౌఖ్యసమృద్ధితోషిత
జ్ఞాతినికాయుఁ డై మది నజస్రము నమ్మక సర్పసంయుతం
బై తనచారురమ్యనిలయంబున నున్నటులుండఁగాఁ దగున్.

వ. అని మఱియును. 270

క. వినుము తఱి వేచి రిపు మూఁ
పున మోవఁగ వలయు సమయముం గనికొని గ్ర
క్కునఁ గడవ శిలాస్థలి పై
చినచాడ్పున నేర్పు మెఱయఁ జెఱుచుట యొప్పున్. 271

క. పానము జూదము వేఁటయు
మానినియును భూపతులకు మధురవినోద
స్థానము లగు నైనను దగ
నైనవిధము దక్కఁ దగులమాపద దెచ్చున్. 272

క. విని విననివాఁడపోలెం
గని కాననివాఁడపోలెఁ గావలయు విభుం

1. మనంబులుంగొనవలయున్, కలయ (బ) లుకఁ గావలయున్. 2. నెమ్మిఁ.

డొనరింపఁ దలఁచినపని
కను వగునంతకు నభేద్యుఁడై జనులయెడన్. 273

క. ఒల్లనికార్యం బొసల
నల్లన కాలగతిఁ గడపునది కాలముచేఁ
బెల్లొదవు విఘ్నములు భూ
వల్లభునకు [1]నెపము వెట్టవచ్చుం బిదపన్. 274

తే. బహుళ మగుగర్వమునఁ గార్యభంగియును న
కార్యసరణియు నెఱుఁగక నార్యవృత్తి
గాని తెరువున నడచుచున్నని గురుని
నైన శాసింపఁగాఁ దగునండ్రు బుధులు. 275

క. తెగఁ దీర్పక [2]తగ నార్పక
తెగటార్పక కడమ కొంతద్రిక్కఁగ నున్నన్
జగతీశ యప్పు నగ్నియుఁ
బగయును గడుఁ బెరుఁగుఁ గీడువాటిల్లుఁ దుదిన్. 276

ఆ. మార్దవమున మృదువుమర్దింపఁగా వచ్చు
మార్దవమున ఖరవిమర్దనంబుఁ
జెల్లు మార్దవమునఁ జెల్లనియది లేదు
గాన మృదువ తలఁప ఖరము సువ్వె. 277

వ. అనిన విని యజాతశత్రుండు ధర్మంబు నడవక యవగ్రహాది
దురితంబులు దుస్తరంబు లయిన నాహారంబులు దొరకొన
నియట్టిచో ద్విజాతులేమిభంగిఁ బ్రాణంబులు రక్షించు

1 దప్పు. 2. తెగ,

కొనువారనుటయు నాపగానందనుండు విశ్వామిత్రచండాల
సంవాదం బనునితిహాసంబు భవత్ప్రశ్నంబునకు నుత్తరం బై
యుండు నాకర్ణింపు మని యిట్లనియె. 278

## విశ్వామిత్ర చండాల సంవాదము.

క. ఏపారి తొల్లి త్రేతా
ద్వాపరములసంధి నొక్కకఱవు ధరిత్రీ
తాపంబుఁ జేసె జనముల
పాపంబున వత్సరములుపంద్రెం డధిపా. 279

సీ. ఏఱులుఁ జెఱువులునిఖురఁ గర్షనము లెం
డును జెడఁ దరులతాదులును గమర
భూమియుఁ బసమాల గోమహిషాదిజీ
వధనంబు వొలియ భూవరులు మేర
దప్పి లోకములోని ధాన్యముల్ గొన నధ
ర్మం బంత కంతకుఁ బ్రబ్బ నధికు
లనదలఁ జెఱుపంగ యాగముల్ దేవతా
పూజలు నెడలంగ భూసుర ప్ర

ఆ. ముఖము లైనవర్ణములచొప్పుదప్పు నా
హారరహితజనము లచట నచటఁ
బడఁగఁ జూడ ఘోరభంగిగాఁ దఱచయ్యె
డొక్కలున్నవారి కెక్క భయము.

281

వ. అట్టిసమయంబున.

క. మునిపతి విశ్వామిత్రుఁడు
దన యాఁకలి కెందు మెలఁగి ధైర్యమెడలి యో
దనమాంసమూలఫలములు
జనుల నడిగి యెందుఁ బడయఁ జాలక డప్పిన్.

వ. తూఁగాడుచుం జనువాఁడు. 283

చ. పసరపు టెంపప్రోవులును బందులడొక్కలుఁ గుక్క[1]గుట్టలున్ ముసుఁగు వడంగ భూమితలమ్ముం దఱ చారఁ గఁ గప్పుచున్ మదిన్ బస మొక యింతలేక పెలుచ్ప్రాణులనుం బొరిగొంచు నెప్పుడున్ వ్యసనతఁ గూరియున్న వెలి వాండ్రురపల్లియఁ జేరి యయ్యెడన్. 284

వ. ఆర్తినొంది యిట యట వోవంజాలక నేలం బడి యుండి ప్రాణంబులు వోవుట యుపేక్షింపం దగదు ప్రాణరక్షణంబ పరమ ధర్మంబని వితర్కించి తగు నుపాయంబు చింతించు వాఁ డప్పుడ చంపి [2]తిత్తొలిచి గాలిగొన వైచిన కుక్క కడి మంబుఁ గనుంగొని. 285

క. ఇది దప్పు నిప్పు డియ్యెడ
నొదవదు ప్రాణంబు గావ నొం డొకఁ డిదియున్
మది నూహింపఁగ ముచ్చిమి
నొదవించి కొనంగ వలసి యున్నది నాకున్. 286

తే. ప్రాణములు వోవకుండఁగ బరిహరింప
నొం డుపాయ మెయ్యదియు లే కుండెనేని

1. పుట్టలున్ 2 తోలొలిచి

మ్రుచ్చిమియు ధర్మమగు నధ ముని ధనంబు
గొనుట యెందును ముఖ్యమై చనుట గలదు. 287

వ. కావునఁ జండాలధనం బగుసారమేయమాంసం బపహరించి ప్రాణహాని పరిహరించికొందు నని నిశ్చయించి యుండ నర్ధరాత్రం బగుటయుఁ జండాలురెల్ల నిద్రింప నల్లన లేచి చని యమ్మాంసంబు పట్టి తిగిచిన నచ్చేరువ నిద్రించు చండాలుండు విధివశంబున మేలుకని నీ వెవ్వండవు మాంసంబు మ్రుచ్చిలించెదవు నిద్రపోవం జుమ్ము నిన్నుఁ బొరిగొనియెద ననుటయు భయంపడి గ్రక్కున న మ్మునిపతి యేను విశ్వామిత్రుండ నని పిలికిన వాఁడు వినయంబున శయ్య డిగ్గి కరుణం గన్నిగొలుకం బ్రణమిల్లి కేలు మొగిడ్చి మహాత్మా నీ తలం పేమి యని యడిగిన నతండు సాంత్వనవచనంబుల నిట్లనియె. 288

చ. దరికొనునాఁకలిం దనువిదాహము పుట్టినఁ బ్రాణహానికిం
బరిహరణంబుసేఁత కిది పాపమయ్యైనను గుక్కసంజు డే
భరపడి మ్రుచ్చిలించెద విభావసుఁ డెంతశుచిత్వసంపదం
బొరసియు సర్వభక్షకతఁ బొందునునన్నునుజూడుమట్లుగన్.
వ. అనిన విని చండాలుండు. 290

తే. కుక్క మృగములలో నెల్లఁ గుత్సితంబు
దీనిఁ దని ధర్మమున కేల హాని సేయ
నొం దుపాయంబు వెదకికొ మ్ముజ్జ్వలాత్మ
యనుడు వానికి ముని యిట్టు లనియె నధిప. 291

క. విను బ్రహ్మవహ్ని నాకుం
బెనుఁబ్రాపై యుండ నేను వెఱతునె యెట్లై
ననుఁ బోవ నీక ప్రాణము
దనువున నిల్పుటయ చూవె ధర్మం బరయన్. 292

ఆ. బ్రదికియున్న నేఁ ద పంబున విద్యను
బాచికొనఁగ నేర్తుఁ బాతకంబు
నట్టు లగుట జీవితా ధార మైన యీ
నంజు డిప్పు డెట్లు నమల కుడుగ. 293

చ. అనుటయు నంత్యజుండు నగియెట్టివిధం బధమంబుగాక నె
ట్టన యది ధర్మమే కటకటా మిముబోంట్లకు నిట్లు సేయఁ
గాఁ జనునో యన్న నమ్ముని ప్రశస్తుఁ డగస్త్యుఁడు
దైత్యమాంసముం దినఁడె నశించెనే యతని తేజముఁ బెం
పును నంతనుండియున్. 294

వ. అనవుడు వాఁడిట్లనియె. 295

క. పరహితము సేయఁబూనిన
పురుషుఁడు పాపంబు సేసి పొందఁడు కీడుం
బరముని యగు నగస్త్యుఁడు
పరోపకారార్థకృతి న భవ్యుం డగునే. 296

క. నావుడు మదాత్మ బ్రాహ్మణ
తావిద్వత్త్వాస్పదంబు దానికిఁ గా నే
నీవిధి యొనరించుట పా
పావేశము లేదు దీని కడ్డపడకువే. 297

క. అని ముని పల్కిన నంత్యజుఁ
డను మాంసము విడువ నోప కనుటగఁ దలఁపం
జనునె భవదీయతేజో
ధనహానికిఁ గరుణ పుట్టదా యెవ్వరికిన్. 298

వ. అనవుడుగాధినందనుండు. 299

తే. కరుణ గలవేనిఁ బ్రాణంబు గాచికొనఁగఁ
దలఁచు నాకు నిమ్మాంసమి మ్మలఘుచరిత
యట్టులైన బ్రముచ్చిమీయు లే దన్నృత మెడలి
పడయువస్తువు సేయదు పాతకంబు. 300

వ. అనిన విని చండాలుం డిట్లనియె. 301

క. అతిశయిత పుణ్యదీప్తులు
ప్రతిగ్రహము నీచనరుని పాలం జేయన్
మతిఁ దలఁపఁ గూడునే వి
శ్రుతగుణ యే వెఱతు నింకఁ జూఱచుటఁ బల్కన్.

వ. నీవలచినయట్లు సేయు మని సారమేయమాంసం బిచ్చినఁ
బుచ్చికొని దానం బ్రాణంబులు రక్షించుకొని విశ్వామి
త్రుండు సనియె నింద్రుండు తదనంతరంబ లోకంబులవడ
దేఱ వర్షించె నంత హర్షించి యత్తపస్వివర్యుండు దపోవిశే
షంబున దోషంబు నీఁగికొని మనీషిజనస్తుత్యం బగునిత్యవ్ర
తంబున విలసిల్లెనాపత్సమయ సమాచారంబిట్టిదయనిచెప్పిన
భీష్మునితో భూవల్లభుండు ధర్మసూక్ష్మప్రకారం బింతదురవగా
హంబగునే యీయితిహాసంబాకర్ణించుటనాడెందంబు విషా

దానంబు నొందెద ననవుడు నతండు ధర్మంబు బహుశాఖాసమ
న్వితంబై యుండు రాజులకు నెల్లతెఱంగులు నెఱుంగవలయు
విషాదం బేల యనవుడు నజ్జనవిభుండు. 303

## భీష్ముండు ధర్మజునకు శరణాగతరక్షణసుకృతం బెఱింగించుట

క. శరణాగతసంరక్షణ
పరులకు సమకూఱు నెట్టి పాటిఫలము ని
ర్భరకరుణాకర పరమా
దరమున నెఱింగింపు నాకుఁ దాని తెఱంగుల్. 304

ఆ. అనిన భీష్ముఁ డిట్టులను ముచుకుందుండు
నాఁగఁ బరఁగుధరణీనాయకుండు
దనుజమంత్రి చేత వినినది యొక కథ
యఖిలపాపహరణ మాచరింతు. 305

వ. అయ్యితిహాసంబు సెప్పెద దాన నీయడిగినయర్థంబు దెలియు
నవహితుండ వై యాకర్ణింపుము. 306

సీ. పాపాత్ముఁ డొకబోయ పక్షుల వధియించి
తినియును బెక్కమ్ముఁ గొనియు నదియ
బ్రదుకుగా దానికి బహుసాధనంబులు
సవరించుకొని మహాటవిఁ జరింప
నొకనాఁడు పెనువానయును గాలియును ముట్టి
సకలజీవులకు నాశంబు పుట్టు
నట్టిది యై కాననయంతయు జలమయం
బైన బెగ్గిలి యన్నరాధముండు

తే. 1వేగ వక్షోడి యెల్లను వెడలి మిఱుత
నొకవనస్పతి జొంపమై యున్న దానిఁ
జెంది రాత్రి యగుటయు శిలయు సెజ్జ
గాఁగ శీతార్తుఁడై యుండెఁ గౌరవేంద్ర. 307

క. ఆలుబ్ధకుఁ డత్తరువర
మాలోకించి కడుభక్తి ననియె నిచటి భూ
తాలిం గొలిచెదఁ గరుణా
శీలత ననుఁ గాచుటకు విశిష్టవినీతిఁ. 308

వ. అని యి ట్లప్పక్షిధ్వంసకుండు శయనంబు ప్రాపించియుండ
నమ్మహీరుహంబు కోటరంబున వసియించి యుండునది
యొక్క కపోతంబు దనవల్లభ యెటయేని మేఁతకుం బోయి
రాక తడసిన శోకించి. 309

సీ. ఎచట నున్నదియొకో యింత ప్రొద్దొకచోట
నుండునే ననుఁ బాసి యుజ్జ్వలాంగి
యమ్మేను లేకున్న నిమ్మేనికలిమి ని
రర్థకం బధికాను రాగయుక్త
యగుసతిగుణములై యిహాముష్మిక
సుఖసాధనంబులు సువ్వె పతికి
నేకారణంబున నేనుయ్యోనో వాన
యేపునఁ దెగియెఁ గానోపు నకట
తే. నేమి సేయుదు మందిరం బిపుడు పాడు
వాఱుచున్నది యనఁగ నెప్పలుకులెల్ల

1 వెల్లు వక్షోడిఁ బడి యాత నుల్లి మిఱుత

బోయవలలోన నున్నకపోతి విని మ
నంబు సంతోషపూరనిమగ్నంబు గాఁగ. 310

క. పతిమదికి నింత యెక్కిన
యతివ గదా పుణ్యవతి ప్రియాలాపము లీ
గతి వినఁ గాంచితి జన్మము
కృతకృత్యం బయ్యె నాకు గెలిచితి జమునిన్. 311

వ. అని యుల్లంబునన యుగ్గడించి పతికిం దన తెఱం గెఱింగించి విధికృతంబునకు వగవం బని లే దని మఱియు నిట్లనియె.

చ. శరణముసొచ్చినం దగఁ బ్రసన్నతఁ గైకొని రక్షణంబు సా
దరముగఁ జేయు టత్యధిక ధర్మముగా బుధకోటి సెప్పు నీ
వరసి మహార్తు వీని శరణాగతు నోపినభంగి నాపదం
బొరయక యుండఁ జేయుము ప్రభూతపు సీతునఁ గొంకువోయెడున్

క. అని యేర్పడ భాషించిన
విని శోకము డిగ్గ విడిచి విహగము గరుణం
దనజాతి సెప్పి తగ ని
ట్లనియె మనుజభాషణముల నాలుబ్ధకుతోన్. 314

క. ఓయన్న డస్సినాఁడవు
మాయింటికి నతిథి వైతి మసలక నీకుం
జేయ వలయు నాతిథ్యం
బేయది భవదీప్సితార్థ1మెఱిఁగింప వనా. 315

చ. అనవుడు నుల్ల మెంతయుఁ బ్రియంబు వహింపఁగఁ బక్షివైరి సీ
తున సకలాంగకంబులుఁ బ్రతున్నములయ్యెడు దీనిఁ బాపవే

1. మెఱిగింపు తగన్

యనినవిహంగమాంబు రయమున మఱఁగ నచ్చటిపుల్లలెల్ల ము
క్కునఁ గొని తెచ్చి ప్రోవిడి యనేకుం శీతమైనదయాగుణంబునన్.
వ. ఆపాంతపల్లియకు రయంబునం జని పుల్లతల సంగితం బైన
యింగలంబు. 317

క. కొని వచ్చి పుల్లపొన్పున
నునుకంగాఁ జేసి నెమ్మి నిదఘుకొత్తఁగ ని
ల్లను బోయతోడ మే నీ
యనలంబునఁ గాఁచికొనుటకై లె మ్మనఘా. 318

చ. అనవుడు వాఁడు గువ్వహృదయం బలరం దయతోఁగకంబు ల
య్యనలశిఖాకలాపమునకు నల్లన యల్లన కాఁచి శీతబా
ధనము హుగంగఁ జేయఁగఁ బదంపడి యాఁకలిచాలఁ దోఁచెదోఁ
చిననెఱిఁగించె గువ్వ కది సేయ నుపాయము లేక యాత్మలోన్.

వ. వగచి వెలువెలం బాఱి తలంచికొని వానికి ట్లనియె. 320

తే. ఖగములను జీవనం బనఁగలదె సంగ్ర
హించినట్టిది యాఁకలికేమి యైన
మాకు దొరకొన్నఁ దిందుముగాక యైన
నీవు డస్సితి వాతిథ్య[1]నియతి వలయు. 321

కపోతంబు దనశరీరము బోయ కాహారంబుగా నిచ్చుట.

వ. నాశరీరం బాహారంబుగా నిచ్చెదఁ గొనుము. 322

క. అని పలికి యగ్ని నలగొని
తనదేహము దాని కోసరి దడయక యిడినం

1 నీతి

గని బోయ విస్మయంబున
మన మూఱఁగఁ గొంత సేపు మ్రాన్పడి యుండెన్. 323

వ. పదంపడి. 324

మ. కలదే యిమ్మెయిఁ బౌరుషంబు జగతిన్ గారుణ్య మేపార ని
ష్ఠలుఁ గిట్టిచ్చునె మేను నాదుచరితంబుల్ నిందకుం బట్టులై
తలఁపన్ వచ్చిన నింతకే డగునె యేతత్క్రూరతాఘోరవే
ష్టలు మానంగలవాఁడఁ బక్షిగురువై సంధించె సద్బోధమున్.

వ. అని యంతరంగంబున వైరాగ్యంబు నిరంతరం బగుటయు
నంత నిలువక. 326

మ. ఇది యిట్లాలిని బంధులం బాఱఁగి తానీయగ్నిలోఁ గూలెనొ
ప్పిదమైయుండఁగ నిట్టితెంప యొలయం బెంపారు వైరాగ్యసం
పద పాపంబుల నెల్లఁ ద్రుంపఁగ మహాప్రస్థానపుణ్యాత్వమొం
దెద నేనిప్పుడయంచు మానసము శాంతింబొందనిర్మోహుఁడై.

క. వలలోన నున్న పులుఁగుల
వెలువడఁగా విడిచి వలయు వెండియుఁ దనకుం
గలపక్షినిహతిసాధన
ములు నచటనె యుండఁ బోయె బోయ నియతుఁడై.

ఆ. అక్కపోతి నాథుఁ డగ్నిలోఁ బడుటకు
శోకవహ్నిఁ జిత్త మాకులముగ
నెలుఁగు రాలుపడఁగ నిట్లని పలవించె
నశ్రుజలతరంగితాస్య యగుచు. 329

క. నా యాఁకలి కోర్వ వెపుడు
వేయైనను నేఁ గొనంగ వెండి యనుభవిం

తాయాస పడుటఁ గనుఁగొని
వోయుదు ననుఁ బాసి యిటు సహనుట దగ వగచెనే.

వ. అని వెండియు. 331

సీ. ఇగురుజొంపంబుల § నిం పారువిరులను
బలు పైనపొదల కే§ళివలకుఁ దార్చి
సెలయేఱులందలి § తెలినీటఁ దనువుసాం
పెలసినగిరుల1తే § ప్పలకుఁ జేర్చి
మావిమ్రోకల నెల § దీవలఁ జెన్నొందు
తోఁటలకడ 2నలి § తోడఁ జెంది
యలరు నెత్తమ్ముల § కలిమిఁ జెల్వగు డిగ్గి
యలతీరభూముల § నల్లఁ బొంది
తే. నన్ను మనమునఁ దేల్చి యా § నంద మొందఁ
గేళి సలిపెడునీ దగు § లీల మఱవ
నావశంబె ప్రాణేశ ప్రా § ణంబు లిపుడ
నిన్న కూర్చి యేతెంతు నీ § సన్నకడకు. 332

వ. అట్లుం గాక 333

క. తేని యనుమరణమునఁ దన
మేను విడిచినట్టికాంత § మేలిపదవికిం
దాను నతండును నరిగి య
నూనస్థిరసుఖము లందు § చుండుట విందుక, 334

క. అని పలికి యపుడ యనలము
ఘనముగ దరికొల్పి మది విశ్వాసముఁ బొందం

---

1 తెం ( పలుకు, 2 నర్గి • తోడఁ

దనవల్లభుఁ దలఁచుచు వల
గొని లీలం జొచ్చి యతనిఁ గూడం జనియెన్. 335

క. స్ఫురిత విమానముమీఁద న
మరతతి వేష్టింప రత్న మయభూషణుం
డరదివ్యమూర్తి వెలిఁగెడు
వరునిఁ గలసి పరమసౌఖ్య వైభవ మొసఁగెన్. 336

తే. లీల మూఁకలో నచ్చర లేమపిండు
బలసి యభినందనము సేయఁ బొలిచె నిట్లు
సనిన పక్షియుగ్మంబు వర్తనము దోఁచెఁ
బుణ్యావర్తనుఁ డగుట నా బోయ కపుడు. 337

వ. తోఁచిన నతండు. 338

క. ఏనును ని ట్లగుదు ననుచు
నూనినకౌతూహలమున నుల్లము వొదలన్
మే నెల్ల ముద్దు సింపఁగఁ
గానఁ దఱిసి గళితరక్త కలితాకృతి యై. 339

తే. అరుగు చూడువాఁ డొకచో ద వానలంబు
గట్టెదిరి కాననం బెల్ల ముట్టిమండ
సంప్రమోదితచిత్తుఁడై చక్కఁ జొచ్చి
యొడలు దొఱఁగి దేవత్వంబు వడసి యొప్పె.

ఉ. ఈ యితిహాస మర్థిమెయి నెజ్జనముల్ వినినం బఠించినం
బాయు నుదాత్తగోహననపాతక మైనను భూరిసౌఖ్యముల్
వేయువిధంబులం బొరయు విన్మ తగన్ శరణార్థిఁ దోషితుం
జేయనివాఁడు కల్మషముఁ జెందు నొకప్పుడుఁ బాయ దేమిటన్

వ. అని యిట్లు శరణాగతరక్షణఫలవిశేషప్రకటనం బగు లుబ్ధక
కపోతాఖ్యానంబు సెప్పిన విని యక్ష్వితామహానుసహోదరం
ప్రీతి వినయవిస్తారవిలోకనం బెలయ నప్పాండవాగ్రజుండు.

క. పాపంబు బుద్ధిపూర్వ
వ్యాపారము గాక తొడరి నప్పాపము మనుజుం
జేపాట దాని నంతయుఁ
బాపికొనం జాలు సుజన బాంధవ చెపుమా. 343

వ. అని యడిగిన నయ్యార్యవర్యుం డాధరణీశేఖరుండు ధర్మనందనున కిట్ల
నియెఁ దొల్లి పరిక్షిత్తనయుం డగు జనమేజయుం డను మహా
రాజు దన కబుద్ధిపూర్వక బ్రహ్మహత్య వాటిల్లినం దత్కిల్బి
షంబు వాపికొనియె నది పురాణకథయై మునులచేత వినం
బడు నత్తెఱం గెఱింగించెద నాకర్ణింపుము. 344

క. పాపంబు దొడరుటయు నా
భూపాలకుఁ బ్రజయు విడిచె భూసురులును నిం
దాపాత్రంబుఁగఁ జేసిరి
తాపము మదిఁ గదిరి యతఁడు దల్లడ మందెన్. 345

తే. అట్లు జనమేజయుఁడు నగ నార్తిఁ గూరి
పురము వెడలి యొక్కరుఁడును బోయి కాన
నాంతరము సొచ్చి శౌనకుం డనుమునీంద్రు
నాశ్రమము రోసికొని చని యమ్మహాత్ము. 346

వ. కాంచి దండప్రణామం బాచరించి సవినయంబుగఁ గరంబులు
మొగిచి నిల్చినం జూచి యాతండు. 347

చ. ఘనుఁబాల వల్చుచున్నయది పీనుఁగుఁ జూచినయట్లు
లమ్మ్యోన్మజా౹ వినుఁ గనుఁగొన్న నీయెడకు నీవిది యేటికి
వచ్చె వెక్కుడే౹ జనుము శిరంబు క్రిందుగ నజస్రము
నేలఁ గలాండఁ వైభవం౹ బునతుదిఁ గ్రూరకాకచయముల్
పొలుపఁగ నాకాధివాసినై. 348

చ. అనుటయు గర్వ కర్వుఁ డగు నట్టిదురాత్మునిఁ బూజిత
వ్రతులె౹ గనె యిటు లంట యుక్త మటు గాన కదా భవ
దీయ పాదవం౹ దన మొనరించి మీనలన దారుణపాపము
వాచికొందునే౹ నను మది వచ్చినాఁడ సదయం బగు
చూడ్కిఁ బరిగ్రహింపవే. 349

వ. అనిన విని కరుణాయత్తచిత్తుం డగు నత్తపోధనసత్తముం
డిట్లనియె. 350

క. విను కొంద ఱల్పబుద్ధులు
నను నెంతయు ధిక్కరింప నవ్వఁగ వారిం
గొనక బుధు లైనవిప్రులు
ననిమిషులును మెచ్చుచుండ ననియెద నీతోన్.

క. హీనప్రజ్ఞుఁ డకార్యము
లైనవి సేసి తుది వగచు నతులప్రజ్ఞా
సానుమదార్యాఘుఁడు వగ
నూనఁడు దురిత మనువఱితి గోడక యునికిన్. 352

వ. ప్రజ్ఞాకార్యంబు లై యనుష్ఠింప వలయువానిం జెప్పెద నీకుం

శాపంబు నెడ ననుతాపంబు గలిగె మోక్షధర్మప్రవిష్టుండనై
యనుటయు నమ్మనుజనాథుండు.

క. తాపసవర తీవ్రం బగు
పాపాగ్నిజ్వాలచయము పాలు పడి పరి
తాపము నొందుచు ధర్మ
వ్యాపారజలాభిలాషి నై యున్నాఁడన్. 354

వ. భవదీయకృప నాశ్రయింప వచ్చితి నన్ను రక్షింపవే యన
వుడు నమ్మునీంద్రుండు.

క. భీతి యొకటి గోరుటయును
నీతలఁపులలోన దీని కిది గత మనఁగా
నేతెరువును గలుగదు మ
చ్చేతోగతి ధర్మవృత్తిఁ జిక్కుట దక్కన్. 356

క. ఆతురత నీవు నాకడ
కేతెంచినదానఁ జేసి మెలసినధర్మ
ద్యోతనకౌతూహలమున
నీతోఁ బడ వలసె వినుము నిశ్చలమతివై. 357

క. భూవిబుధుల కెయ్యది హిత
మావిధమున నడచువాఁడ వగునది ద్రోహా
భావంబు ప్రతిజ్ఞాతం
బై వెలయఁగ వలయు నీకు నాజాతియెడన్ 358

చ. అనవుడు ధర్మవృత్తము మహాత్మకు నైజము దోషవృత్తికిన్
మునివర యేను భీతుఁడ నసముజ్జ్వలవిప్రకులంబు నాకు మ

న్ననలకుఁ బాత్రమెవ్విధముఁ గనంజెఁ ద్రోహముదానియందు నా
మనము దలంప దింతకును మాన్య భవచ్చరణాంబులాలెదక్.

వ. అనుచుం దదీయపాదస్పర్శనంబు సేసి యవ్విధంబునఁ గృత
కపథుం డగుటయుఁ గరుణాగోచరంబగు చిత్తంబుతో నత్త
పోధనవర్యుం డాదరమేదురావలోకనం బా భూపాలుని మీఁద
నోలయ నిట్లను నట్లని జెప్పెద నవహితుండ వయి యాక
ర్ణింపుము. 360

సీ. శ్రీమంతుఁడును బలశ్రేష్ఠుండు నగురాజు
భోగంబు దర్పంబుఁ బోవ విడిచి
ధర్మంబు గైకొని తపమును దానంబు
నధ్యయనంబును యాగవిధులు
నాచరింపఁగఁ జూచి యచ్చెరువడి యను
గ్రహము సేయదె భూతరాజి యతని
కధిప యయాతివాక్యము సత్యమెఱుఁగింతు
వినుము సరస్వతియును దృషద్వ

తే. తియును ననుపుణ్యనదులందుఁ దిరిగి తీర్థ
సేవ సేయుచు నధ్యయనావధాన
దానసద్భూతరాగత్వదయలు గలిగి
వరఁగఁ బాపకళంకలేపంబు వాయు. 361

వ. ఇదియునుం గాక యొక్కపరమస్మృతి సెప్పెద వినుము

చ. చరితము సేసి తాపమునఁ దూలిన నింకిటు సేయ నన్మతిం
బోరసిన ధర్మసంచరణబుద్ధియ మేలని యూఁదినం గ్రియా

పరుఁడయి మేలు సేసినను బాదముపాదముగా నుగ్రవాంబునన్
విరియు సమస్తముం దదభివిష్టకళంకము నిర్భయంబుగన్.

చ. నరవర వాసవుం డడిగినన్ గురుఁ డిట్లని చెప్పె బుద్ధితోఁ
బొరయనిపాతకంబులు సబుద్ధికపుణ్యములన్ నశించు నం
బరమునఁ బట్టినట్టిమలపంకము గారములోన నద్దఁగా
విరిసినయట్లు నమ్మ మిదివేదము సెప్పిన నేనుఁ జెప్పితిన్.

వ. అని యిట్లు బహుప్రకారంబులం గారుణికోత్తముం డగు
నత్తాపసోత్తముం డాభూవరు బోధించి తీర్థసేవాదిపునశ్చర
ణంబులం బరిపూతాత్ముం గావించి యశ్వమేధంబు సేయిం
చిన నుజ్జ్వలుం డయి యజ్ఞనమేజయుండు నిజరాజ్యంబు
పరిపాలనంబు సేసె నని చెప్పి వెండియు. 365

భీష్ముఁడు ధర్మజునకు గృధ్రజంబుకోపాఖ్యానము సెప్పుట.

సీ. గాంగేయుఁ డిట్లనుఁ గౌంతేయపూర్వజు
నకు విదిశాపట్టణమున నొక్క
బాలుండు మృతుఁ డైన బంధులు ప్రేతభూ
మికిఁ గొనిపోయి యప్రమేయశోక
వినశాత్ము లై పలవింపఁగా గ్రద్ద యొ
క్కటి వచ్చి మీఁద లెక్కడ భయంబు
దక్కి యేఁప్పుచునుండఁ దగ దిదె కుక్కెకైఁ
బొద్దు రాక్షసులును భూతములుఁ బి

తే. శాచములు వచ్చి తిన నిపు డేచి వచ్చు
జననమరణముల్ వింత లె చన్న శిశువు

తోన యుండఁగఁ జనుటకుఁ బోనియ్యఁడు
వారలే పోదు కీడునుం గన్నెఁచి వేగ. 366

క. తెగి పోయినవా రెక్కడ
నగుపడుదురే పెద్దలార మానుఁడు మీరుం
దెగడుదురు పడసిన నాపుడు
నగు నట్టిద కర్జ మనుచు నేనాదట భీతిన్. 367

వ. శవంబు విడిచి పోవం జూచిన నొక్క నక్క బొక్కలోనుండి
వెడలి వారలతోడ. 368

సీ. గద్దమాటల కేల కడు భీతిఁ బొందితి
రక్కటా బాలుని నబ్బవదను
నిటు సైచి పోవఁ గాకెట్లకో నేడ్వఁడు
శోకంబు పోవ నికఁ జొప్పటఁ గొంత
ప్రొద్దంతలో విధి కూరిరుండు గాకున్నఁ
బ్రాణంబు గ్రమ్మఱం రాక గల్గు
నో యెఱుంగుదు రే యినుండును నస్తాద్రిఁ
జేరఁడు వెఱవక మీరు నిలువుఁ

తే. పలిన వారును మనమున నాస పుట్టి
మగిడి వచ్చిన గ్రద్ద యున్మాదబుద్ధి
యైన నక్క మాటలు వినఁ దగునె వికృత
మయ్యెఁ బీనుఁగు వచ్చు నేఁ యసువు లింక. 369

క. కడు బెట్టిదుండు కాలుఁడు
మిడుక మిడుక నపహరించు మీ గీయాసల్

విడువుఁడు బాలునికి సుగతిఁ
బడయుఁడు దానాదులైనబహుధర్మములన్. 370

వ. అని పలికిన నాగృధ్రంబువచనంబు లాక్షేపించి యజ్జంబు
కంబు వారల నుద్దేశించి. 371

క. కూర్రంబు గృధ్రి మిట్టి కు
మారకునిం జూచి చూచి మసలక పోవన్
మీ రెట్లోర్చెదరో క
న్నీ రిటు ననుబోఁటులకును నిలువ కొలికెడున్. 372

క. దయ మాలి పోవ నేటికిఁ
బ్రయత్నమునఁ బాదువ దైవబలమున మీకుం
బ్రియ మెసఁగ బ్రదుకు బ్రదుకం
డయినను మఱిపోవరాదె యని చెప్పుటయున్. 373

వ. గృద్ధ యి ట్లనియె. 374

ఆ. ఏను బుట్టి వేయు నిన్నూఱు.
మున్నూఱుఁ గలవు వత్సరములు గాన నెందు
బాలు యౌవనస్థుఁ బ్రౌఢుని వృద్ధునిఁ
జచ్చి పోయి మగిడి వచ్చువాని. 375

క. ఒకటి గలదు వత్తురు వే
శోకగర్భంబునకు మృతులు 1నుక్కివ వహాస
క్కకు నేటిబుద్ధి పీనుఁగు
నకు బ్రదు కెటు కలుగు నిట్టినవ్వులు గలవే. 376

1 యుక్తి వహామె; యుక్తి నిజమె

సీ. అనవుడు 1నెగ వెక్కి యాబిడ్డ నైచి పో
రెడువారలకు నడ్డపడుచు నక్క
వినుఁడు రాఘవుఁడు నేర్పున బ్రదికింపఁడే
మృతుఁడైనభూసురసుతుని మగుడ
సృంజయునకొడుకు నిచ్చిన నారదుఁడు ప్రభా
వంబునఁ గ్రమ్మఱవానిఁ దేఁడె
యట్టులయొకసిద్ధుఁ డమరుండుమీయేడ్పు
లాలించి దయ బాలునసువులొసఁగ

ఆ. నేని మేలు కాదె యిది యేల పోయెద
రనిన వారు మగిడి యరుగుదెంచి
శిశుశవముచుట్టుఁ జేరి పెల్లేడ్చిరి
పనవి పనవి యంతనినుఁడుఁ గ్రుంకె. 377

వ. ఆగృధ్రంబును జంబుకంబును నాఁకలిచేత వందురుచుండి తాన తాన బాలశవంబు నాహారంబు గొనుటకై యివ్వి ధంబునం దమతమపల్కు నేర్పున నజ్జనంబుఁ గ్రమ్మఱించెఁ బొద్దు గ్రుంకినం దా నచ్చోట నిలువ నేరదు గావున గ్రద్ద యట మున్న వారు వోవునట్టితెఱంగుమాట లాడె రాత్రి యైనం దనకు మేలు గావున నక్క వారలు దడయుటకుం దగినచందంబుఁ జెప్పె నది వానితెఱంగు ప్రేతవనవిహారనిర తుం డగు శంకరుండు కరుణాకింకరుండు నగుట నప్పుడు. 378

ఆ. అట్లు పనవి యేడ్చునజ్జనంబులకుఁ బ్ర
త్యక్షమై వరంబు లడుగుఁ డనిన

---

1 నెక వెక్కి; వెకివెక్కి.

సంప్రమోదభక్తి సంభ్రమభరితులై
చక్క నవనిఁ జాఁగిలఁబ్రొక్కి వారు. 379

క. బాలమరణశోకంబునఁ
దేలక యుండంగఁ గావు దేవోత్తమ నీ
వాలించిన బ్రదికితిమి ద
యాళుహృదయ పార్వతీప్రి యా చంద్రధరా. 380

వ. అనుచు లేచి నిలుచుటయు శివుండా శిశువుప్రాణంబు లొసంగి వీఁడు శతాయుస్సంపన్నుం డగువాఁ డని యానతిచ్చి యాగృధ్రజంబుకంబులకు నాఁకలి యెన్నండును లేక యుండం బ్రసాదించి యంతర్హితుం డయ్యె సంతోషంబున నంతరంగంబులు నంగంబులుం బొదల నజ్జనంబులు బాలు నెత్తికొని పలుమఱుం జూచుచుఁ గౌఁగిలించుచుం జనిరి గృధ్రంబును జంబుకంబును ముదంబునం బొంగుచుం బోయి తమతమకులంబులలోఁ బ్రభూతంబులై ప్రవర్తిల్లె నార్తజనబాష్పప్రమార్జనంబు ప్రభువులకుం గర్తవ్యం బగుటకును నిజకార్యార్థు లగు కపటుల నేర్పుమాటల తెరువు లెఱింగికొనుటకును నుదాహరణం బైనయీగృధ్రజంబు కోపాఖ్యానంబు. 381

క. వినినఁ బఠించిన వ్రాసినఁ
గొనియాడిన దురితపీడ కుం దొలఁగి నరుం
డనుపమధర్మములకు భా
జన మగు నాయుఃప్రవృద్ధి సంపద నొందున్. 382

భీష్ముఁడు ధర్మజునకుఁ బవనశాల్మలీతరు సంవాదము సెప్పుట.

సీ. అని వినతుం డగు నాధర్మసుతునకు
ముదమునఁ జెప్పి భీష్ముండు మఱియు
ని ట్లను నిది యొక్క యితిహాస మధిప యా
కర్ణింపు హిమవన్నగంబునందుఁ
గల దొక్కబూరువు గడుఁబెద్దకాలంబు
ముదురు శాఖాశోభి మూలదృఢము
నారదముని యొక్క నాఁ డత్తరువుపొంతఁ
జని చని వేడ్క ని ట్లనియె నెమ్మి

తే. బూరువా యింతపఱపును బాడవుఁ గల్గి
నీవు మృగపక్షిసంశ్రయ ణీయ మగుచు
నునికి గని ప్రీతి నడిగెద ననిలుచేతఁ
బడు[1]నొకప్పుడు తరులు నీ వడమి యెట్లు. 383

క. పవనునకును నీకును బాం
ధవము గలదొ యతఁడు నిన్ను దయ రక్షింపన్
సవినయవృత్తిని బ్రతికితొ
చెవులకు నిం పెసఁగ నిజము సెప్పుము నాకున్.

క. అనిన విని బూరు వి ట్లను
ననిలునిబల మస్మదీయ మైనబలముతో
నెన గా దేర్పడ విను పదు
నెనిమిది యగునంశమునకు నేనయు దరయఁగన్.

1. మహీజము లెల్ల న

వ. అని పలుకుటయు నమ్మునీంద్రుండు. 386

ఆ. అమ్మచెల్ల యిట్టు లనకుము గొండలు
లోను గాఁగఁ బవను చే నపాస్త
మహిమ గలుగు పెఱుఁగు మా భూతములచేష్టి
తములు వాయువశగ తములు గావె. 387

క. అనుటయుఁ బెలుచని యెలుఁగున
ఘనమూలప్రబలశాఖ కాదుర్జయు న
న్నును దాఁకిన నతనిప్రభం
జనుఁ డనునామంబునకు న సత్యత వచ్చున్. 388

వ. అని గర్వంపుమాట లాడినయాశాల్మలిం జూచి సురముని
ప్రవరుండు. 389

చ. మఱవక యుండు నీబిరుదు మాటలు నీ విటులంట మా
రుతుం। డెఱిఁగెడు నెట్లు నంచు వెస నేఁగి సమస్తముఁ
జెప్ప నాతఁ డే। ద్రైఱఁ జనుదెంచి నీ వఱె క డిందిమగం
డవు నిన్నుఁ దాఁకినం। జెఱుఁ దఱె-పేరు బూరుగ నశించితి
గా కిట పల్కఁ డేటికిన్. 390

మ. అని కోపంబునఁ బల్కి నప్పవనుతోఁ నాభూరుహం బింతపె
ల్చున నీ వాడెడునంతతక్కువని చే లా లోకసామాన్యవృ
క్షునికాయంబును నన్ను నొక్కటిగ నిశ్చం జూచితే యన్నన
ల్లనిన వ్వొప్పఁగ నాసమీరణుఁడు హే లాస్ఫూర్తిఁ దైఱ
యిట్లనున్. 391

క. ఒకనాఁ డజుంకు సీనీ
డకు డబ్బా టపుగుపెంచు ఁ టయు నమ్మె లా
త్మకు ప్రేఁ గై మన్నించిన
మెకమెకపడి తెల్లు పలుకు ఁ ఖా తగ రేపున్. 392

వ. అని పలికి బలుమొగంబుతోడం బోయిన నబ్బ్యారువు
దలంకి. 393

చ. మనుగడ దప్పనోక్కొ మునిఁమాటలు గైకొన నైతినాబలం
బన నది యెంత యుగ్రతమఁహాబలురాకకు నోర్వఁ జాల నా
తని నొకభంగి గెల్తు ననిఁతాఁ దలపోసి హరించె నాకులుం
గొనలును జొంపముల్ నిడుద ఁ కొమ్మలు రే యగుడుక్
రయంబునన్. 394

వ. అట్లు తన్నుం దాన విఱుచుకొని యున్నంత వేగుటయు.

చ. ప్రతినకు నీడు గా భయద ఁ భంగిఁ ప్రభంజనుఁ డేఁగుదెంచి
యా। క్షితిరుహముం గనుంగొని యిఁసీ యిది నాపని నీవ
చేసి తీ। ధృతి మతి సంతసింపు ఇంట ఁ తేజముఁ బొందుము
నిను బాంధవ। ప్రతతికి నివ్విధంబుసదుఁపాయము మే లెఱిఁ
గింపు పెంపునన్. 396

వ: అని యుల్లసం బాడి సముల్లసద్గతి నాసదాగతి ననియె
నట్లు శాల్మలి పవనుచేత భంగంబు నొంది వగం గుందెఁ
ప్రబలునితోడ దుర్బలుండు దొడరి మత్సరగ్రస్తుం డయిన
నపాస్తవిభవుం డగు నని. తెల్పునప్పవనశాల్మలీ సంవా
దంబు పుణ్యప్రదం బయినయుపాఖ్యానం బని చెప్పిన. 397

ఆ. పాండవాగ్రజుండు పాపంబునకు నధి
ష్ఠాన మెద్ది భరత సత్తమాగ్రి
గణ్య దాని నెఱుఁగఁ గాఁ జెప్పు మనుడు నా
తనికి భీష్ముఁ డిట్టు లనియెఁ బ్రీతి. 398

సీ. వినుము పాపముల కెల్లను నధిష్ఠానంబు
లోభంబ యది గామలోలతయును
గ్రోధంబు మత్సరద్రోహంబులును బర
ధనదారవాంఛలు దైన్యపాటు
వ్రీడాక్షమాసత్య విముఖభావంబులు
గలిగించి ధర్మంబు గలఁచి నరునిఁ
బ్రయి మాలి యేమిటికైనను [1]గర్ధించు
వానిఁగా సమకట్టుఁగాన లుబ్ధ
ఆ. జనులఁ దొలఁగి లోభమనుతిరిం బడనిస
త్యవ్రతులను బరమ ధార్మికులను
బాపభీతమతులఁ బనిగొను లోభంబుఁ
జెంద నీకు నీమనుచి త్తవృత్తి. 399

వ. అనిన విని యజాతశత్రుం డజ్ఞానం బాపదలకును దుర్గతికిని
మూలం బని వింటి దాని తెఱం గెఱిఁగింపు మనిన నాపగా
తనయుం డమ్మనుజపతి కి ట్లనియె. 400

క. రోషము శోకము రాగ
ద్వేషము లభిమానదర్ప వేగాలస్య

1. వర్ధించు.

శ్లేషము లజ్ఞాన మని మ
నీషిజనము సెప్పు మాననీయచరిత్రా. 401

క. విను లోభము నజ్ఞానం
బును సదృశఫలప్రదములు పుట్టును లోభం
బున నజ్ఞానము గావున
జననాయక లోభ ముడుగ సౌఖ్యము లొందున్. 402

ఆ. అనిన ధర్మపుత్త్రుఁ డనఘ ధర్మంబు నా
నాప్రకారగతి వినంగఁ బడు మ
దీయచిత్తమునకుఁ దేటపడంగ వి
శిష్టధర్మ మెద్ది సెప్పు మనుడు. 403

వ. క్రియాం బాది భీష్ముం డతని కిట్లనియె. 404

## భీష్ముఁడు ధర్మజునకు దమంబు ప్రభావం బెఱింగించుట.

క. తత్త్వతమ కలవడు విజ్ఞా
నమ్ముల తెరువు లాదరించి నానాగతులన్
సుమతులు ధర్మము దెలిపిరి
దమము పరాయణము ధీరతమ యన్నిటికిన్. 405

తే. దమము నిశ్శ్రేయసము పుణ్యతమము ధర్మ
సార మది వెలిగా ధర్మసంచయంబు
సిద్ధిఁ బొందునె దమముతో బుద్ధిపొందు
గనినఁ బొందనియున్నతుల్ గలవె యధిప. 406

క. దమముం గడచినసద్ధ
ర్మము లే దని విందు నాశ్రమము లన్నిటికిన్

దమవంతుఁడు గామముఁ గ్రో
ధము లోభము మత్సరంబు దర్పము గెల్చున్. 407

క. శీలంబు మైత్రి కరుణ య
లోలుప భావము తితిక్ష లో నగు మునిలో
కాలంబనీయ సద్గుణ
జాలంబు దనుంబురూప సంపద యధిపా. 408

క. గుహాయందు నిహిత మనియెడు
మహనీయ బ్రహ్మపదము మహితదమత్వో
పహితుం డగువానికి స
న్నిహితం బని చెప్పుదురు మనీషిజనంబుల్. 409

వ. అని విశదంబుగా వివరించె. 410

ఆ. అట్లు దమముమహిమ యాదరంబున విని
యమృతసేవ సేసినట్లపోలె
హర్షమయమనస్కుఁడై భీష్ము నడిగె నా
ధర్మనందనుండు తపమువిధము. 411

వ. అడిగిన నతం డతని కిట్లనియె. 412

భీష్ముఁడు ధర్మజునకుఁ దపంబువిధము సెప్పుట.

క. తపము నిదానము ధర్మ
ప్రపంచమున కెల్ల దానిఁ గ్రమమున వ్రతతం
త్రపరాయణు లొనరింతు ర
ధిప ఫలములాంబువృత్తిఁ దృప్తిఁ బొరయుచున్. 413

క. విను మనోనిగ్రహము దమ
మనునభిధానంబు గలమహాధర్మము త
ద్ధనవంతుచిత్తవశగతిఁ
జను నఖిలస్థావరమును జంగమతతులున్. 414

తే. పంచవిధవృత్తు లగుమహాపాతకములు
లోనుగాఁ గిల్బిషము లెల్ల లుంఠితంబు
లగుఁ దపంబున సత్యశౌచాదు లోలయు
నఖిలసిద్ధులు నఱచేత నావహిల్లు. 415

వ. అనిన విని దేవపితృభూదేవగణంబులు సత్యంబు ప్రశంసించుఁ
దదీయస్వరూపంబును నది దొరకొను తెఱంగును నెఱిం
గింపు మని యడిగిన నజాతశత్రునకు శంతనుపుత్రుం డి
ట్లనియె.

## భీష్ముఁడు ధర్మజునకు సత్యస్వరూపాదులు చెప్పుట.

క. సమతయు దమముఁ దితిక్షయు
నమత్సరము హ్రీయు ధృతియు ననసూయార్య
త్వములు నహింసాదాన
క్షమాత్యజన సూనృతములు సత్యముమూర్తుల్. 417

క. సత్యాకృతు లగుగుణములు
నిత్యానుష్ఠితసమగ్ర నిర్మలయోగ
స్థిత్యభిముఖునకు సులభము
లత్యంతసుఖప్రదంబు లవి కార్యంబుల్. 418

చ. కుమారుసమస్తధర్మములకున్ వినుసత్యము యోగమోక్షస
త్పదములు సత్యకార్యములు పాపమసత్యముకంటెఁ జెంది లే
నుదలఁపనశ్వమేధములు దొమ్మిదినూఱులు వేడినూఱు నై
యొదవిన నీను గావు భరతోత్తమ సత్యముతోడ నారయన్
వ. అనిన విని ధర్మతనయుండరిషడ్వర్గం బేమిట నుదయించు
నెట్లు సనుయు నెఱింగింపవే యనుటయు ననిమిషనదీనంద
నుండు ధర్మనందనున కిట్లనియె. 420

భీష్ముఁడు ధర్మజున కరిషడ్వర్గాదులు దెలుపుట,

సీ. మనుజేంద్రసంకల్ప ♦ మునఁ బుట్టుఁ గామంబు
రూపఱు దేహని ♦ రూపణమునఁ
బరులదోషంబునఁ ♦ బ్రభవించుఁ గ్రోధ మ
క్షీణక్షమాయుక్తిఁ ♦ జేసి పొలియు
భూతాస్థిరత్వంబు ♦ బుద్ధిఁ గానమి లోభ
మసఘు జనించుఁ గాంక్షచిన నడంగు
నజ్ఞానమున మోహ ♦ మావహిల్లు నధర్మ
లేపవర్జనమున ♦ లేక తక్కుఁ
తే. గులమునను విద్య ధనమునఁ ♦ గలుగు మదము
మరలి వానివెం పూహింప ♦ ముంది పోవు
సాత్త్వికుఁడు గామిఁ బొడము మా ♦ త్సర్య మదియుఁ
జెడుఁ గురూత్తమ సాధుసం ♦ సేవనమున. 421

క. ఈయాఱింటను సకలా
పాయంబులు మానవులకుఁ ♦ బాటిలు వీనిం

బాయంగ జడియ నోపిన
ధీయుతునకు శుభము సద్గతియు సమకూరున్. 422

క. ఇవి దోఁడేళ్ళులభంగిం
గవియుఁ బురుషుధైర్యహానిఁ గని కొని ధైర్యం
బవలంబించిననరుఁ జే
రవు హానికి నిదియ తెలుఁగు రాజవరేణ్యా. 423

తే. అధిప యివి ధార్తరాష్ట్రుల యందుఁ జాలఁ
గలిగి యుండు నీబుద్ధి వొక్కండుఁ జొరదు
సారధీరతాసంపదుఁ దారమతివి
గాన యింకను నిర్జింతు వీని నెల్ల. 424

వ. అని వెండియు 425

క. హింసావిహారి యైనన్నృ
శంసుం డీయాఱుఁ గలుగు జనుకంటెను గీ
డాసప్రదేశలలితో
త్తంసీకరణోపలాల్య ధరణీవలయా. 426

క. మే లనుభవించుఁ జుట్టము
లాలోకింపంగఁ గుజనుఁ డడవియు నృశంసా
శీలము పంచి కుడుచుచతఁ
డేలోకంబుననుఁ బేర్మి యొసఁగ సుఖించున్. 427

వ. అని చెప్పి వెండియు. 428

ఆ. విను కుటుంబభృత్య జనజీవనంబుఁ ద్రి
వర్షములకుఁ గల్గువాఁడు నధిక

మొదవినట్టియతఁడు నుర్వీశ యర్హులు
మాననీయసోమపానమునకు. 429

క. క్రతువు లొనరించుభూసుర
తతికిఁ గ్రియాశేషయోగదానాదులు దు
ర్గతిఁ గొఱఁతవడిన ధరణీ
పతి నెఱపఁగ వలయు వానిఁబరికించి తగన్. 430

క. ధనధాన్య పశుసమగ్రుం
డనఁ బరఁగెడు నట్టివైశ్యుఁ డధ్వరముం జే
యనినాఁడు బ్రాహ్మణాధ్వర
మునకు నతనిసొమ్ము రాజు పుచ్చి యిడఁ దగున్.

క. కుడువక పెట్టక శూద్రుఁడు
కడు నెక్కుడు గూర్చినట్టి కనకముఁ గొలుచుం
బుడమిపతి ధర్మకృతులకు
నిడునది సగము గొని మేదినీశ్వరవర్యా. 432

క. విను విప్రులు పేద లగుట
మనుజేంద్రుని బుద్ధిలేమి మాతాపితృభా
వన నతఁడు వారిఁ బ్రోచినఁ
గను మేలున కెల్ల గలదె కౌరవనాథా. 433

క. ఆమద్రవ్యము మణియును
రామయు శుచు లగుటఁ గాదె రామారత్నా
రామత దగ వగు దుష్కుల
మై మెచ్చుమి దోఁచెనేని యనిరి మునీంద్రుల్. 434

క. అమృతము విద్యయుఁ బరమహి
తము సేయుటఁ బుచ్చికొంద్రు ♦ దానిని బానిన్
సుమతులు విషమువలన నై
న మహీశ్వర నీచ మనుజ ♦ నముచే నైనన్. 435

క. భూపాలక విను పంచమ
హాపాతకకరులుఁ బతితు ♦ లక్కడులఁ బ్రా
ణాపాయాంత ప్రతికృతిఁ
బాపుదు రత్యధికపుణ్య ♦ పరతను బాయున్. 436

క. యానాసనాన్నపానవి
ధానాదులఁ బతితు పెరసి ♦ తాఁ బతితుఁ డగున్
మానవుఁడు దపోముఖ ధ
ర్మానుష్ఠానములఁ బాచు ♦ నక్కిల్బిషమున్. 437

క. అన్నృతము పాతక మగు నై
నను వనితలయెడను బెండ్లి ♦ 1నవ్వున మృతి వ
చ్చిన సర్వధనముఁ జెడుచో
విను మది పాపంబుగాదు ♦ విమలచరిత్రా. 438

క. ఏపాపమేని లేనిది
కాపురుషత నొకనిమీఁదఁ ♦ గలిగించిన న
ప్పాపము సేసినవాఁ డగు
నాపాలువ యనంగ విందు ♦ మాన్యులచేతన్. 439

1. నాఁడును.

ఆ. తల్లిఁ దండ్రిఁ బాయఁ ◊ దగ కారణమునఁ
బాసె నేని వాఁడు ♦ పతితుఁ డాస
నంబు సెజ్జ భోజ ◊ నము చీర వటుకుమా
రులకుఁ బ్రీతి నొసఁగఁ ◊ బొలియుఁ గీడు.

వ. అనియె నట్టియెడం గృపాణరణనిపుణుం డగునకులుండు సక
లాస్త్రశస్త్ర సారవిశారదుండైన యబ్భాగీరథీసుతునకు
సవినయంబుగాఁ బ్రణమిల్లి ధనువుత్తమాయుధంబని చెప్పుదు
రది సర్వజన సమ్మతంబు ధనువునకు బాణంబులకు వైక
ల్యంబు వాటిల్లినయెడం బరవీరప్రహరణంబునకు నాత్మత్రా
ణంబునకుం గృపాణంబు మేలని యుండుదు నాతలం పెట్టి
దియో తెలిసికొన వలయుఁ దత్ప్రభవ[1] ప్రభావంబులుం
దదీయ పూర్వాచార్యునిం జెప్పవే యని యడిగిన. 441

భీష్ముఁడు నకులునకు ఖడ్గప్రభావంబు తెలం గెఱింగించుట.

సీ. అతనికి నాతఁ డి ◊ ట్లను బ్రహ్మజగములు
సృజియించి భూతసం ◊ సృష్టి సేయ
దివిజమర్త్యాది జం ◊ తువు లమ్మహాత్ము వి
ధించిన తెరువులఁ ◊ దిరిగి బ్రదుకు
చూడ దైత్యులు సము ◊ ద్దండత నన్యాయ
వర్తులై సురముని ◊ వ్రాతములకు
బాధ లొనర్ప న ◊ ప్పరమేష్ఠి హిమశైల
తటమున వేయువ ◊ త్సరము లధిక

1. ప్రకారములుం.

తే. నియతిమెయిఁ దపమొనరించి నిష్ఠఁ గ్రతువు
¹సేసె నయ్యగ్నిఁబుట్టె న శేషలోక
భీతికర మగు నుగ్రంపు భూత మొకటి
ప్రాంశుకృష్ణమై దంష్ట్రలు ప్రజ్వరిల్ల. 442

ఆ. అప్పు డినుఁడు మాసె ననిలుండు సుడివడి
వీచె నుల్క లురిలె వెఱఁదలంకు
సురల మునులఁ జూచి సరసిజభవుఁ డిది
నాదుమతమ యొండు గాదు వినుఁడు.

వ. ఇది రాక్షస నాశంబునకుం దోఁచిన యుత్పాతంబు ²లోకంబుల రక్షింపను రాక్షసుల వధియింపను సాధనంబుగా ఖడ్గంబుఁ గల్పించితి నని పలుక నాభూతం బారూపంబు విడిచి ఖడ్గాకృతి గైకొని తన మెఱుంగులు దిక్కులు దీటుకొనం బొల్చిన.

క. కమలాసనుండు నిజ చి
త్తము భక్తిమయంబు సేసి తలఁచె హరుని ఫా
లము కంటిమంటతో న
య్యమరవరదుఁ డేగుదెంచె నచటికి నెమ్మిన్. 445

ఉ. వచ్చినఁ దత్పదాంబురుహవందనపూర్వము గాఁగఁ బద్మజుం
డిచ్చెఁ గృపాణ మవ్విభుఁ డహీనసముద్యమలీలఁ గ్రాలుచుం
బుచ్చికొనంగ నాసభ యపూర్వమనఃప్రమదంబుతోడ నే
రచ్చెరువాటునొందె నటులయ్యసిఁ గైకొని మేను మెంచుచున్.

1. సేయ నయ్యగ్ని. 2. సురల రక్షింపను.

తే. హారుఁడు బెట్టుగ నవ్వి పెల్లార్చుటయును
విని సముద్ధతరయమున దనుజకోటి
మునుగఁ బఱతెంచి తాఁకిన మునుముకొని వ
ధించి యిల యెల్ల నెత్తుట ముంచె నతఁడుఁ 447

ఉ. దైత్యుల నిట్లు గీటడఁచి ధర్మము నిల్పి ప్రసన్నమూర్తి
సాం॥ గత్త్యము నొంది యప్పరమ కారుణికుండు త్రిలో
కరక్షణా॥ దాత్త్యమునఁ వెలుంగుహరిఁ దద్దయు వేడుకఁ
బిల్వఁ బంచి సం॥ ప్రీత్త్యభిరాముఁ డై యొసఁగెఁ బెం
పుగ నమ్మహానీయఖడ్గముఁ. 448

వ. అట్లొసంగినం గైకొని దుష్టదమనం బాచరించుచు నుండెడు నవ్విష్ణుండు మహాస్త్రరూపం బగు నయ్యాయుధంబు పదంపడి మరీచి కొసంగె మరీచి భార్గవునకు భార్గవుం డనేక మునులకు మును లింద్రునకు నింద్రుండు లోకపాలురకు నొసంగెఁ గ్రమంబున మను ప్రభృతు లైనమానవేంద్రులు వడసి నిజసంతతికి నిచ్చుచు వచ్చి రందు దుష్యంతుండు భరతున కిచ్చె నాభరతువంశంబునందు ఖడ్గ సంప్రదాయంబు గలిగి వచ్చె నొకముని యనుగ్రహింప ద్రోణుం డధిగమించి కృపునకిచ్చెఁ గృపునిచేత మీరు నేవురుం బడసితిరి విశేషించి యీవిద్యయం దత్యంతాదరణవంతుండ వగుటం జేసి దీని వలన నెలసితివి నిస్త్రింశంబునకు నక్షత్రంబు గృత్తిక యగ్ని యధిదేవత గురుండు రుద్రుం డనిచెప్పి వెండియు నిట్లను నసి విశసనంబు ఖడ్గంబు 1తీక్ష్ణధారంబు దురాసదంబు శ్రీగ

1. తీక్ష్ణవర్మంబు.

ర్భంబు విజయంబు ధర్మపాలం బన నెనిమిది పూజ్యనామం
బులం బరఁగి కృపాణంబు ప్రహరణంబులలోనం బ్రధా
నంబై నెగడుచుండు. 449

క. సుమహిత మగునీఖడ్గా
గమ మగుపుణ్యకథ వినఁగఁ గాంచినపురుషుం
డమితయశంబును నధిక
ప్రమదంబును సద్గతియును బడయుఁ గుమారా. 450

క. అని యిట్లు నకులునకు భీ
ష్ముని చెప్పినకథ సుచిత్తమున విని కుంతీ
తనయాగ్రజుండు పురికిం
జనియెడుప్రొద్దగుడు వినయసంభృతుఁ డగుచున్.

వ. సముచితంబుగా నమ్మహాత్ముని వీడ్కొనిచని యోగ్యవర్త
నంబులాచరించి వినోదగోష్ఠి నుండి విదురునిం దమ్ముల
నుపలక్షించి ధర్మార్థకామంబులయం దుత్తమమధ్యమాధ
మత్వనిరూపణంబు సేయుఁడు మాత మని పల్కిన నవ్వి
భునకు విదురుం డిట్లనియె. 452

ధర్మజునితో విదురాదులు ధర్మార్థకామంబుల తారతమ్యంబు సెప్పుట.

క. విను ధర్మంబున ధన మగు
ధనమున సిద్ధించుఁ గామతంత్రం బటు గా
వున మధ్యమంబు నధమము
ధనకామము లుత్తమంబు ధర్మం బధిపా. 453

చ. అనవుడుఁ బార్థుఁ డిట్టు లనుసేనర్థము మూలము ధర్మకామవ
ర్తనముల కట్లు గాకయు విరక్తత నొంది జటాదిధారణం

బునఁ జరియించువారికిని ◊ భూవర యర్థము దేహకృత్యసా
ధన మసురేజ్యకణ్వులును ◊ దానిన మే లని పూని చెప్పరే.

వ. కావున నర్థంబు ప్రధానం బనుటయు నకులసహదేవు లేక
వాక్యత నిట్లనిరి. 455

తే. అర్థధర్మంబు లితరేత ◊ రాశ్రయములు
గాన వానిలో నొకఁడు మా ◊ నవేంద్రు
జగము పోకులఁ బుచ్చున ◊ సంభృతార్థుఁ
డైనవానికిఁ గాను మ ◊ ప్రాప్య మరయ. 456

క. తమలో నరి ధర్మము న
ర్థము నర్థంబునకుఁ గామ ◊ తంత్రము ఫలరూ
పము గావున నప్పురుషా
ర్థమునుం గొనియాడ వలయు ◊ ధరణీనాథా. 457

వ. అనిన విని పవననందనుం డి ట్లనియె. 458

క. దధిసారముచందంబున
నధిపా ధర్మార్థసార ◊ మగు కామరసం
బధమ మనుతలఁపు సుఖసం
విధానబాహ్య మని నీవి ◊ వేకమ యెఱుఁగున్. 459

క. వినుమళ్ళి యలరునఁ దేనియఁ
[illegible] నుగతి నిత్యంతసుఖము ◊ గొన నగుఁ గాముం
[illegible]నన నధికసుఖము లొందని
[illegible] యెనుకొల్పు లేని ◊ సస్యము కాదే. 460

తే. [illegible]నఘ ధర్మార్థకామంబు ◊ లందు నొకట
[illegible]లిమానవుం ◊ డధముఁ డొకటి

మూని వర్తించునాతఁడు । మధ్యముండు
నడపు సన్నింటి నుత్తమ । నాయకుండు. 461

క. అని యిట్లందఱుఁ జెప్పఁగ
విని చిఱునవ్వొన ముఖార । విందము చెలువం
బినుమడిగా ధర్మజుఁ డి
ట్లను వారలఁ గలయఁజూచి । యాదర మెసఁగన్.

వ. ఏ నడిగిన తెఱంగునకు విదురునివాక్యంబు సిద్ధాంతంబు
దక్కటివారివచనంబులు నొక్కొక్కమెయి నాదరణీయంబు
లది యట్లుండె నామతంబు వినుండు. 463

క. భూతములు జరామరణో
పేతంబులు గాన మోక్ష । మెడఁ గోరుట మే
లాతతవర్గత్రయసం
జాతమనోదుఃఖభార । సహుఁ డగుకంటెన్. 464

వ. అది గోరిన దొరకొనునే యందు మేని. 465

క. మనమున ధర్మము నర్థం
బును గామముఁ గీలుకొనక । పాపపుణ్యము లై
చన సుఖదుఃఖంబుల మది
మును దైన్యముఁ బొందకునికి । మోక్షకర మగున్.

వ. అనిన విని వార లందఱు నభినందించిరి మఱునాఁ[1]డు సదీ
నందనుం గొలిచి యుండి ధర్మనందనుండు నరపతులకు
వలయువారును వలవనివారును నెట్టెట్టివా రని యడిగిన
నమ్మహాత్ముం డమ్మహీపతి కిట్లనియె. 467

1. డుచితకృత్యంబులు దీర్చి సురనదీనందను పాలికిం బోయి కొలిచి.

ఉ. తాలిమిఁ బేర్చువారలును ధర్మవిధిజ్ఞులు సత్యవంతులున్
లోలత లేనివారు మద లోభనిరర్థకకోపహీనులు
న్శీలసమేతులుం బలుక నేర్చుట కార్యముకాన్పు పెంపునం
జాలుట గల్గుభృత్యులును సంపద సేయదు రాత్మభర్తకున్

ఉ. కూరుఁడు లోభియున్ శఠుఁడుఁ గొండెయుఁడున్ జడుఁ
డుం గృతఘ్నుఁడున్। నేరనివాఁడు బొంకరియు నిందకు
నోర్చునతండుఁ బాదయున్। ధీరత లేమి దుర్నయ మనిత్యవ్య
సనత్వముఁ గల్గువారలుం। జేరువ నున్కి భూపతికిఁ జెట్ట
యొనర్చు నరేశ్వరోత్తమా. 469

క. ఒప్పనిగుణములఁ బరఁగెడు
నిష్పురుషాధములలోన నెల్లఁ గృతఘ్నుం
డొప్పఁడు గడు నిట్లగుటం
జెప్పెదునితిహాస మొకటి సెప్పెద నధిపా. 470

వ. అది కాశ్యపగోతమాఖ్యానం బనం బెద్దలగాఖ్యిం బ్రవర్తిల్లు.

## భీష్ముఁడు ధర్మజునకు నాడీజంఘుని చరిత్రంబు సెప్పుట.

చ. విను మొకబ్రాహ్మణుండు కులవృత్తము [1]పెంపుఁ దొలంగి
బోయదా। ని నొకత౩గర్తిఁ జేసికొని ♦ నెమ్మిఁ గిరాతులఁ
గూడి వేఁటకుం। జనుఁ దిను మాంస మద్దురిత సక్తుఁడు
భోగపరుండు గావునన్। ధనము ఘటింపఁగాఁ దగువి ధం
బని చూచి వణిగ్జనంబుతోన్. 472

1. తెల్లఁ.

వ. చెలిమి సేసి కొండఱు గోమటులు బేహారంబువెంట దేశాంత
రంబునకుం జనఁ దానును వారితోడం గూడి పోవం బోవ
గిరిగహనదుర్గమస్థలంబున నొక్క వనగజంబు 473

ఆ. సాతులోని కుటికి ॥ జనముల నున్మద,
లీల నేలఁ బెట్టి ॥ కాలఁ జమరఁ
జొచ్చుటయును భీతి ॥ విచ్చి నల్దిక్కులఁ
బఱచి రెల్లవారు ॥ బటురయమున. 474

క. ఆయనయుఁ గాందిశీకుం
డై యుత్తరదిక్కు వాఱె ॥ నతిదూరముగా
నాయెడ నొకమార్గము గని
పోయెను దాను నట పోవఁ ॥ బోవం గెలనన్. 475

తే. పొదలతఱచున జొంపమై ॥ పొడవుఁ బఱపుఁ
గలిగి వట్రువఁదనమునఁ ॥ జెలువుమిగిలి
యున్నవటభూరుహముఁ గని ॥ యుల్ల మచట
నిలువఁ గోరిన నాగ్రామణి ॥ నీడఁ జేరి. 476

క. వనలతల కుసుమగంధము
గొని సుడివడుగాడ్పుడప్పిఁ ॥ గొండొక దేర్పం
దను పాయనచటఁ గూర్చుం
డె నతం డట్లుండ నచ్చ ॥ టికి లలితగతిన్. 477

... మహాబకంబు వచ్చె నది పద్మభవునకుం బ్రసాదపాత్రం
... చు నాడీజంఘుండను రాజధర్ముండను నను పేళ్లం బరఁగు
... క్కరకు నమ్మఱ్ఱి నివాసం బైయుండు నప్పక్షి ...

తెంచి యవ్విప్రునిం గాంచి ప్రియంబు దలకొనుచు నాక్ష్యా
నాదరించి. 478

క. ఎందుండి యేమిపనికై
యొందల కరిగెదవు భూసురేశ్వర ప్రీతిం
బొందితి నినుఁ గని తగియెడు
విధ మయితి నాకు నీదు విధముం జెపుమా. 479

వ. అని యడిగిన నతం డేను మధ్యదేశీయుండ గౌతముండ
నొక్కమహనీయచరిత్రుని పుత్త్రుండ నాలస్యంబున వేదాధ్య
యనాదివిప్రకర్మ విరహితుండ నయి కామలోలత్వంబున
బోయతయిల్లాలుగా బోయలం గలసియుండి పేదఱికంబునకు
నలసి బేహారంబువెంట నొక్కసాతుం గూడి పరదేశంబున
కరుగుచోట గిరిగహనదుర్గమప్రదేశంబున. 480

క. వనకరి యొక్కటి యాసా
తునకుఁ గవిసి జనచయంబుఁ ద్రుంపఁ దొడఁగుడున్
విను మెల్లవారునుం గను
కనిఁ బఱచిరి భీతి నేను గాననభూమిన్. 481

ఆ. పఱచి దిక్కు దప్పి భాగ్యంబుకల్మి నీ
యైననిలయమునకు నరుగుదేరఁ
గంటి ననిన మేలు గాక నీదారిద్ర్య
మపనయింతుఁ జింత యపనయింపు. 482

వ. అంతకు నియ్యాతిథ్యంబుఁ గయికొను మని రుచిమంతంబు
లగుమందాకినీమీనంబులు సుపక్వంబులు సేసి మధురంబు

లగు వన్యఫలంబులు దెచ్చి తృప్తి యగునట్లుగా నతనికి నా
హారవిధి యొనర్చి రాత్రి యగుటయుం బల్లవపుష్పసాంద్రం
బగు శయనంబు గల్పించి యబ్బకపతి యద్ధరణీసురునితోడి
సముచితసల్లాపంబులను సుఖనిద్రను నారాత్రి గడపి వేఁగు
టయు నవ్విప్రు నాలోకించి. 483

క. వినుము మిత్రుఁడును రజతముఁ
గనకము బుద్ధియును నాల్గుఁ గారణములు మ
హ్యుగ్రనిదారిద్ర్యము వాయుట
కని దేవగురుండు సెప్పెనన్నిటిలోనన్. 484

క. మిత్రుం డెక్కుడు కాశ్యప
పుత్త్రుఁడ నగు నేను నీకు భూసురవర స
న్మైత్రి యనుష్ఠించెద నటు
పాత్రము గాకుండునదే యపారశ్రీకిన్. 485

తే. నాసఖుండు విరూపాక్షనామధేయుఁ
డతనిపురము మధువ్రజమనియు మూఁడు
యోజనము లిచ్చటికి దానికి[1] కుల్ల తెరువు
వట్టి వే చని యాదైత్యభర్తఁ గనుము. 486

క. కాంచి యతనితో నేఁ బు
త్తెంచితి నని చెప్పు మతఁ డతిప్రీతుం డై
కాంచనమును రత్నంబులు
సంచితముగాఁ జేసి యిచ్చు నప్పుడ నీకున్. 487

1. కున్న తెరువు.

క. అని యప్పురిదెస సెప్పినఁ
జనియాతం డతనిఁ గాంచి సముచితభంగిన్
వినిపించె రాజధర్మున
కనుగల మగుసఖుఁడ ననియు నతనిపనుపునన్. 488

తే. అరుగుదెంచితి ననియు ధనార్థి ననియు
నిట్లు వినిపించుటయు రాక్షసేశ్వరుఁడు
దేఱకొనఁ జూచి యాత్మ నిప్పాఱుఁ డధముఁ
డగుట దోఁచుచు నున్నది యడుగ వలయు. 489

వ. అని తలంచి. 490

క. కులమును విద్యయు వృత్తముఁ
గలరూ పెఱిఁగింపు మనినఁ గలఁగక తన్నుం
దెలియంగఁ జెప్పె విప్రుం
డలఘుం డగునసురపతియు నవికృతుఁ డగుచున్. 491

క. ఇతఁ డెట్టిఁ డైన నే మగు
నతనికి సఖుఁ డట్టె బకమహత్తరసఖ్యం
బితనిం బాత్రముఁ జేయదె
యితనికిఁ దృప్తియగునట్టు లిత్తు ధనంబుల్. 492

వ. అని నిశ్చయించియతనికి నాహార[1]సంఛాదనంబులు సమీచీనంబులుగా నిర్వర్తింపఁ దగువారి నియోగించి మఱునాఁడు కార్తికపౌర్ణమాసియైన భూసుర సహస్రంబులు దనగృహంబునఁ బసిండిబళ్లెరంబుల భోజనంబులు సేయను బహుళ

1. సంభారంబులు.

దక్షిణలు ప్రతిగ్రహింపనుం గల నైమిత్తిక క్రియానుష్ఠానం
బులు గలిగిన నమ్మహాజనంబులలోఁ గలపి యత్యంతాద
రంబున. 493

క. నుహానీయబహుళపూజా
సహితంబుగ భోజనంబు సంతృప్తిగ న
మ్మహితాత్ముండు నడపి పు
ర్వహభారము గాఁగఁ గనకరాశియు మణులున్. 494

చ. కుడిచినపళ్లెరంబున నకుంతితహస్తముతోడ నిచ్చినం
గడు ముద మంది యెత్తికొని గాఢభరంబున మూర్చ
పోవఁగా। మెడయును వీఁపు మూఁపులును మిక్కిలి
నొవ్వనఁ గొంకు వోవ నె। క్కుడువెస నేఁగుదెంచెఁ గని
కొక్కెర సమ్మద మంద మట్టికిన్. 495

తే. అట్లు సంతోషమునఁ దేలియతని డప్పి
వోవ బకవల్లభుఁడు పక్షపుటయుగమున
నల్ల వీచి యాహారస మర్పణంబు
సేసె నిసి యైన సుఖనిద్ర సేయుచుండ. 496

నాడీజంఘుఁడు దుష్టబ్రాహ్మణుచే మృతుండై మరల జీవించుట.

వ. ఆదుర్బ్రాహ్మణుండు దన రేపటి పయనంబునకు నాహారంబు
చింతించి యిమ్మహా బకంబుశరీరంబు గొవ్వి యున్నది దీని
యందు మాంసంబు సాలం గల దిదియేమఱి నిద్రవోయెడుఁ
జాన నడిచి చెండికొని పోయెదం గాక యని పాపనిశ్చ

యుండై చీర సక్కం గట్టికొని యొక్కకాష్ఠంబు కరయుగం
బున నిక్క నమర్చికొని. 497

క. అందంద మెడయుఁ దలయు న
ముందాటోపమునఁ బెక్కుమారులు లడిచి చా
వుం దెలియఁ జూచి యలరెడు
డెందముతో నీఁక లన్నిటిని వెస 1నూడ్చెన్. 498

తే. ఊడ్చి 2 బొందువు వ్రచ్చి 3పేవురివి నంజు
డంతయును బుచ్చి పాదుకగాఁ సమరఁ గట్టి
కొనుచు వేగుఁబోకగుటయుఁ జనియె నట్టి
సమయమున మేలుకని దనుజప్రభుండు. 499

క. పోల వలచె నేమిగీడో కో
కలిగెడు నని తలఁచి మనసు గలఁగఁగఁ దనవా
రలతోడ నుగ్గడించుచుఁ
జలియించుచు నుండఁ బొద్దుజా మెక్కుటయున్.

వ. రాజధర్మునిం దలంచి. 501

ఉ. నిచ్చలు వచ్చు రేపకడ నెయ్య మెలర్పఁగ మత్సఖుండు నేఁ
డిచ్చటి కేలరాఁడు గుణహీనత విప్రునియందుఁ గల్మినా
యిచ్చఁదలంచితిందులువ యేమి దలంచెనో యక్కటా మదిం
బొచ్చెము లేదునమ్ము బకపుంగవుఁ డెట్లగునో కొక్కదైవమా

క. అని తూర వగచి యారయఁ
బనిచెం బని గఱపి భటులఁ బలువుర వారుం

1. నూచెన్. 2. బొందువు. 3. మేఁనుఠివి.

జని యకముకొక్క యేర్పడఁ
గని యాతనికిం జెప్పి పుచ్చెఁ గడువేగమునన్. 503

వ. అవ్విప్రునిచూపు పట్టి. 504

చ. పరమయిఁ బాఱఁ బోనిఁ గని పట్టి వధించి బెడఁగేలు గట్టి తె
చ్చి రసురభర్తసూచి యిటు సేరఁగఁ దేవల దీకృతఘ్నుని
బొడిగొని వేతినుం డని సరోఁకడ మాలినవార మయ్య యి
ట్టిదుపితశరీరము దినఁగ దోసము మాకని వార లొల్లమిన్.

వ. అంతను. 506

క. తినుఁడు తినుఁడు పొండేమై
నను జేయుఁడు వీని నేల నాముందటికిం
గొని వచ్చితి రని పలికిన
దనుజులు పురి వెడలఁ దెచ్చి తద్గాత్రంబున్. 507

క. వెడగోఁతల నెత్తు గొలుకఁ
బడఁ గోసిన వచ్చి కుక్కసమూహము వెనుకన్
జడిసెఁ గబళింప కొల్లక
కడుపులు నకనకఁ బడఁగఁ గరవముఖ్యా. 508

వ. అని చెప్పి భీష్ముండు. 509

క. విను మది యట్టిద కుక్కలుఁ
దినఁగా రోయుఁ గృతఘ్నుదేహముమాంసం
బని చెప్ప నాగమంబులు
మనుజేశ్వర యెల్లమయ్యె మనకిచ్చోటన్. 510

వ. అని పలికి వెండియు నిట్లనియె. 511

క. పురపురఁ బొక్కుచు బకపతి
కరఁకముం దేరఁ బనిచి గారవమున నె
య్యురఁ దాను నగ్ని యిచ్చి య
సురపతి యున్నంత వచ్చెఁ సురపతి నెమ్మిన్. 512

క. కని యతఁడు సంభ్రమంబును
వినయంబును బెరయ గారవించి యడిగె నా
తని రాజధర్మ నీవే
యని దైన్యము దోఁప వగచి యశ్రులు దొరఁగన్. 513

వ. అడిగిన నమరవిభుండు నీసఖుండు చతుర్ముఖునకుసఖుండగుట యెఱుంగవే వానికి వగవ నేల యవ్వారిజాసనుండు దన పాలికి ననుదినంబు వాఁడు వచ్చుటం గోరుచుండుం గావున.

క. పలుమాఱును రామికి ను
త్తలపడియెను దాన నిట్టిదశ నతఁ డొందెం
జెలి యగుట నితని డొక్కకు
నలఘువిధిన్ వహ్ని యిచ్చితది మేలకదా. 515

వ. అట్లగ్నిసంస్కారంబు సేసి నీవు వచ్చినయనంతరంబ తచ్చి తాసమీపంబున. 516

క. కడు నర్మిలిఁ గ్రేపుం జను
గుడుపఁ దొడఁగె నొక్క సురభి గురుపా ల్చెరయం
బడువత్సవ క్త్రఫేనము
సుడిగాలిం దూలి పడియెఁ సాదపై ననఘా. 517

వ. దానం జేసి యన్నాడీజంఘుండు సంజీవితుం డయి యెప్పటి యట్ల యొప్పెడు నాకారంబుతో నరుగుదెంచు చున్నవాఁ

డి ట్లగుటకుం గారణంబును నద్దేవుని దివ్యచిత్తంబు మహా
నుభావంబ. 518

క. అని చెప్పి నంత బకపతి
సనువెంచెను దనుజపతికి సమ్మద మెసఁగన్
మును వాసవుఁ డజువాక్యము
నన పాశనిబద్ధుఁ జేసినాఁ డవ్విప్రున్. 519

క. ఆనాఁడీజంఘుండును
దాని నెఱిఁగి భూసురునకుఁ దనకతమున న
ద్దీనదశ యగుట కోర్వక
వానివిడుపు గోరి వేఁడె వరముగ నింద్రున్. 520

చ. అతఁడును దివ్యబోధమున నాసమయంబున బ్రహ్మసత్కృపా
న్వితుఁడగు శేర్వడం గని వినీతతముం డగు రాజధర్మవాం
ఛిత మొనరించె విప్రునకుఁ జేర్చిరి తెచ్చినవారు తద్ధన
ప్రతతియు దైత్యనాయకుఁడు పంపబకాధిపుఁ బ్రస్తుతించుచున్

వ. అవ్విప్రుండు ధనసంచయంబు మోఁచికొని మరలి మరలి
చూచుచు సంభ్రమంబునం బోయెఁ దదనంతరంబ. 522

క. సురపతియుఁ ద్రివిష్టపమున
కరిగె బకాధీశుఁడును నిజాలయమునకున్
గరిమంబు మెఱయఁ జనియెం
బరితుష్టుం డగుచు దైత్యపాలుం డనుపన్. 523

క. అని చెప్పి తాత యిట్లను
మనుమనితో నాదరమున మఱియును బ్రహ్మ

ఘ్నునకును నిష్కృతి గలుగును
వినుము కృతఘ్నునకు లేదు విమలచరిత్రా. 524

క. అరయ మిత్త్రద్రోహము
దారుణ మగుపాతకము కృతఘ్నతకంటెన్
వైరము గొని విడువవలయు
నారెండుదెఱంగులవారి నాప్తుల నైనన్. 525

క. మిత్త్రుం డైహికములు నా
ముత్త్రికములు నైన భద్రములు దలకొలుపున్
మిత్త్రధనంబులలోనను
మిత్త్రుండ యెక్కు డనుమాట మెత్తురు ప్రాజ్ఞుల్. 526

క. ఉత్తమకులజుండు సుగుణా
యత్తుండు సస్నేహమతియు నగుమిత్త్రునకుం
జిత్త మెలర్పు తెఱంగునఁ
బొత్తు మనంగ వలయు శుభముఁ బొంద వలసినన్.

వ. అని యిట్లు కృతఘ్నతయు మిత్త్రద్రోహంబును నధికపాత
కంబు లగుటయు సన్మిత్త్రుఁ బాటించుట శుభంబుఁ
జేయుటయు భీష్ముండు భీమాగ్రజునకుం జెప్పెనని విని
యయ్యుత్తమపురుషులయడుగులును నుత్తరం బిచ్చుట
లును నింత లెస్సలై చెల్లెడునే యట మీఁదఁ జెల్లిన తెఱంగు
లెఱింగింపు మనుటయు. 528

చ. స్మయభయదర్పితక్షుభితసామజమర్దనరక్షణక్రియా
శ్రయణవిలాసభాసురభు ♦ జా చరణప్రణతామరవ్రజా

జయవిభవప్రభుత్వఘనసంపదుదాత్తచరిత్రకీర్త్యపా
నయనకృతార్థసేవకజనా మునిసంభృతయోగపూజనా.

క. తరణిశశినేత్ర జగదుప
కరణచణచరిత్రబోధగాత్ర తపస్సం
భరితశమమునిమనోజ్ఞా
భరణీయప్రాజ్ఞ విశ్వభారవిధిజ్ఞా. 530

మాలిని. వరదచరణలీలా వైకృతాగమ్యశీలా
విరతినిరతసేవ్యా వేదవిద్యావిభావ్యా
నిరవధికవిభూతీ నిశ్చయాతీతరీతీ
భరితకరుణదృష్టీ భక్తమాధ్వీకవృష్టీ. 531

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్త్ర కొమ్మనామాత్య
పుత్త్ర బుధారాధనవిరాజి తిక్కనసోమయాజిప్రణీతం
బైన శ్రీమహాభారతంబున శాంతిపర్వంబునందు
ద్వితీయాశ్వాసము.



శ్రీ

హరిహరనాథాయ నమః

# శ్రీమదాంధ్రమహాభారతము.

## శాంతిపర్వము, చతుర్థాశ్వాసము.



శ్రితవక్షస్థలగౌ
రీశ్రితవామాంగసుభగ ! రేఖాసంప
త్త్ర్యశ్రాంతతనూలలిత స
మాశ్రితజననిత్యఫలిత ! హరిహరనాథా. 1

### భీష్ముఁడు ధర్మజునకు సర్వోత్తమంబగు ధర్మంబు సెప్పుట.

వ. దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె నట్లు
బహుప్రకారంబుల శాంతనవుండు వివరింప రాజధర్మంబులు
విని ధర్మనందనుండు దమ్ములుం దానును బ్రియం బందె
నమ్మందాకినీనందనుం డతనితో నాయెఱింగిన తెఱంగునం
బ్రజ్ఞాకరంబు లగువాక్యప్రకరంబు లుపన్యసించితి నింక
నేమి విన నిచ్చ సేసెద వనిన నా దేవవ్రతునకు నన్నర
దేవోత్తముండు వినయం బెసఁగ వినతుండై. 2

క. రాజోచితధర్మంబుల
యోజ విశదభంగిఁ జెప్పి ! తుజ్జ్వలవిసర

క్షేత్రజ్ఞోధన నాకు సకల
భూజనపరమహితధర్మ ✦ ము దెలుపు దయన్. 3

క. ఉత్తమ మెయ్యది నావుడు
సత్త్రిటిసేనందనుఁడు స ✦ మాదరసమ్య
క్చిత్తుఁ డగుచు నక్కురుభూ
జోత్తమునకు నిట్టు లనియె ✦ నుర్వీనాథా. 4

తే. వినుమ నేకవిధంబుల ✦ విస్తరిల్లు
ధర్మములయం దొకండును ✦ దలఁప నిష్ఫ
లంబు లే దాత్మమోక్షావ ✦ లంబి యైన
ధర్మ ముత్తమ మండ్రు త ✦ త్త్వజ్ఞు లధిప. 5

క. ప్రియములు నప్రియములును హృ
దయమునఁ బోరయమియు మోక్ష ✦ దం బగుధర్మం
బయమహితా తద్బోధవి
షయ మగునితిహాసముం బ్ర ✦ సన్నాకృతిగన్. 6

వ. చెప్పెద నాకర్ణింపుము సేనజితుం డనురాజు పుత్త్రశో
కార్తుం డయి యున్నయెడఁ దబాప్తుం డగువిప్రుం డతని
కిట్లనియె. 7

క. ఇవి యేమి శోకమున నం
దెదు పుట్టినవారి కెల్లఁ ♦ దెరు వారయఁ గా
నిదియె భవత్సుతుఁ డొకని కె
వదలు వనట మూఢునట్లు ✦ వనరం దగునే. 8

వ. అనిన విని యజ్జనపతి నీ వేమిటం జేసి వగపు వారిం తనవ్రశం
సతం డతని కిట్లనియె. ౯

క. కదియుం గాష్ఠముఁ గాష్ఠము
నదిలో మఱి కొంతసేపు - నకుఁ బాయును నె
మ్మది నట్లుగఁ దలఁపఁగ వల
నవె పితృపుత్రాదిబంధు - వర్గము నధిపా. 10

క. తనకుం దా నెర వనినను
విను బంధులు సతమె యన్వి - వేకంబున నే
జనులపయిఁ జేయ నర్మిలి
నను వగ వొంద దది కార - ణముగ నరేంద్రా. 11

క. నరనాథ సుఖము దుఃఖముఁ
బరువడిమెయిఁ బొరయుఁ గాక - పన్నుగ నరునిం
బొరయునె యొందొక్కటి యవి
పొరసిన వల దూఁద మోద - మును ఖేదంబుల్.

క. ఇది నాయది యనునూఁత
న్మది నెయ్యది పట్టుకొల్పి - నను వాసిత మై
తుదిఁ జేటు నొంది వానికి
నది శోకము నావహించు - నత్యంతంబుల్. 13

క. వినుము పురాతనజన్మం
బునఁ జేసినయట్టికర్మ - ములఫలములు ప్రా
జ్ఞుని నైనఁ బొందు వానికి
మనుజేశ్వర మందు ధైర్య - మహిమయ చుమ్మీ. 14

క. పరమసుఖము ద్రష్ట యగుచు
టరయఁగ ని ట్లగుట పింగ ళాలాపములం
బరిబోధిత మగు ధరణీ
శ్వర చెప్పెదఁ దెలియ వినుము వాని తెఱంగుల్. 15

వ. పింగళ యను వేశ్య దనకూర్చువానిరాక వార్చి పెద్దయుం బ్రొద్దు పోవునంతవరకు నుండి వాఁడు రా కుండుటయును.

ఆ. ఏను వేఁదు ఱగుడు వాని నివ్వేఁదుఱ
1పట్టఁ జదురు గలదె భ్రాంతి దొఱఁగి
యొంటికంబ మొప్పు నింటివాకిళులు దొ
మ్మిదియు నెఱయ మూసి నిదురవోదు. 17

క. పొంతకు వచ్చినవానిన
కాంతునిఁగాఁ గొనుచు నొరునిఁ గాంక్షింపక యే
నెంతయు నూఱడి మనమునఁ
జింత యొకఁడు లేకయున్నఁ జెందు సుఖంబుల్.

క. ఆశయ యింద్రియజయము వి
నాశముఁ బొందించుఁ గావు నం దొఱఁగెద నే
నాశను సౌఖ్యము నిచ్చు 2ని
రాశయయని పలికి యట్టి దై నిద్రించెన్. 19

వ. అని విప్రుం డుపదేశించిన వాక్యంబులం గలాక దేఱి సేన
జిత్తు సుఖి యయ్యె నీవును నందలితాత్పర్యం బనుసంధించి

1. జనువు గలదె; పట్టి చనువు గలదె 2. నిరాశత.

శాంతి నొందు మని చెప్పినఁ గుంతీతన యాగ్రజుండు శాంత
నవుతో భూతక్షయావహం బగుకాలం బతిక్రాంతం బగు
చున్నయది యట్లుండ జనంబుల కెయ్యది క ర్తవ్యంబు లుప
దేశింపు మనిన నమ్మనుజపతిం బ్రీతిం గనుంగొని యమ్మ
హాత్ముండు పితాపుత్రసంవాదం బను నితిహాసంబు గల
దాక ర్ణింపుము దాన నీయడిగినయది దేటపడు నని పలికి
యిట్లనియె. 20

**మేధావి యను బ్రాహ్మణ కుమారుఁడు దనతండ్రితోఁ జేసిన సంవాదము.**

సీ. వేదవిదుం డగు ౹ విప్రనందనుఁడు మే
ధావినామకుఁడు మే ౹ ధావివరుఁడు
సత్సమయంబున ౹ జనకుతో నాయువు
జనులకు వేగంబ ౹ చనుచు నుండు
దీనిపైఁ గను వెట్టి ౹ ధీరత దలకొల్పి
మేలు వాటిల్ల నె ౹ మ్మెయిఁ జరించు
వారొకో యనవుడు ౹ వానికి ని ట్లనుఁ
దండ్రి యాలును నప ౹ త్యంబుఁ గలుగు

ఆ. తెలుఁగు నడపి యజ్ఞ ౹ తృ ప్తనిర్జరుఁ డయి
శమము నొంది కాన ౹ నమున కేఁగి
సౌమ్యవృ త్తి ము క్తి ౹ సాధించి మృత్యువు
నలఘునియతి గెలువ ౹ వలయు నసఘ. 21

వ. అనిన విని మేధావి దండ్రి కిట్లనియె. 22

సీ. నెక్కుమ కాలంబు ౯ నీకుఁ గొంత గలట్లు
పలికెను నీవు గ ౯ ర్భంబు సొచ్చి
నప్పటనుండియు ౯ నన్వేషణము సేయుఁ
గొనిపోవుటకు మృత్యు ౯ వని యెఱుంగు
మిపిరెను నీటిమీఁ ౯ నవు గాదె దారపు
త్రాదిసక్తుం డగు ౯ నతనిఁ గాన
నమున సుప్తుండైన ౯ నరుఁ బులి గొనిపోవు
నట్టులు సూ మృత్యు ౯ వపహరించుఁ
తే. జేసినది సేయు చున్నది ౯ సేయవలయు
నది యనం గలకార్యంబు ౯ లందుఁ దగులు
వానిమృత్యువేపునఁ దన ౯ వశముఁ జేయుఁ
గాన కాలంబు నేమనఁ ౯ గాదుతండ్రి. 23

క. భీరుఁడు శూరుఁడు జడుఁడు వి
శారదుఁ డబలాత్మకుండు ౯ సబలుం డన లే
దేరి నయిన మృత్యువు దు
ర్వారం బై యపహరించు ౯ వైదికవర్యా. 24

క. వినుఁ సంస్కృతి మృత్యువుప
ట్టినఘా నిస్సంగవృత్తి ౯ యమరగృహము నె
ట్టన ని ట్లగుటం గనుగొని
తునుముము సంసారరజ్జు ౯ దురితవిదూరా. 25

క. అమృతము మృత్యువు నన స
త్యము మోహము గాన వినుము మ ౯ హాత్మా యే స

త్యమునన మత్యువు గెల్చెద
సమసుఖదుఃఖుండ నగుచు శాంతిపరుఁడనై. 26

తే. నాకుఁ బ్రజ గతి నిచ్చునే నంగ వలవ
దేన ప్రజ నయి పొడమెదఁ గాన యేను
నన్నుఁ గనుచున్న నదిమోక్షణంబు సేయు
నాశపడనట్టు లగుటఁ బ్రజాభియుక్తి. 27

క. విను పశుయజ్ఞముః హింసన
మనంతఫలదంబు గాదు హంకృతిసహితం
బనఘా వాఙ్మనస [1]నియమ
మనుమార్గం బిచ్చు నవ్యయానందంబున్. 28

వ. కావున నీవును. 29

క. కామక్రోధాద్యము లగు
నీమానసవికృతు లుడిపి యేకాంతగుహా
రాముఁడ వై నిను వెదకుట
నూ మేలొం డెల్ల నుడుగు సులభవివేకా. 30

క. అని పుత్రుం డుపదేశిం
చిన జనకుం డట్ల చేసి చెందె సుఖంబున్
మనుజేంద్ర యవ్విధముఁ గని
కొని యూఁదుము సత్యధర్మకుశలత్వంబుఁ. 31

వ. అని చెప్పిన నజాతశత్రుండు శంతనుపుత్రునితో జగంబున
ధనవంతులు నధనులుం గలిగి యుండుదురు వారలలోన

1 యమం, బను; మయం, బను.

సుఖు లెవ్వరు దుఃఖు లెవ్వరని యడిగిన నక్కురుపితామహుండు శమ్యాకుం డనువాఁడు శాంతిపరాయణబ్రాహ్మణుండు సంసారంబు వదలవిడిచి కూడు సీరకు నవసి యుండు నట్టివాఁడు తొల్లి నాకడకు వచ్చి గోష్ఠీప్రసంగంబున నుపదేశించినవచనంబులు గలవు వాని విను మవి భవత్ప్రశ్నంబునకు నుత్తరంబు లై యుండు నని పలికి యిట్లనియె. 32

తే. ధనము కలిమియు లేమియుఁ గ్రాసునందు
నిలిపి యెత్తంగ ములు సూపెనిర్ధనత్వ
మెక్కుడై దానిదిక్కున కె నెట్టు లన్న
వినుము గుణదోషముల భంగిఁ విస్తరింతు. 33

క. ధనము గలవాఁడు మృత్యువ
ధనమున నున్నట్లు భయముఁ దనచిత్తమునం
దనుకఁగ నుల్లల నుడుకును
విను శిఖిచోరాదిముఖ్యవిషయాపదకున్. 34

క. కోపంబును లోభంబును
నేపారి మనంబు గలఁగ నెప్పుడుఁ జింతా
తాపంబు నొందు సధనుం
డాపద గా కవ్విధము సుఖావహ మగునే. 35

క. ఎచ్చోట నైన నధనుఁడు
విచ్చలవిడి నుండు లేమి వెఱపించుకయుం
బొచ్చెపుఁజందం బొల్లఁడు
మెచ్చరె సుర లైనఁ బలుకు మృదు నై యుండున్. 36

క. లోకముచందము గనికొని
యీకానఁగ నగుధనాదులెల్లను గాల
వ్యాకులతఁ బొందఁ గలయవి
గాకుండమి యెఱిఁగి విడుపుగడుఁ జడు రెంకుణా. 37

క. ధనవ_త్త్వము దుఃఖకరం
బని కని తత్కాంక్ష విడుచునతని కధనతా
జనితాత్మాధీనత్వం
బనుపమసౌఖ్యంబు సేయునక్షీణముగన్. 38

భీష్ముఁడు ధర్మజునకు మంకి యను బ్రాహ్మణునిచరిత్రంబు సెప్పుట

వ. అని చెప్పె ననిన విని ధర్మతనయుండు పితామహుతో ధన
తృష్ణాభిభూతుం డగు పురుషుం డేమిట సుఖి యగు నను
టయు నయ్యమరనదీనందనుండు ధనార్జనంబుతోడివిసువు
టం బుట్టినవిడుపున సుఖంబు గలుగు నయ్యర్థంబుఁ దెలి
పెడునది యొక్కయితిహాసంబు గలదు వినుమని యిట్లనియె.

సీ. మంకి నాఁ బరఁగుబ్రాహ్మణుఁడు ధనేచ్ఛమై
వర్తించు శిక్షింప వలయునట్టి
గుజ్జుదోయిని జట్టిగొని ప్రీతి లంకించి
యుండ లంకియతోనగండు మీఁటి
పాఱె నక్కోడియల్పడి యున్న గనపల్గొ
ట్టెనుంగుపై నదియెగసి పఱవ
నుభయపార్శ్వంబులనురివోసిన ట్లవి
వ్రేలి చచ్చినఁ జూచివిప్రుఁ డడలి

తే. రత్నములుఁబోని వత్సత రంబు లకట
ప్రేలు చున్నవి లొట్టేన్గ వెంటఁ దవిలి
యనుచు నిర్వేద మొంది యిట్లనియెఁ దన్నుఁ
గరుణతోడఁ గనుంగొను నరులతోడ. 40

తే. సారమతిఁ బరికింపంగ పౌరుషంబు
కంటె దైవంబు ముఖ్యంబు గార్యసిద్ధి
కెచటనేనియుఁ బౌరుష మెసక మెసఁగె
నేని నది దైవదత్తంబ యింత నిజము. 41

వ. కావున. 42

క. మనమునకు సుఖము గోరెడు
జనులకు నర్థక్రియావి శారదభంగుల్
పొనుపడ విడిచి భరము లే
కునికియ యూహించి చూడ నుర వెబ్భంగిన్. 43

వ. అని పలికి యుద్దామం బైనకామంబు విడుపు వడకున్నఁ జిత్తంబునకు నిర్వృతి గలుగునే యనువిచారంబు వుట్టి తది యోత్సారణం బూహించి యాచిత్తధర్మంబు నుద్దేశించి.

క. నీమూలం బే నెఱిఁగితిఁ
గామమ సంకల్పమునన కలిగెదు సంక
ల్పామర్శరహిత మగుచే
తోముద్రం దాల్తు నేను దుది యది నీకున్. 45

వ. అని కామం బనునది గోర్కె గావునఁ గోర్కెయొప్పమి దేట పఱుపం దలంచి. 46

తే. సొమ్ము గోరినయంతనసుఖము గలుగ
దది యుపార్జింపఁగా సిద్ధి యగుట నిజమొ
గలిగెనేని ననేకచింతలనొసర్చుఁ
జెడుట చావుతోఁ దుల్య 1మయ్యెడుము వోల. 47

వ. ఇచ్ఛానిరసనంబు సుఖం బని వెండియు. 48

క. శోకశ్రమతృష్ణలకుఁ
నీకలిమియ మూల మగుట నీకగపడువాఁ
డేక ర్తవ్యము గానం
డోకామమ నిన్నుఁ దొలఁగి యుండెద సుఖినై. 49

క. నీ వాసపడుప ధనములు
గావించెదఁ బో 2వినాశకముల నుడుపఁగా
నీవశమె కాన నీచెడు
చేవగపుం దేదు పెనుప దే హైన్యంబుఁ. 50

చ. సులభమొ దుర్లభంబొ యనిచూడ నెఱుంగవు గన్నదానిపై
నలముదుకామమాయిడుమలందఁగఁజేయుదునిండుచేఁటం
గలుగదు నీకు నీతెఱఁగగాధరసాతలభంగి నీవు స
న్నొలమునఁబోవకుండి నినుఁబుచ్చెద బచ్చెనరూపుపోకులఁ

తే. ధనముచేటున విసివి నామనము నిన్ను
నీడవిడిచె నోకామమయేను శాంతి
దాంతి సత్య క్షమా భూతదయలఁ జెంది
నాఁడ లోభాదు లొందవునన్ను నింక.

---

1. దు య్యెడు న దేల. 2. వినాశ కత నుడుపంగా.

తే. కామసుఖదివ్యసుఖములుఁ గాంక్ష సేయఁగ
మెలిసేఁత శాంతంబునకుఁ జాలలేవు
గాన కామము నిను శతక్రతుకరణిఁ జూపి
బ్రహ్మపురమున నుండెడు రాజుఁబోలె.

## అజగరచరిత్రప్రశంసము.

వ. అని పలికి మంకి యివ్విధంబునం గోడెలు నచ్చినం బుట్టిన నిర్వేదనంబున సకలకామంబులం బరిత్యజించి దేవసముండై యుండెనని చెప్పిన విని పాండవాగ్రజుం డేమివర్తనంబున నయుండు వీతశోకుం డగుచుఁ జరించు నెద్దానం జేసి పరమగతి నడయు ననుటయు ననిమిషనదీనందనుం డజగరచరితంబను నితిహాసంబు వినుము దాన నీయడిగినయర్థంబు దేటపడు దాని జెప్పెద నాజగరనామధేయుండగు నొక్క బ్రాహ్మణునిఁ బ్రహ్లాదుండు శమప్రకారం బుపదేశింపు మని యభ్యర్థించిన నతం డతని కిట్లనియె. 54

క. అనిమిత్తము భూతంబుల
జననం బవి పోవు నెఱుఁగ సంపన్నములై
యునికి విషాదము మోహం
బును జేయఁగ లే వనిత్యకములుగ నెఱిఁగినన్. 55

తే. [1]వఱదఁ గాష్ఠముల్ గూడినవడువు బంధు
సంగమం బవి వాసినచాడ్పు తద్వి

1. పాఱుకెఁ.

యోగమింత సూచిన వానికెనుమ్మలికము
వొరయ నేరదు దానవోవరతనూజ. 56

వ. ఈతెఱంగు లేనెఱుంగుదు నాదెస( బ్రశాంతిం గని కాదె
నీవు శమోపదేశం బర్థించితివి వినుము. 57

క. మేలర్థింపను గీడును
జాలింబడి తొలఁగఁ దోపఁ సరిఁ దూష్ణింభా
వాలంబిమనస్కుఁడనై
యాలంబుగఁ జేసి నడతునయ్యెరుదెఱఁగుఁ. 58

క. సరసాన్నముఁ బిణ్యాకము
సరిగాఁగ భుజింతు మృదులశయ్యాతలముఁ
ధరణియు శయనరుచికి నా
కరయం గానొక్కరూపయసుర ప్రవరా. 59

ఆ. నారచీరయేనిఁజారుచీనాంబరం
బైనఁ గట్టికొనినయపుడు హృదయ
మొప్ప దొప్పు ననకయుండు రూపాదుల
నలమికొనవు చక్షురాదికములు. 60

వ. అని వెండియు. 61

ఆ. చలన మేది పుట్టుజావునుం బిరువెట్టి
యామిషార్థిజనుల నపహసించు
చెలిమితోడ లేమి కలిమి వాటింపని
రమణ మునికి యజగర వ్రతంబు. 62

ఆ. అనియతంబు లైనయాహారవిహరణ
శయనముల విధాతృసంప్రయుక్త
భంగిఁ బరఁగు నంతరంగ నిర్భరవ
ర్తనముకలిమి యజగర వ్రతంబు. 63

ఆ. నిత్యతృప్తిశౌచనిరతి తాల్మి సమత్వ
మారఁ గలిగి చిత్సుఖానుభవము
ప్రచుర మగుట యజగరవ్రత మది విను
మజ్ఞదుర్లభంబు ప్రాజ్ఞభూమి. 64

వ. ఇది శమప్రకారం బనియె నని చెప్పి భీష్ముండు. 65

క. అజగరచరితము దనకును
నిజముగ నలవఱుప నేర్చునిర్మలమతికిఁ
వృజినభయమన్యుశోకము
లజేయములుగావు మోక్షమాయత్త మగుఁ. 66

వ. అనిన విని యజాతశత్రుండు బంధుమిత్త్రకర్మ విత్తప్రజ్ఞ
లయం దెయ్యది నరునకు సుప్రతిష్ఠం జేయు నని యడిగిన
నాపగాతనయుం డతని కిట్లనియె. 67

క. ప్రజ్ఞయ ప్రతిష్ఠ లాభము
ప్రజ్ఞయ నాకం బనంగఁ బ్రజ్ఞయ చువ్వే
ప్రజ్ఞయ కైవల్యంబును
బ్రజ్ఞాసాధ్యములు గానిపనులుం గలవే. 68

వ. బలి ప్రహ్లాద మంకి ప్రభృతులు ప్రజ్ఞనకాదె సమాధాన
సంపన్నులయిరి కాశ్యపనామధేయుం డగుధరణీసురోత

ముం దొకయుద్ధతపురుషునిరక్షణంబు దాఁకి పడి తడవమాన
దూయమానమానసుండై యసుపరిత్యాగపరిస్పర్సాయుం
డగుటయునింద్రుండుస్వర్గాలయావంబునకమ్మహాద్విజునిపాలికి
వచ్చి ప్రజ్ఞాసంబోధకం బగు సంవాదంబునం జిత్తప్రసా
దంబు గావించె నని పెంపు మెల్లభంగులఁ బ్రజ్ఞయుత్తమా
ధికారం బనిన విని ధర్మతనయుండు. 69

క. నరవర దానముఁ దపమును
గురుశుశ్రూషయును యజ్ఞకోటియు నెల్లై
పరిణతిఁ బొందం గలయవి
పురుషున కిత్తెఱఁగు దెల్లశముగ విన వలతుక్. 70

వ. అనుటయు దేవవ్రతుం డన్నరదేవోత్తమున కిట్లను మేలు
లనుబంధించుమేలులట్లు కీళ్లును ననుస్యూతంబు లయి
తొడరు నాకర్ణింపుము. 71

క. కఱువుపయిఁ గఱువు వారయుచు
వెఱపుపయిన్ వెఱపుదోఁప విడువనియిడుముం
దొఱఁగమిపై బురుషుఁడిడుమఁ
దొఱఁగమిఁజేర్చుచునడచు దుష్కర్మములన్. 72

వ. అని మఱియును.

ఆ. ఉత్సవంబుమీఁద నుత్సవ మందుచు
సుఖముమీఁద సుఖము సొప్పడంగఁ
బుణ్యపదముమీఁదఁ బుణ్యపదంబున
కరుగు నరుఁడు సుకృతి యైన నధిప. 74

క. పులుఁగులలోఁ బూత్యండక
ములు సారము లైనధాన్య ములలోనం బొ
ల్లులుఁబోలెను జూవె మను
ష్యులలో ధర్మరహితాత్ము లుర్వీనాథా. 75

క. చనినఁ జను నున్న నుండు
న్మనుజుఁ డొకటి సేయఁ జేయు నరనాయక తో
డన తగిలి నీడవోలెను
విను చేసినకీడు మేలు విడువవు వానిన్. 76

క. సమయం బైనను గుసుమఫ
లము లెట్టులు దోఁచుఁ దరువు లం దటులఁ గ
ర్మములం బొడముఁ సుఖదుః
ఖములట్టుల నిష్ప్రయత్న కలితోద్భూతిన్. 77

క. తెలిసికొనఁ బడయ వారు లా
ర్యులపోయెడి తెరువు లరసి యును జదలం బ
క్షులు నీళ్లలోన మీనం
బులు వోయెడుత్రోవ లెఱుఁగఁ బోలునె యధిపా.

క. ఐనను గాఢనిరూఢ
మానసుఁడై యార్యజనుల మహితవచనముల్
వీనుల వినుచుచు ధర్మము
లైనవి సేయంగఁ దప్ప కగుఁ దత్ఫలముల్. 79

వ. అనిన విని కౌంతేయాగ్రజుండు శాంతనవునితో భూతసృష్టి
యవ్వానివలన నెబ్భంగి నైనయది యెఱింగింపు మనవుఁడు

నతం డిదియును మఱియుం గొన్నియర్థంబులు భరద్వాజుం డడిగిన భృగుండు సెప్పె నప్పరిపాటి యుపన్యసించెద నాక ర్ణింపుమని యతని కి ట్లనియె. 80

భీష్ముండు ధర్మజునకుఁ బృథివ్యాదిభూతోత్పత్తిక్రమం బెఱింగించుట.

సీ. కైలాసశైలశి ఖరమునఁ దేజోవి
రాజితు భృగు భర ద్వాజుఁ డధిక
వినయంబుమైఁ జేరి మునినాథ భూతసృ
ష్టిప్రకారము నాకుఁ జెప్పు మనిన
నమ్మహాత్ముఁ డి ట్లను విను నారాయ
ణుం డవ్యయుం డనం తుండు భూత
సృజనంబు దలఁచి ముఁ సృజియించెఁ దనదుస
హస్రాంశకమున న వ్యక్తుఁడనఁగ
తే. మనసునన యజరామరు ననుపమాను
నతనివలన మహత్తత్త్వ మావహిల్లె
నతఁడు దివ్యతేజోమయం బైనపద్మ
మొకటి గలిగింప బ్రహ్మయుం దుద్భవించె. 81

తే. అతనితలఁపునఁ బ్రభవించె నాకసంబు
దానియందు జలంబులు ద్భవమునొందె
సలిలమున నగ్నిమారుత జనన మొనరె
ననలపవనయోగమున మే దిని జనించె. 82

వ. ఆబ్రహ్మ యఖిలభూతాత్మకుం డె ట్లనిన నతనికి శైలంబు

లస్థులు మేదిని మేదో మాంసంబులు సముద్రంబులు రుధి
రం బాకాశం బుదరంబు పవనుండు నిశ్వాసం బగ్ని
తేజంబు సరిత్తులు సిరలు రవిచంద్రులు నయనంబు లూర్ధ్వ
లోకంబు శిరంబు పాతాళంబు పాదంబులు దిశలుబాహువు
లిట్లనంతాత్మకుం డగువాఁడు విష్ణుం డిత్తెఱంగున విశ్వంబు
విష్ణునివలనం గలిగె ననిన విని భరద్వాజుం డాకాశాది
భూతంబు లేనిఁటిప్రమాణంబులు నడిగిన భృగుం డవి
యనంతంబులు దేవతలకుం గొలఁది వెట్ట రాకుండు నొక్క
చోటు నిరూపించి యీభూతం బింతనుండి యట లే దన
రాదు పంచభూతంబులు నిరవధికంబు లది యెత్తెఱం గనిన
విష్ణునకు గౌణం బై యనంతుం డనునామంబు గలదు
గావె విష్ణుండు జగన్మూర్తి విష్ణుతనుభూతం బయినమహా
భూతపంచకం బప్రమేయంబు గాక తక్కునే యని యెఱిం
గించిన 83

సీ. విని భరద్వాజుండు మునినాథ పుష్కరం
బునఁ బుట్టె నన్నష్ట పుష్కరంబు
బ్రహ్మకు నాది నాఁ బ ట్టయ్యె నట్లొకో
నావుడు విష్ణుమా నసభవుండు
బ్రహ్మయామ్యుఁడుపుష్క రముదదాసనరూప
ముగఁగల్పితంబయ్యె మున్నుపిదప
ననునిశ్చయంబు లే కునికిఁ బద్మజుఁ డన
వలసియు నుండు న య్యలఘుతేజుఁ

తే. బద్మమదిభూతధాత్రియ ♦ ప్పద్మమునకు
గగనమూర్ధితమగుమేరు ♦ నగము రుచిర
చారుకర్ణికయుండుండి ♦ సకలజంతు
సృజనధుర్యత్వమహిమ న ♦ య్యజుఁడువెలుఁగు. 84

వ. అని భృగుండు సెప్పిన విని భరద్వాజుండు భూతంబు లై
దగుట యేమిట నని యడిగిన నతం డతని కిట్లనియె. 85

క. వాయువు చేష్టారూపము
వ్యోమాయునెడ నభంబు ద్రవము ♦ మునివర జల మూ
ష్మాయిత మనలము గాఠి
న్యాయితము ధరిత్రి యిట్లు ♦ లైదుదెఱంగుల్. 86

వ. ఈయయిదింటన కాదె జంగమంబులు స్థావరంబులు నైన
యవి యనుటయు భరద్వాజుండు స్థావరంబులయందు భూత
గుణంబు లేమిటం గంటి మని యడిగిన భృగుం డిట్లనియె.

సీ. అశనినిర్ఘోషంబు ♦ నాకర్ణనము లేక
వికృతి నెట్టులు వొందు ♦ వృక్ష మాక
సము శక్తిసూవె శ్రోత్రము నిదాఘుంబుచేఁ
కునవాడుఁ జేఁకెఱుం ♦ గుటసమీర
శక్తి మార్గముఁ గని ♦ చాఁగెడుఁ గనుట తే
జశ్శక్తి పాదపం ♦ సంజ్ఞఁ బరఁగుఁ
బాదజిహ్వలఁ గొని ♦ పానంబుసేయుట
జలశక్తిజిహ్వ నై ♦ జంబు లైన

తే. కుసుమధూపాదిగంధముల్ ♦ గొనుట నెలమిఁ
దాల్చు నని చెప్పఁ దరువు వేదంబు; ఘ్రాణ

ముర్వీశక్తి యిట్లయిదనుక నుల్లసిలుట
ననఘ భూజంబు పంచభూతాత్మకంబు. 88

వ. శైలాదులయందు నిట్లు యూహింపఁ బెఱభంగులుం గలిగి యుండుఁ బంచభూతాత్మకంబు గాని భూతంబు లేదనుట వేద నిశ్చయం బనిన విని భరద్వాజుండు. 89

క. భూముఖ్యం బగుభూత
గ్రామంబుగుణంబు లైనగంధాదులఁ దే
జోమహిత యనుభవించుట
యేమెయి నెద్దాని కావహిల్లుచు నుండున్. 90

తే. అనిన భృగుఁ డిట్టు లను విషయములు నింద్రి
యములు మనసును గ్రమసాధనములు గాఁగ
నంతరాత్మ ప్రదర్శి యైయనుభవించి
తత్కృతము లగుమోదఖేదములఁ బొందు. 91

వ. అప్పురుషుండు. 92

క. క్షేత్రజ్ఞుం డనఁగ నిఖిల
గాత్రవ్యాప్తత్వమహిమఁగలిగి సమీరా
సూత్రణమున జీవుండును
గోత్రము నై 1సర్వవర్తకుం డగుచుండున్. 93

క. అగు నీతత్త్వము సత్త్వా
దిగుణత్రయవికృతి 2కత్యతీతం బై పూ

---

1. సర్వవర్త్మకుం. 2. గత్యతీతం.

ర్వగురుత్వంబునకుం జన
విగతత్వంబునకు నెలవు ♦ విమలవిచారా. 94

ఆ. బుధుఁడు సూక్ష్మవిమల ♦ బుద్ధి నప్పురుషుని
నరసి కాంచి యతని ♦ యంద మనసు
డిగ్గ విడిచి యెగ్గు ♦ లగ్గును బొందక
శుద్ధశాంతిఁ బరమ ♦ సుఖముఁ బొందు. 95

వ. అని వెండియు. 96

భృగుమహాముని భరద్వాజునకుం జెప్పినవర్ణాశ్రమాచారక్రమము

సీ. ఆగమసత ధ ♦ ర్మాచారతపముల
కునికిపట్టులు గాఁగ ♦ వనజభవుఁడు
గలిగించె మును బ్రాహ్మ ♦ ణుల మఱి కల్పించె
నృప వైశ్య శూద్రుల ♦ నిర్మలాత్మ
బ్రాహ్మణాదికముగఁ ♦ బరఁగునన్నాలుగు
జాతులయుజ్జ్వల ♦ చ్ఛాయ లోలి
సొంపారుఁ దెలుపును ♦ గెంపునుబసపుచా
యయుఁ గప్పు నయ్యు నం ♦ ద్రార్యవర్య

ఆ. లాత్మకర్మ మెడలి ♦ యనులోమవృత్తి నె
జ్జాతి సొచ్చు నన్య ♦ జాతిపనికి
దాని కట్టిభంగి ♦ దలకొనుఁ బెక్కులు
పనులఁ జేసి జార ♦ తనము వచ్చు. 97

క. సితర క్తపీతనీలము
లతులమతీ మొదలు దొడఁగి ♦ యం తంతకు హీ

సతఁ బొల్పు గాన మెఱిఁగి
చితి నీషదిపాటిఁ గర్మ । శీలత కోఱుదుర్. 98

వ. అని మఱియును. 99

క. సత్యము బ్రహ్మము దపమును
సత్యము ప్రజలను సృజించు । సత్యము లోక
స్థిత్యాధానము జేయును
సత్యం బనృతంబుచేత । సంపి హితమగుర్. 100

వ. అట్లుం గాక ధర్మాధర్మంబు లనఁ బ్రకాశతమంబు లన బోధాజ్ఞానంబు లన స్వర్గనరకంబు లన సుఖదుఃఖంబు లనఁ బరఁగు బుధజనవ్యావహారికశబ్దంబులకు నర్థంబులై సత్యానృతంబులు ప్రవర్తిల్లుం గావున. 101

క. అనఘా దుఃఖాత్మక మగు
నన్నృతం బడఁగించుటకుఁ బ్ర । యత్నమున సుధీ
జను లాచరింతు రనిశం
బును మోహావిఘాతినియమ । ములు నిష్ఠమెయిన్. 102

క. ఒలయు జరావ్యాధిప్రభృ
తులు శారీరములు గాఢ । తోదకశోకా
దులు మానసములు దుఃఖం
బులు రెండువిధములు నిట్లు । పురుషు నలంచున్. 103

క. శారీరమానసము లగు
నీరెండువిధములు దన్ను । నేఁపక యుండం
గోరికొని నియమములఁ బ్రతి
కారం బొనరింపఁగా సు । ఖం బొందు నరుర్. 104

క. విను దుఃఖంబులఁ జెగఁ ద్రో
చినపురుషుఁడు సౌఖ్యసక్త  చిత్తుఁడు గా[1] కా
రినవైరాగ్యముఁ జెందిన
ననుపమ మగుపరమపదమునెనమ్మోయి సేర్చున్. 105

వ. అనిన విని భరద్వాజుం డాశ్రమధర్మప్రకారంబులు సువ్య
క్తంబులుగా నెఱింగింపు మనుటయు భృగుం డిట్లనియె.

సీ. గురునకు భక్తుఁడై  పరమాదరమున వే
దాభ్యాస మెప్పుడు  నాచరించు
చును శౌచశీలత  వినయంబు త్రిషవణ
స్నానంబు భాస్కరా  నలసపర్య
పాటించు చుండుట  బ్రహ్మచారికవృత్తి
ధనధాన్యములు గర్హి  తంబు గాని
తెరువునఁ బడసి య  తిథిపూజ మున్నుగా
నన్నపానాదిభో  గానుభవముఁ

తే. బొందువాఁడు గృహస్థుండు  కందమూల
శాకఫలము లాహారంబు  శయ్య భూమి
వననివాసికి నిస్సంగ  వర్తనమున
భిక్షు బ్రదుకు గ యతి శాంతిఁ  బేర్చియుండు. 107

క. ఫలకాంక్షి గాక నియతిం
జలిపిన నీయఖిలకర్మ  జాతంబును ని
ర్మలమోక్షపదముఁ జేర్చుట
గలుగు నవశ్యంబుఁ బుణ్య  కరణప్రవణా. 108

---

1 కాదినవైరాగ్యమీ; కాదినవైకార్యము... మ్మయిసెర్చున్.

వ. అనిన విని భరద్వాజుండు పరలోకం బన నొకండు గల
దం డిహలోకంబునకును నాలోకంబునకును విశేషం బెట్టిది
యెఱింగింపవే యని యడిగిన భృగుం డతని కిట్లనియె. 109

క. ఇది కర్మభూమి భోగా
స్పద మాలోకంబు ధర్మపరులకు సులభం
బది సత్యశౌచసాజ
న్వదయాదులు లేనివారి కప్రాప్య మగున్. 110

క. ఈలోకము దుఃఖబహుళ
మాలోకము భూరిసుఖనిరంతర మం దే
జాలియును లేక యొండొరు
తో నెన్నఁగఁ బొంది యుండుదురు జను లనఘా. 111

తే. హస్తిమశకాంతరము గల దరసి చూడ
వాసగృహశయనాసనవసనగంధ
మాల్య [1]తౌర్యత్రికారామమానినీజ
నాదిసుఖసాధనములకు నందు నిందు. 112

వ. అని వెండియు. 113

క. ఇవి పుణ్యలోకవిషయ
వ్యవసితవచనంబు లధమమగులోకము ధ
ర్మవిదూరజనులు వొందుదు
రవిరతబహుదుఃఖనిలయ మది విప్రవరా. 114

క. విను మమకారవివర్జిత
మనస్కులకుఁ బుణ్యపాపమార్గంబులు లే

---

1 తూర్యత్రియా

మిని లోకంబులఁ ద్రిమ్మర
¹రసఘూ పొందుదురు శాశ్వతానందంబుల్. 115

వ. అని చెప్పి భృగుండు బ్రహ్మవిహితంబులగు ధర్మంబులు సంక్షేపరూపంబున నెఱింగించితి ననిన భరద్వాజుండు ప్రముదితాత్ముం డగుచు నమ్మహాత్ముఁ బ్రశంసించి వినతుండై వీడ్కొనియె నతనిచేత విన్నంతవట్టును నీకుం జెప్పితి నీ వింక నెయ్యది విన వల తనుటయు ననిమిషనదీసంజనుతో ధర్మనందనుం డాచారవిధి వినువాంఛ నా మనంబునం బేర్చి యుండు ననవుడు నతం డతని కిట్లనియె.

శ్రీభీష్ముఁడు ధర్మజునకు నాచారవిధి యెఱింగించుట.

సీ. సజ్జను ²లందు రా । చారవంతుల నూరా
చారంబు గష్టత్వ । కారి యట్లు
గావున నాచార । గతి వింట గను లెస్స
రాజమార్గంబున । రచ్చ మంద
మూత్రపురీషవి । మోక్షంబు సేయమి
శౌచియై వార్చి ని । ష్ఠను జలంబు
సొచ్చుట సంధ్యల । సూర్యు సేవించుట
యర్కోదయాస్తమ । యముల నిద్ర

తే. వోవకుండుట పంచార్ద్రి । భావమొంది
కుడుచు టన్నంబు దెగడమి । దడిపదములు

1 కసఘూ 2 లందు డాచార

గలుగ నిదురకుఁ జొరమి సత్కర్మవేది
నారదుఁడు వివరించె నాచారములుగ. 117

తే. ఉదయ మగుసూర్యుఁ గనుఁగొను టొప్ప దన్య
వనిత నగ్నయై యుండంగ వలదు చూడఁ
దనపురీషంబు సూచుట ధరణినాథ
కీడు నిజపాపగుప్తి య కృత్య మరయ. 118

క. సురతంబు గుప్త మగుటయు
గురుశుశ్రూషయును బ్రహ్మ కులభజనము నా
యురవాప్తిఁ జేయు లక్ష్మి
కరంబులగు నూర్ధ్వలోక గతియు నొనర్చున్. 119

వ. అనిన విని యుధిష్ఠిరుం డధ్యాత్మవిద్య విన వలతుం జెప్పవే
యనిన నతనికి దేవవ్రతుం డిట్లనియె. 120

సీ. జలధితరంగల చాడ్పునఁ బొడముచు
నడఁగుచు నుండు భూతాత్మనందు
భూమిప్రభృతిభూతములు వానిగుణములు
గంధాదు లింద్రియగ్రాహ్యకోటి
యనఘ శ్రోత్రం బాదియగు నింద్రియశ్రేణి
దర్వియుఁబోలె సాధనత నొందు
మన సింద్రియములకుఁ బెనుఁబ్రాపు బుద్ధి త
న్ముఖమున నిశ్చయంబునకుఁ దేరఁ

తే. బురుషుఁ డవ్విషయంబులఁ బొందు నిట్లు
గాక యుండ నింద్రియములఁ గ్రమ్మఱించి

మనసుతోఁ గూర్చి బుద్ధిలోఁ గనన యడఁప
బుద్ధి నిర్విషయస్థితిఁ బురుషు నొందు. 121

క. విను మాత్ముఁడు క్షేత్రజ్ఞుం
డన భూతాత్ముఁ డనఁ బురుషుఁ డనఁ బరమేశుం
డన బుద్ధిసాక్షి యన నం
జనరహితుం డనఁగఁ బరఁగు శాంతి ప్రవణా. 122

క. తనయంద తోఁచువిషయము
లనుభవగోచరము లగుట 1యది మాయాసం
జనితస్వప్నంబై యా
త్మునికిం దనుఁ గాన 2లేని మోసము పెచ్చున్. 123

క. విను గుణములు మాయకు నొడ
లని యెఱిఁగి తమోరజస్సు లడఁచి సుసత్త్వం
బున నిలిచి సద్వివేకం
బున నదియుం ద్రోఁచి విమలబోధాత్ముఁ డగున్. 124

తే. అరసి చూడ సత్త్వంబు సుఖాత్మకంబు
సాంద్రదుఃఖమయంబు రజస్సు బోధ
మాంద్యమూర్తితమస్సు సమత్వమూఁది
యీయవస్థలఁ బొరయమి మాయపోక. 125

వ. అని యధ్యాత్మప్రకారంబు నిర్దేశించి భీష్ముండు వెండియు యోగంబు సెప్పెద నాకర్ణింపు మని యమ్మనుజపతి కిట్ల నియె. 126

---

1 నది, 2 'లేమి'

## ధర్మజునకు భీష్ముఁడు యోగప్రకారంబు సెప్పుట.

సీ. తెలివొంది మనసు నిశ్చలవృత్తి నేకాగ్ర
మై యున్కి గోరి నిష్ఠాతిశయము
కలిమి కృత్యంబు మేఘంబున మెఱుఁగును
నలినపత్త్రంబున సలిలకణముఁ
బోలె మంతవ్యంబు పొంతఁ జరించుమ
నంబు దానికిఁ బవనంబు గతియ
గతి గాన హితము మారుతధారణము పవ
మానంబు గ్రమమునఁ గాని నిలువ

ఆ. దలయ విసువఁ గాదు తలకొని యమనియ
మాదు లెనిమిదియును నభ్యసింపఁ
గా విచార మొలయుఁ గలుగు వితర్కంబు
మఱి వివేక మనిలు నెఱికిఁ దెచ్చు. 127

క. విను మంతర్నాడిం జనఁ
బనుపడి పవనంబు బ్రహ్మపద మొందఁగ శాం
తినిరూఢ మైనచిత్తము
గను నానందంబు నందకలయుం బిదపన్. 128

వ. అనిన విని కురుపతి కురుపితామహునితో జపవిధిప్రకారంబును
జపశీలు రగువారు పోవుగతియును నెఱింగింపవే యను
టయు నమ్మహీవిభునకు నమ్మహాత్ముం డిట్లనియె
జప్యంబు విషయంబుగా యమకాలమృత్యుభూసురేక్ష్వా

కులకు సంవాదంబు ప్రవర్తించె నయ్యితిహాసంబునుం జెప్పెద
మున్ను నా యెఱింగిన తెఱంగునుం జెప్పెద నాకర్ణింపుము.

యమ కాల మృత్యు భూసు రేక్ష్వాకుల సంవాదము

సీ. వేదాంతవిదు లను ౯ మోదించునట్టిది
జపకర్మ మత్యంత ౯ శౌచశాలి
యై కుశాస్తీర్ణస ౯ మావనీతలమునఁ
గుశముష్టి సేకొని ౯ విశదచిత్త
వృత్తి నింద్రియములు ౯ విషయసక్తంబులు
గాకుండ నిలిపి త ౯ దేకపరత
మత్సరాహంకార ౯ మానదంభాపగ
మంబును బ్రహ్మచ ౯ ర్యంబుఁ గలిగి
తే. జపము సెల్లించుపురుషుండు ౯ సర్వలోక
విజయనిస్స్పృహమగుజప ౯ విధి విశోక
హర్ష రాగాదికంబును ౯ నవ్యయంబు
నైనపదముఁ బొందించు నృ ౯ పాగ్రగణ్య. 130
క. శౌచాదిగుణము లెడలుట
నీచత్వము వాటిలంగ ౯ నిశ్చలమతి దు
ష్టాచరిత మైనజపవిధి
నాచెప్పినసుగతిఁ దేదు౯ నరకము దెచ్చున్. 131
వ. అని చెప్పి వెండియు ని ట్లనియె. 132
సీ. వేదవేదాంగసం ౯ వేది గౌశికుఁ డను
ధరణీసురుఁడు సంహి ౯ తాజపంబు

విహితశీలతఁ జేయ వేయు వత్సరములు
ననిన సావిత్రి యమ్మునివరునకుఁ
బొడసూపి తనుఁ జెప్పఁ గడు భక్తితో నతం
డెఱిగిన నిచ్చెద నిష్ట మడుగు
మనిన నాతండు జపాతినిష్ఠయ కోర
నడి యిచ్చి దేవి నీ కత్యుదాత్త
తే. గతియు నగుధర్మ మర్థి నీకడకు వచ్చు
యముఁడు గాలుండు మృత్యువు నరుగుదెంతు
రనఘ నీకును వారికి నావహిల్లు
వాద మని చెప్పి చనియె భూ♦వరవరేణ్య. 133
క. ధరణీసురుఁడును జపత
త్పరుఁడై దివ్యాబ్దములు శ♦తంబు గడపె న
ప్పురుషవరుకడకు ధర్మము
పరమప్రీతిఁ జనుదెంచెఁ బౌరవముఖ్యా. 134
తే. అట్లు సాకారమై వచ్చి♦యతనితోడ
నీజపంబున సిద్ధించె♦నిరతిశయము
లైనపుణ్యలోకములునీ♦వందుఁజనుము
తనువుఁ జిత్తంబువిడిచియు♦త్సవమెలర్ప. 135
వ. అనిన విని యమ్ముని ధర్మంబున కిట్లనియె. 136
క. తనువు దొఱఁగి సనులోకము
లనఘా యేనొల్ల మేల♦యైనను దుఃఖం
బున కోర్చి నాతలంపున
కనుగుణమై యుండ దీని♦నగునె తొఱఁగఁగ. 137

వ. అనుటయు ధర్మంబు. 138

క. ఒడ లెట్లు విడువ వలదే
కడురమ్యము నాక మింత గానవొకో నా
వ్రుడు మేను వెలిగ నట వో
రొడఁబడ నని పలికె బ్రాహ్మణోత్తముఁ డధిపా.

వ. అని పలికిన ధర్మం బతనితో నీ వొడలు విడువ నొల్లవు పో
యమకాలమృత్యువులు వీరె వచ్చిరి చూడు మనియె
నయ్యవసరంబున వారలు వచ్చి యమ్మహీసురవరుముందఱ
నిలిచి తమ్ముం బేర్కొని రాతని నుద్దేశించి యముండు నీజ
పంబు ఫలంబు సిద్ధించె ననియెఁ గాలుండు నీకు నాకలోకా
రోహణంబునకుం గాలం బైనం దోఁచితి ననియెనుమృత్యువు
గాలచోదితనై నిన్ను నేఁడు గొనిపోవచ్చితి ననియును బలు
కుటయు నమ్మాటలు గీటునం బుచ్చుచు వారల వదనం
బులు విలోకించి సవినయవ్యాహృత స్వాగతుం డయి
యవ్విప్రుం డేను మీకు నెప్పని సేయువాఁడ నని పలికె
నట్టియెడ దీర్ఘయాత్రాపరుండైన యిక్ష్వాకుం డచ్చటికి
నేతెంచి వార లాదఱకుం బ్రణతుం డయ్యె బ్రాహ్మణుం
డతిథింగా నిరూపించి యాదరభరితుండై. 140

## కౌశికునకు నిక్ష్వాకుమహారాజునకు నయిన సంవాదము.

క. నాకలిమిఁ జూడ నిచ్చెద
నీ కెయ్యది యిష్ట మనిన నృపతి నృపులు దా

నైకపరులు గొనువారలె
యేకామ్యము లైన నిత్తుఁనీ వడుగు తగన్. 141

వ. అనిన విని విప్రుం డవ్విభున కి ట్లనియె. 142

క. కొనువారు ప్రవృత్తులు గా
క నివృత్తులు గొందు రయ్యఽకామ్యంబులు నా
మనమున లే వే నేమియుఁ
గొన నిత్తున కాన యధిపఽకోరుము తగఁగన్. 143

వ. పూజారూపంబున నిచ్చినయది యతిథిగైకొనుట యెగ్గుగాద నుటయు నమ్మనుజపతి నీ విచ్చువాఁడవయేని నీసకలజపం బుఫలంబును ని మ్మనిన నమ్మహీదేవుఁడు. 144

క. జపఫలమున సగమిచ్చెద
నృపయంతయు నైనఁ గొనుము ఽ నీ వనవుడు న
జ్జపముఫలం బెయ్యది యని
నృపుఁ డడిగిన నాతఁ డేను ఽ నిరపేక్షుండన్. 145

క. కావున ఫల మిట్టిది యని
భావింప నెఱుఁగ నొరులఁ ఽ బనివడ యడుగన్
నీ వాఫలంబు గొను మది
దా వినఁబడుఁ బిదప ధర్మ ఽ తత్త్వజ్ఞులచేన్. 146

వ. అనుటయు నయ్యినతనయుండు ఫలం బిట్టిదని యెఱుఁగలేనిం గొన నొల్ల ననవుడు నతం డతని కిట్లనియె. 147

క. నీ వడిగి తేను నిచ్చితి
భూవల్లభ యింక సత్య ఽ మున కూనముగా

దే వరియింపమి నావుడు
నావసుధాధీశుఁ డద్ధ ౯ రామరవరుతోన్. 148

వ. రాజులకు యుద్ధంబు సుకర్మంబు గావున నీతో వివాదయు
ద్ధంబు సేసితి ననిన నతండు నీవేమి సేసి తేమి యది య
ట్లుండ నిమ్ము. 149

క. విను మిచ్చెద నని యీమియుఁ
గొనియెదనని పలికి పిదపఁ ౯ గొనకునికియు న
త్యనృతంబులు సత్యవ్రత
మునకుం దొలఁగంగ మనకు ౯ భూవర తగునే. 150

క. సత్యమ తపమును యజ్ఞము
సత్యమ వేదంబు దాంతి ౯ శాంతులు నగుటన్
సత్యము దొఱఁగుట నిర్మల
నిత్యానుష్ఠానములును ౯ నిష్ఫలము లగున్. 151

వ. అనిన విని ధర్మంబు వారల నుద్దేశించి యమాదులు విన వీరికి
వివాదంబు వలదు విప్రుండు దానఫలంబును రాజు సత్య
ఫలంబునుం బొందువా రనియె నట్టియెడ నాకంబు నరాకృతి
దాల్చి వచ్చి తన్నెఱింగించి యయ్యిరువుర నాలోకించి
వాదేల మీారిద్దఱుం దుల్యఫలప్రాప్తుల రయ్యెద రిట్లుసేయుం
డని పలికె నవ్విభుం డట్లేని నితండును నాయిచ్చునది గొన
వలయు ననుటయు నమ్మౌని యేను దపస్స్వాధ్యాయ నిర
తుండ బర్రిగహ[1]విధియందు విరతుండ. 152

---

1. వృత్తి.

క. అనఘుఁడు నరనాథుఁడు నా
కును నీకును సరియ కాఁగఁ గోరెద సత్క
ర్మనిరూఢి మత్సుకృతఫల
మనఘా కొనవే యనుగ్రహంబు దలిర్పన్. 153

వ. అని ప్రార్థించె నప్పుడు వికృతవేషు లగు పురుషు లిరువురు దమలో వివాదంబు సేయుచు వచ్చి యవ్విభుంజు మనల శాసింప నొడయుండు వౌమ్మనుచు నిక్ష్వాకుముందఱ నిలిచిరి వారి తెఱంగు వినుము. 154

తే. ఒకఁడు గోదాన మొనరింప నొక్కరుండు
తత్ఫలము వేఁడఁ బ్రీతి నాతఁడు నొసఁగఁ
గొనినవాఁ డిది దక్కువ దనకు నని త
లంచి యుత్తమగోయుగళంబు విలిచి. 155

వ. సత్పాత్రదానక్రియ నిర్వర్తించి తత్ఫలంబు మున్ను దనకు గోదానఫలం బిచ్చిన యతని కిచ్చు వాఁడ యిన నితఁడును గొనువాఁడయి యుండి కొనక యెడ సేసి తిరుగం దిరుగ నప్పుడు ముట్టంబట్టినవాఁడు పుట్టిన వచ్చినవారై రత్తెఱంగెల్ల నుక్తి ప్రత్యుక్తుల నప్పుడమిఱేనికి నేర్పడం జెప్పి రట్లు సెప్ప వినిన యవ్విభునితోడఁ దొలుత నొసంగినవాఁ డితం డడిగిన నెమ్మిం బ్రతిగ్రహింపఁగా నొసంగితిఁ బ్రతిగ్రహం బొల్లని నన్ను నితండు నిర్బంధింపం దగునే యని చెప్పినఁ బిదపటి యాతం డితండు గొనియెద నని యొడంబడి కొనమి పాతకం బగుట కర్మకాండవిదు లెల్ల నెఱుంగుదు రనవుడుఁ గౌశికుం

డిక్ష్వాకు నుద్దేశించి వింటె యప్పురుషుని వచనంబు లని పలికి వెండియు. 156

క. నృప నీవు మదీయం బగు
జపములఫలం బడిగి తేను సమ్మతి నీఁగా
విపరీతఫణితు లాడిన
శపించుతుఁ జుమీ యెఱుంగఁ జాటితి నీకున్. 157

తే. అనిన నాతఁడు భయ మంది యాత్మలోన
నోరులయీగికి సకట చే యొద్దకుండు
నట్టినాకిది వలసెనే యనుచుఁ గరము
సాఁచె నవ్విప్రు సెనకు ని శ్చయముతోడ. 158

వ. [1]అతండు ననేకవర్షంబులు సేసినజపంబుఫలం బంతయు నీకి చ్చితి ననుచు ధారవోసిన నమ్మహీసురవరు నాననం బాలోకించి భూపాలుండు నాకరంబున జలంబులు వడియె మనకు నిద్దఱకును సత్కర్మసమత్వంబు గలుగవలదే నాయడి యైన యాగఫలం బేనును నీకిచ్చెదఁ గై కొనుమని పలికె నట్టియెడ వికృతవేషులగు నప్పురుషు లిరువురునన్నరనాథు నుద్దేశించి యేము కామక్రోధులము ధర్మ యమాదులచేతను మీరిద్దఱుం బరీక్షితుల రైతి రింతియ కాని యిచ్చుటయుఁ గొనుటయును నివి దైవాచరితంబులు మీకుం బని గా దని పలికిన విని యవ్విప్రుండు భూవిభునితో నిట్లనియె. 159

ఆ. శ్రద్ధయును బలంబు జపవిధియందు సా
విత్రి నాకు నిచ్చె వేఱు జపము

---

1 ఇట్లుసాఁచి నాభూసురోత్తముండు ననేక

నాచరింపఁజేడగడు నైనను నిందలఁ
యెదుర నీవు గోరి తివ్విధంబు. 160

క. కావునఁ బ్రార్థన సెఱుపం
గా వెఱచెద నట్లుఁ గాక కై కొంటి ధరి
శ్రీవల్లభ నీ సుకృతం
బే వెంటం దగిచె నరుగు మీ సద్గతికిన్. 161

వ. అనియె నయ్యుదపురసత్కర్మనిష్ఠావిశేషంబునం బ్రీతు లయి బ్రహ్మాదిదేవతలు వారలమీఁదం బుష్పవృష్టి గురియించుచు నయ్యెడకు నరుగుదెంచి యభినందించిరి దేవతూర్యంబులు మొరయ నప్సరోగణంబు లాడుచుఁ బాడుచు నుల్లసిల్లె నయ్యవసరంబునం గౌశికు నిక్ష్వాకు నుద్దేశించి నాకంబు.

తే. అనఘులార సంసిద్ధుల రైతి రింకఁ
దడయ నేటికి నిర్మలో దాత్తగతికి
నుత్సహింతురు గా కన్న మత్సరాది
బాధకంబులఁ బోఁద్రోచి బ్రాహ్మణుఁడు. 163

వ. ధర్మయమాదులను నాదిత్యసంఘంబును సవినయప్రణామ సహితంబుగా నామంత్రితులం జేసి. 164

## కౌశికేక్ష్వాకులు బ్రహ్మపదప్రాప్తులగుట.

క. వాయువుల నియతవృత్తిమ
నోయంత్రణ బొమలనడుమ నూల్కొలిపి విచే

1 దగు నె మైనను

ష్ఠాయితశరీరుఁ డై మూ
ర్ధాయోజితములుగఁ జేసి ♦ యత్తులఁ జేర్చెన్. 165

వ. అప్పుడు తదీయబ్రహ్మరంధ్రోద్గతుండును మహాజ్యోతిర్జ్వా
లాకృతియుం బ్రాదేశమాత్రుండును నగుపురుషు నెదు
ర్కొని పరమేష్ఠి సమాధానంబున వచ్చితే యని పలికి
యెండియు. 166

తే. జాపకులకు యోగులకును ♦ సమము పుణ్య
గతివిశేషంబు ప్రత్యక్ష ♦ కలిత మందు
జాపకులు నిర్భరోత్థాన ♦ శక్తి నధికు
లనుచు వక్త్రంబు విచ్చి ర ♦ మ్మనియె నధిప. 167

వ. అనుటయు. 168

తే. బ్రహ్మరంధ్రనిర్గతుం డైన ♦ బ్రాహ్మణుండు
బ్రహ్మవదనంబుసొచ్చెభూ ♦ పతియు నట్ల
వెడలి తద్వక్త్ర మెప్పటి ♦ వికసనంబుఁ
బొంద నందు బ్రవేశించె ♦ భూపవర్య. 169

క. దేవత లచ్చెరువడి య
ద్దేవుని నయ్యిరువురను ను ♦ తించి రజుఁడు సం
భావించె ధర్మమును నవ
నీవర యప్పరమవిభుఁడు ♦ నిరుపమలీలన్. 170

వ. తదనంతరంబ యంతర్హితుం డయ్యెఁ దక్కినవారును నిజ
స్థానంబుల కరిగిరి జాపక ప్రకారంబును దదీయసుగతివిశే
షంబు నెఱింగించితి నీ వింక నెయ్యది విన వల తనవుడు

నాపగాసుతునితోడం గుంతీతనయాగ్రజుండు నిరతిశయ
జ్ఞానయోగంబువిధంబు వినువాంఛ నాకుం గలదు సెప్పవే
యనిన నప్పురుషుం డప్పౌర వోత్తమున కిట్లనియె మను
బృహస్పతిసంవాదం బనునితిహాసంబు గల దది నీయడిగిన
యర్థంబునకు బోధకం బయి యుండు నాకర్ణింపుము మను
వాత్మీయ గురుం డగు దేవగురునకుం బ్రణమిల్లి. 171

## మనుబృహస్పతి సంవాదము.

సీ. జ్ఞానయోగము కృపఁ ♦ సంపన్నబుద్ధి నా
కెఱిఁగింపవే యన్న ♦ నెలమి నాతఁ
డతనికి ని ట్లను ♦ ననఘ సత్కర్మయో
గశ్రద్ధ దానికిఁ ♦ గారణం బ
నిష్టంబు ద్రోవను ♦ నిష్టంబు దేరను
నరుఁడు గర్మాచర ♦ ణంబు బొనర్చు
నెయ్యవి సుఖము లో ♦ క్కింతకాలమునకు
నవియ దుఃఖంబులై ♦ యావహిల్లు

ఆ. నింత యెఱిఁగి ఫలము ♦ నెడ నిరపేక్షుఁ డై
[1]నతఁడుసౌఖ్యదుఃఖ ♦ యమముఁ ద్రోచి
కామముఖ్యవిపద ♦ కంపితజ్ఞానవి
శేషబుద్ధిఁ బరమ ♦ సిద్ధిఁ బొందు. 172

వ. అని వెండియు. 173

---

1 సమత సౌఖ్యదుఃఖ ♦ చయముఁ.

క. అసమాలంబ మశబ్దము
రసగంధస్పర్శరూప ♦ రహితం బగుటం
బ్రసరించునింద్రియములకు
వసంబు గా దొందఁ బరమ ♦ వస్తువు పుత్రా. 174

క. స్త్రీపున్నపుంసకత్వము
లాపరతత్త్వమున లేమి ♦ నది విను తత్త్వ
ద్వ్యాపారాపేతం బయి
దీపించుచు నుండు బోధ ♦ దేహత్వమునన్. 175

తే. వెలుఁగు చుండెడిదీపంబు ♦ వేఱ వస్తు
వులఁ బ్రకాశింపఁ జేయున ♦ ట్లలఘునిత్య
బోధనజ్యోతి యింద్రియం ♦ బులను మాన
సమును దనప్రభ విగతజా ♦ డ్యములఁ జేయు. 176

క. విను పురుషున కింద్రియములు
మనంబుఁ గలిగించుఁ గ్రియల ♦ మను జేశునకుం
దనతన తెఱఁగునఁ గార్యము
లనేకములు సూపు సచివు ♦ లట్టుల వత్సా. 177

వ. అని మఱియును. 178

చ. అనలము దోఁచునే తరువు ♦ నందుఁ గుఠారముఖంబులైనసా
ధనములఁ బ్రవ్వ సజ్జనహి ♦ తా తగఁదర్చినఁ గాకయట్ల యి
త్తనువు నలంగఁజేసి పర ♦ తత్త్వముఁగాంతు మనంగ రాదు వి
న్ననువుననాగమో క్తమథ ♦ నం బొనరించినఁగానియారయన్

క. నాదమున నింద్రియములకు
పొందఁగ రాకున్న లేకయున్నె తత్త్వం
బెందు నపరభాగంబునఁ
బొందవు చూడ్కు లది లేకపోవునె సుమతీ. 180

క. వల యురి యోదము గాలము
గలిగి కదా మృగముఁ బక్షిఁ గజము ఝషము ద
క్షులు వట్టుదు రట్టుల త
జ్జ్ఞులు విజ్ఞానంబుకలిమిఁ జూతురు పురుషున్. 181

క. పా మెఱుఁగుఁ బాముకాళులు
ధీమంతుం డెఱుఁగ నేర్చు ధీసాక్షిత్వ
శ్రీమంతుఁ బరమపురుషుని
ధీమలనిర్మోచనంబు తెఱఁగు నెఱిఁగినన్. 182

క. కలుగుం దోషమి యమవసఁ
గలుగునె యాతటన యమృతకరునను నాశం
బలఘుపరవస్తువునకుం
గలదె యభావంబు మనసు గాననికలుచన్. 183

క. రవిబింబము రాహువు పయిఁ
గవిసినఁ బాసినను దోషకయుఁ దోఁచియు నుం
డువిధమ యజ్ఞానంబున
యవిరతివిరతులయధీనుఁడగు నాత్మునకున్. 184

క. విను మానసప్రసన్నతఁ
దనుఁ గనుపురుషుఁడు గలుమతిం గానఁడు దే

జెనసీట రూపు సూడఁగ
నను వై కలఁక నది లేనికయట్టులపోలెన్. 185

తే. ఇంద్రియంబులు దమయిచ్చనిట్టునట్టుఁ
దిరిగెనేనియు దుఃఖముల్ దెచ్చు నవియ
కట్టువడి సుఖ మొనరించుఁ గాన యాత్మఁ
గావవలయునింద్రియచోరగణమువలన. 186

క. పాపక్షయమున బోధం
బాపాదింపఁబడి మెఱుఁగు టద్దముకరణిఁ
జూపునకు వచ్చుఁ దనుఁ దా
నాపురుషుఁడు గాంచుపనికి నై తన్మయతన్. 187

తే. ధ్యానయోగనిశ్చల మగునంతరంగ
మెడల విడుచు గుణంబుల నిద్ధశాంత
మైననిర్గుణవస్తువునందుఁ గలయుఁ
బరమపద మది దానికిఁబరము లేదు. 188

వ. అని పల్కి సమ్యగ్జ్ఞానంబునకు మాయ మాటు గావున దాని మొఱంగు తెఱంగు దేటపఱుపం దలంచి యిట్లనియె. 189

బృహస్పతి మనువున కుపదేశించినమాయాప్రకారము.

క. విను మాయావిధ మిట్టిది
యని యారయ వెరవు గలుగదవనిం జరణం
బనఘా మోహనిజంతువు
ననుచో ప్పరయంగ రానిచందం బొందన్. 190

క. గుణమూర్తి మాయ దానిని
గణుతించెద నన్నుఁ దెగడు గాత్రివ్యాప్త్వంబుల్
గుణములఁ బెడఁబాపంగా
గుణనాతీత మగు వెలుఁగు గనుఁ బాన తనుల్. 191

తే. వినుము నృప సత్త్వముం రజస్సును దమస్సు
ననఁగ గుణములు ముప్పిరిగొనుచు నాత్మఁ
జుట్టుకొను నొండుమెయిఁ దెగవిట్టలముగ
నొలయువైరాగ్య మనుకోడవలిన కాని. 192

వ. అని నిర్దేశించి వెండియు. 193

ఆ. మణిమయములుఁ గనకమయములు రజతమ
యములు మఱియు మృణ్మయాదికములు
నైన పెక్కుపూసలందుఁ దాఁ డున్నట్లు
భూతకోటియందుఁ బురుషుఁ డుండు. 194

క. ఏకరసమయక్షేత్ర మ
నేకౌషధిరసమయం బగుయనయట్లు సుమీ
యేకవిధ మైనబుద్ధి య
నేకము లగుకర్మములమొయిం బొక నృపా. 195

ఆ. జలము పృథివికంటె జలముకంటెను దేజ
మంతకంటె వాయువాకసంబు
దానికంటెఁ బెద్దవాని కెల్లను బెద్ద
మనసు బుద్ధి పెద్ద మనసుకంటె. 196

తే. ధరణి మొదలైనపంచభూతములకంటె
మనసుకంటెను బుద్ధికంటెను మహాత్మ

రంబు గాలంబు గాలతత్త్వంబు మిగిలి
యుండు విభుఁ డిజ్జగంబులకెల్ల నొడయుఁ డతఁడు. 197

క. ఆదియు మధ్యము నంతము
నాదేవేశునకు లేమి నవ్యయుఁ డతఁడీ
వేదములకు నానావిధ
వాదములకుఁ [1]జేరఁగడ భవక్షేపి నృపా. 198

క. అనుభవము మిగులఁగు శాంతిం
గనునది నిశ్చేదసత్త్వ నిరాకాశం బది దా
విను తలఁపునకును బలుకున
కు నగమ్యము గర్మముల కగోచర మనఘా. 199

క. మనసు గొని మనసు బుద్ధిం
గొని బుద్ధిని దర్శనంబు గొని దర్శనముల్
విను క్రమమున నొడిఁగించినఁ
గను బుధుఁ డక్షరుని విష్ణు ఘనబోధమయున్. 200

క. అమృతం బచ్యుత మమలం
బమేయ మవ్యయ మనంత మస్పర్శుఁ గను యమా
ద్యముల నలవడినచిత్తము
శమాతిరేకమునఁ బొందఁ జనువేద్య మగున్. 201

క. అని గురుఁ డుపదేశించిన
విని మనువు గృతార్థుఁ డయ్యెఁ విద్వన్నుత నీ
వును నలవరింపుమీ మన
మున నివ్వాక్యములయర్థ మిం దత్పరతన్. 202

1. దేరుగడ.

వ. అనిన విని పరమ హర్షంబునం బాండవాగ్రజుండు పితా
మహుం బ్రశంసించి మహాత్మా మహనీయుం డగు కృష్ణుని
మాహాత్మ్యంబు విననలఁతుఁ జెప్పవే యని యడిగిన నతం
డమ్మహీపతితో నారదజామదగ్న్యమార్కండేయవ్యాస
వాల్మీకి ప్రభృతిమునీంద్రులు సెప్ప వినిన తెఱం గెఱిం
గించెద నాకర్ణింపు మని యిట్లనియె. 203

క. కృష్ణుఁడు ప్రభవిష్ణుం డగు
విష్ణుం డనిలాగ్నితోయ వియదిలలఁ గ్రియా
నిష్ణాతత్వవినోదన
తృష్ణం గల్పించెఁ దనదు దివ్యవిభూతిన్. 204

తే. అట్లు కల్పించి జలముల యందు భవ్య
తల్పగతుఁ డైన నాభిఁ బద్మంబు దోఁచె
నందజుఁడు పుట్టి సృజియించె నందనుల మ
నంబునన సప్తసంఖ్యుల నరవరేణ్య. 205

వ. మరీచియు నత్రియు నంగిరసుండును బులస్త్యుండును బుల
హుండును గ్రతువును దక్షుండు ననం బరఁగువారలయందు
మరీచికిం గశ్యప ప్రజాపతి జన్మించె నతనివలన సురాసుర
గరుడనాగాదిజాతిసంభవంబునుం గలిగె నతనికి సూర్యుం
డును నత్రికి సోముండును నుదయించి రాజవంశంబులకుఁ
గూటస్థులైరి సూర్యసోమాన్వయజాతులైన నృపతు లనేకు
లనేక దేశంబు లేలిరి దేశకాలవిశేషంబుల నృపకులంబులు
బహుశాఖంబు లై వర్తిల్లు వాని నెల్లం దనవలసినయప్పుడు

విష్ణుండు పరస్పరవిరోధజనిత సంగ్రామంబులు నిమిత్త మాత్రంబులుగాఁ గలవిశేషప్రకారంబుల నుపసంహరించు నద్దేవుండు వాసుదేవసంకర్షణ ప్రద్యుమ్నానిరుద్ధాత్మకంబు లగు చతుర్విధదివ్యస్వరూపంబులు గలిగి జగద్భరణం బాచరించుచు నిట్లు లీలాజన్మంబులం బొంది క్రీడ సలుపు నని కృష్ణునిం జూపి యీభూతేశ్వరు మానుషసామాన్య దృష్టిం జూచుట యజ్ఞానంబు గృష్ణుండు భక్తపరతంత్రతం జేసి యుత్కృష్టచరితులయారాధనంబులకు భాజనం బయి భోగమోక్షంబులు గరుణామయకటాక్షంబుల నొసంగు ననినం బ్రీతుండై భీష్మునకుం బ్రణమిల్లి యుధిష్ఠిరుండు.

క. మునిజనవినుతచరిత్రా
మనుజుం డెవ్వనిఁ దలంచి మహనీయనిరం
జనసిద్ధిఁ బొందఁ గను నే
యనువు దలపు 1నలవరించు నని యడుగుటయున్.

భీష్ముఁడు ధర్మజునకు విష్ణుమంత్రప్రభావంబు తెఱఁగెఱింగించుట

వ. ఆధర్మతనయుతోడ నద్దేవవ్రతుం డిట్లను నారదునిచేత వినినతెఱంగు వివరించెద నాకర్ణింపుము. 208

తే. పరము నక్షరు విష్ణునిఁ 2బ్రస్తుతించి
నారదమునీంద్రుఁ డంజలి నమిత మైన
మస్తకముఁ జేర్చి భక్తిస మగ్రచిత్త
వృత్తి నల్లన యిట్లని విన్నవించె. 209

1 నిలువరించు 2 బ్రస్తరించి

క. దేవా మోక్షార్థిజనము
లేవెరవున నిన్నుఁ దలఁతు రే జేజప్యము సం
భావింతురు నా కానతి
యీవే భక్తపరతంత్ర యేర్పడఁ గరుణన్. 210

తే. అనిన నద్దేవముఖ్యపలు కాదరించి
వరమునఁ దగువిష్ణుఁ డిట్లనుఁ బరమభక్తి
నిర్మలశ్రద్ధ యింద్రియనిగ్రహంబు
మన్మయధ్యానమునకు న మాత్యకోటి. 211

క. విను వీతకల్మషున కవి
పనుపమఁ గల్మషము లెల్లఁ బాపఁగ నామె
చ్చినయట్టిపరమసాధన
మనుస్మృతి జపించునది ని యతిమెయి దాన్. 212

తే. ప్రణవపూర్వక మగునమః పదముపొంత
మద్గుణైశ్వర్యవాచక సర్వవసన
నిర్వచనశబ్దములు క్రమ నిష్ఠమెయిఁ జ
తుర్థిఁ గూర్పంగమంత్రంబు దోఁచు బెరసి. 213

క. తొలితొలి యిమ్మంత్రము ని
శ్చలమానసుఁడై జపించి జపియింపంగా
వలయు ననుస్మృతి దానం
గలుగుఁ జతుర్వర్గసాధ కత పురుషునకున్. 214

క. అని మఱియు దయ ననుస్మృతి
యనుపేరం గలుగుదాని నమ్మునిపతి కి

ట్లని చెప్పి నచ్యుతుఁడు నిజ
మనఃప్రియుం బైనయట్టి మహితస్తవముల్. 215

సీ. అవ్యక్తు శాశ్వతు నఖిలప్రభవభూమి
భక్తవత్సలు విష్ణుఁ బరమపురుషు
నక్షయుఁ బ్రాంజలి నై యాశ్రయించెదఁ
బుండరీకాక్షుని భువనసాక్షి
నిత్యుఁ బురాణు వర్ణించెదఁ బరు సహ
స్రాక్షు నక్షరుని లోకైకనాథు
భవ్యుఁ గొల్చెద భూత భవ్యభవత్ప్రభు
సర్వతోముఖు భూత సంప్రవర్తు

ఆ. నమృతు నచ్యుతుని న నంతు హృషీకేశు
రవిసహస్రనిభు హి రణ్యగర్భు
నబ్జనాభు సత్యు నాద్యంతరహితు భూ
గర్భుఁ బ్రభువు భక్త గమ్యుఁ దలఁతు. 216

తే. అచలు సూక్ష్ము వరేణ్యు స హస్రశీర్షు
నభయకారి సశీర్షు నా రాయణుని స
నాతనుని యోగమూర్తి లోకాతిరిక్తు
ధ్రువుని నీశ్వరు హరి భక్తి తోడఁ గొలుతు. 217

క. ఎవ్వఁడు సచరాచరగురుఁ
డెవ్వనినాభీసరోజ మిూనె విధాతల్
నివ్వటిలు జగము లన్నియు
నెవ్వనిచే నమ్మొకుందు నెప్పుడుఁ గొలుతుల్. 218

తే. స్థావరములు జంగమములు ధాత్రిలోను
గాఁగఁ బ్రళయంబు బొందిన కాలమునను
నిలుచు నెవ్వఁ డాకండ యా నిత్యసత్త్వ
లలితు శార్ఙ్గిఁ బ్రసన్నుఁ గాఁ గొలుతు నియతి. 219

క. కాలముఁ బర్జన్యుండును
నేలయు సస్యంబుఁ గ్రియయు నిష్క్రియయును ధ
ర్మాలోకము నై మహిమ
న్లీల సలుపువాసుదేవుని బ్రణుతింతున్. 220

క. అనలునకు రవికిని శశాం
కునకును గ్రహతారకములకును దేజం బె
వ్వనివలన నావహిల్లెడు
ననుపాధిక తేజుఁ గొల్తు నవ్విశ్వాత్మున్. 221

తే. నాలుగింటను వొడియు నాలుగింట
రెంట నైదింట మఱియును రెంట వేల్చి
యజ్ఞశీలు రారాధించు నట్టివిష్ణుఁ
డిష్టదాయి ప్రసన్నుఁ డయ్యెడును నాకు. 222

ఆ. యజ్ఞధరుఁడు పంచయజ్ఞుండు లక్ష్మికి
నునికిపట్టు యోగమునకు నెలవు
సర్వమునకు నిష్టసదనంబు గా నొప్పు
వాని నాశ్రయింతు వరదుఁ బరము. 223

ఆ. అగమనునిం బ్రాంశు నఖిల
జగద్ధరణపరు సమూర్తి సాగరనిభుఁ బో

ధగద్ధిష్ణుఁ బంచకాల
జ్ఞు గుణాత్మకు నిర్గుణత్వ♦శోభితుఁ గొలుతున్. 224

క. వ్యక్తమునకుఁ బ్రభవం బ
వ్యక్తం బాత్మత్వమునకు♦ నవుల యనునచో
యుక్తికిఁ బరాయణం బగు
భక్తపరాధీను భవ్య♦భావ్య నుతింతున్. 225

క. జ్ఞానధ్యానపరాయణు
లైనమహాత్ములు జితేంద్రి♦ యత్వమహితు లె
వ్వానిం బొందిన మరలరు
వాని శరణుఁ జొచ్చి బ్రదుకు♦వాఁడ సుకృతి నై. 226

క. లోకం బాతయు నెవ్వం
డేకాంశంబునన నిర్వ♦హించుచు నగ్రా
హ్యాకారుం డై వెలుఁగు న
యాకరు నప్పద్మనాభు♦నభివర్ణింతున్. 227

తే. అయిదుదెఱఁగులఁ బ్రకృతిఁ బంచాననముల
ననుభవించుక్షేత్రజ్ఞు స♦త్త్వాదిగుణచ
యంబు లీల భుజించు మహత్త్వకలితు
సంశ్రయింతు మదాత్మ ప్ర♦సత్తిఁ గోరి. 228

క. మతిగలసాంఖ్యులు యోగా
న్వితులు నగుమహాత్ము లెవ్వ♦నిం గని పునరా
గతి లేనిసుగతి నడయుదు
రతర్క్యవైభవుని నలఁతు♦నప్పరమాత్మున్ 229

క. ఇనునడుమ వెలుంగుచు సో
మునిమధ్యమునం జలత్వముం బొందనిని
ల్పున వెలయుదీప్తియగువా
ని నిరంజను నంతరాత్మునిం బాటింతున్. 330

క. సోమార్కాగ్నిమయముఁ దా
రామయమును నిత్యసుస్థిరంబును నగు తే
జోమయతత్త్వము నాత్మా
రామత్వంబున నిరంతరంబును జూతున్. 231

క. గుణములకు నాది యై ని
ర్గుణమ్ములకు నాద్యుఁ డగునరూపుని లక్ష్మీ
ప్రణయ పరము నజు సూక్ష్ముని
బ్రణుతింతుఁ బ్రసన్నుఁగాఁ బరము సర్వగతున్. 232

క. కలయంగ నెల్లయెడలుం
దలలును లోచనములును వదనములు నగుని
ర్మలు నిర్వికారు నిన్నుం
గొలిచెద సర్వైకసాక్షి గోవింద హరీ. 233

క. నిను నెఱుఁగకున్న సంసా
రనిమగ్నత [1]పోదు గోచరము గావు మనం
బునకు నఖిలేంద్రియములకు
నను నే మనువాఁడ వింక నారాయణుఁడా. 234

క. రోషముఁ గామము రాగ
ద్వేషములును లేక భక్తి దిర మై యేకా

1. పాఱదు.

క్షేమిణిగాఁ గొలుతు రవి
క్షేమమనోనిలయువృత్తి సిద్ధులు నిన్నున్. 235

క. ఫలములు గోరక కర్మం
బులు నడపుచు వాని విమల బోధాగ్ని[1]హుతిం
బొలియించుచు నిర్ద్వంద్వత
నెలకొను నేకాంతిజనులు నిన్ను గందురు) హరీ. 236

క. దేహస్థు నదేహు నఖిల
దేహిసముఁ నిన్ను భక్తిఁ దెలుతురు దురిత
వ్యూహమ్ముఁ బుణ్యచయము న
మోహత నిరసించుయోగిముఖ్యులు కృష్ణా. 237

చ. ప్రకృతియు బుద్ధ్యహంకృతులు భావము భూతచయంబు నిం
ద్రియ। ప్రకరముఁ గేశవా భవదుపాశ్రయ[2]భావితవర్తనం
బులా। సకలమునందు నీవును బ్రసన్నత నిల్తది నీకు నీవు
దా। నికి నిలువంగఁ బట్టగుట నిక్కము [3]గాదిటు లై
వెలుంగుదే. 238

క. ఏకత్వం బన్యత్వమ
నేకత్వము గలుగునీమ హిమచందం బా
లోకింప నిపుణు లగుసు
శ్లోకులకుం బరమపదము సులభము శార్ఙ్గీ. 239

తే. అచరములునుజరంబుబులు నైనభూత
సముదయంబులుమణులుసూ త్రమునసున్న

---

1. హుతిం. 2. భావిత. 3. గానిటు లై వెలుంగవే.

కరణి నీయందు యున్నవి \ గాన సమత
నేకభక్తి నేఁగోరెద \ నిమ్ము దేవ. 240

క. హేతురహితుఁడ వకర్తవు
భూతస్రష్టవు సమస్త \ భోక్తవ తత్త్వం
బై తత్త్వము నగుదు జగ
న్నేతవు కూటస్థుఁడవును \ నీవ ముకుందా. 241

సీ. ద్వేష్యంబుఁ బ్రియ మను \ వేర్పాటులేదు భూ
తములయందెల్లను \ సముఁడ నాకు
భూతసంయోగంబు \ బుద్ధ్యహంకారయు
క్తియు గుణత్రయసంగ \ తియును లేవు
ప్రారంభణంబు ధ \ ర్మాధర్మములు నింద్రి
యముల పొందును విష \ యాభిరతియుఁ
బరిహృతంబులు జరా \ మరణమోక్షార్థినై
శరణంబు వేఁడెదఁ \ గరుణ నాదు

తే. ఘ్రాణజిహ్వలు మహి నుద \ కమున దృక్కు
త్వక్కు దేజంబునందును \ వాయువునను
శ్రోత్ర మాకాశమునఁ గ్రమ \ సూత్రితముగఁ
బొందఁ జేసి గోవింద యా \ నంద మిమ్ము. 242

సీ. ఇల జలంబుల జలం \ బులు శిఖి శిఖి వాయు
వున వాయు వంబరం \ బునను నంబ
రంబు చిత్తమునఁ జి \ త్తం బహంకృతి నహం
కృతి బుద్ధిఁ దగనొడఁ \ గించి యింత
వట్టునుగూడ న \ వ్యక్తంబుఁ జేర్చి య

వ్యక్తంబు నిజభంగి ♦ వ్యయినఁ ద్రిగుణ
సామ్యవ్యవస్థితి ♦ నడిసన్నఁ గారణ
భూతతన్మాత్రలు ♦ పొదువకుండఁ

తే. దొలఁగఁబెట్టుట దొరకొన ♦ వలయు దానఁ
బరమమున కేవలమునగు ♦ పదముగలిగి
యేన నీ వను నైక్యంపు ♦ టెఱుక వొడముఁ
గాత గమనాగమనములు ♦ గ్రాఁగి పోవ.

క. హరియం దేనును నాయం
దరయంగా హరియుఁ గలము ♦ హరి నాకును నా
హరి కేను ననశ్వరులము
హరిప్రసాదోదయము మ ♦ హత్తర మహిమన్. 244

తే. బుద్ధియును బ్రాణమును నిన్నుఁ ♦ బొరయఁ జేయఁ
జాలుభక్తి నా కొసఁగుము ♦ జలధిశయన
పూర్వకర్మఫలంబులు ♦ వొందఁ గాక
యవి ఋణంబులు గడతేఱు ♦ లై సుఖంతు. 245

తే. నిన్ను నెప్పుడుఁ దలఁచెద ♦ నన్ను నీవు
వత్సలుఁడ వయి పేఁదు నా ♦ వాఁడనంగ
వలయుఁ జుమ్మయ్య మఱపక ♦ వాసుదేవ
దేవ దేవ మునీశ్వర ♦ భావనీయ.

క. తనుఁ దనయంద నిలిపి పే
రనువున బుద్ధికడ వెలుఁగు ♦ నచ్యుతుని సనా
తను నగాగ్రిహ్యునిఁ జిన్మయు
ననుస్మరించునది యపున ♦ రావృత్తికి నై. 247

క. పరమాత్ముని నారాయణుఁ
జిరంతనుని భక్తశేముషీ నిష్ఠాస్వీ
కరణైకాయనుని సమ
స్కారణంబునఁ దలఁతు నతుల షడ్విధభూతిన్. 248

తే. అని జపించి సర్వావస్థ లందు నిను వి
శిష్టభక్తి ననుస్మరించినయతండు
సకల పాపంబులను బాసి శాంతినొంది
యవ్యయానందపదమున నతిశయిల్లు.

తే. వైష్ణవియుఁ గల్మషవ్రజ ధ్వంసినియును
నైన యీయనుస్మృతి ప్రాజ్ఞుఁ డైన నజ్ఞుఁ
డైన నెవ్వాఁడు పఠియించు యజ్ఞదాన
సమయములవాఁడు తత్ఫల శతము వడయు.

క. సురపితృపూజలఁ బావక
పరిచర్యలయందు నన్ను భక్తిఁ దలఁచుచుం
బరమనియతి నివ్వాక్యో
త్కరముఁ బఠించినయతండు గనుఁ బుణ్యగతిన్. 251

క. వినిపించునది యనుస్మృతి
నిను భక్తిం గొలుచు బహుజనముల కమావా
స్యను బున్నమ బారసిని స
వినయంబుగ దాన నెల్ల విభవముఁ గలుగున్.

క. జనము లనుస్మృతిఁ జదువఁగ
విని మ్రొక్కిన యంత్యజునకు విశ్రుత గతి గ

ల్చు ననిన సద్భక్తి జపిం
చిన యుత్తమజాతిజునకుఁ జెప్పఁగ నేలా. 253

ఆ. అఖిలకర్మఫలము నంతవంతంబు మ
ద్భక్తులకు ననంత పదము గలుగు
నట్టు లగుటఁ దలఁపు మమరమునీంద్ర ని
న్నది మదీయపద మపూర్తిఁ జేయు.

క. జ్ఞానము కేవలకృప న
జ్ఞానికిని నుపదేశవిధిఁ బ్ర జనితము సేయం
గా నది సకలధరిత్రీ
దానంబునకంటె నధికతరఫలద మగుఁ జూ. 255

క. కావున నీ కేఁ జెప్పిన
యీవిధ మంతయును శుద్ధ హృదయులకుఁ గృపా
శ్రీ వెలయఁ జెప్పుమీ పు
ణ్యావహశీలురకు సులభ మగు సర్వంబుఁ జూ. 256

తే. అశ్వమేధ సహస్రంబు లాచరించి
పడయరాని మహోన్నత పదము నన్మ
దీయభక్తిని నైక ప రాయణుండు
నడయ నేర్చు సుకరముగ బ్రహ్మపుత్ర. 257

సీ. అని చెప్పె నిట్టు ల య్యనిమిషమునిపతి
[illegible] తెంభుఁ జే య్యాది సమాద
[illegible] రాజమాశోత్త మ
తెల్లంబుగా నది యెల్ల నీకుఁ

జెప్పితి నేకాగ్ర చిత్తుండ వై పర
మాత్ము నన్నారదు నట్ల భక్తి
సంభృతశ్రద్ధాను షంగతాత్పర్యంబు
తోఁ దలంపుము కృతా ర్థుండ వగుదు
తే. పరమవరదరహస్యాను భావపూజ్య
మానమూర్తి యనుస్మృతి దీనిజపము
బుద్ధిఁ బెనుచు దుఃఖంబులఁ బోవఁ ద్రోచు
బాధములఁ బాపు నిత్యశు భంబు నొసఁగు. 258
క. అని భీష్ముం డుపదేశిం
చిన విని యానందభరిత చిత్తుం డై పాం
డునృపాత్మజుఁ డప్పుణ్యా
త్మునకుం బ్రణమిల్లె వినయ మునఁ దను వొప్పన్.
వ. ఇట్లు ప్రణామంబు సేసి యాధరణీవరుండు గురుపితామహు
తో మోక్షమార్గబోధన ప్రపంచం బుపదేశింపవే యని
యడిగిన నతండు వార్ష్ణేయాధ్యాత్మం బను నితిహాసంబు గల
దాతంత్రంబు నీయడిగినది యై యుండు నని పలికి వినుము
వార్ష్ణేయనామధేయుం డగువాఁడు. 260

భీష్ముఁడు ధర్మజున కధ్యాత్మ విద్యాప్రకారం బెఱింగించుట.

క. మానితమునిఁ డొకఁడు సుఖా
సీనుం డై యున్న నతని శిష్యుఁడు వినయం
బూని నిలిచి మోక్షము తెరు
వానతి యీవే దయామ యా నా కనుచున్. 261

వ. పాదములకుం బ్రణమిల్లినఁ బ్రబోధమహితాత్ముం డగు
నమ్మహాత్ముండు. 262

ఆ. భక్తి గలవు నాకుఁ బ్రజ్ఞానఘనుఁడ వ
ట్లవుట నీవు యోగ్యుఁ డవు కుమార
సదుపదేశమునకు సమవధానుండ వై
వినుము నాదు వాక్య వృత్తి తేఱఁగు. 263

వ. అని పలికి యిట్లనియె. 264

తే. కాలచక్రంబు నిరవధి కంబు దీన
సర్గములుఁ బ్రళయంబులుఁ జనుచు నుండుఁ
బ్రళయమునఁ బరమాత్ముండు ప్రకృతిఁ బొంది
యఖిలమును సృజియించుఁ గ ల్పాదియందు. 265

తే. భూతజాలంబుతో ముని పుంగవులును
దోఁచి మును ప్రళయంబునఁ దోఁ పడంగి
చనినసర్వవేదంబులు శాస్త్రములును
బడసి రద్దేవుదివ్యాను భావమునను. 266

క. న్యాయాద్యనేకతంత్రము
లాయంచితమతు లొనర్చి యఖిలజనాను
ష్ఠేయాచారములుఁ బరి
జ్ఞేయములుగ విశదభంగిఁ జేసిరి పుత్రా. 267

క. అవి వినఁగ నెఱుఁగఁ జేయను
నవుఁ బరమబ్రహ్మబోధ మమరులకు ముని

ప్రవరులకు దుర్లభ మ
య్యవగతము జనార్దనునక యలవడి యుండుఁ.

ఆ. సకలమోక్షకామ జం బగునట్టియు
నప్పురాణపురుషు నగ్గలంపుఁ
గరుణ నతనివలనఁ గనిరి మునీంద్రులు
గ్రమముతోడ సర్వ గమ్య మయ్యె. 269

క. చైతన్యశక్తిఁ బురుషున
మేతత్త్వవిశేషమున వహించుఁ బ్రకృతి త
జ్జాత యగును బుద్ధి తదు
ద్భూత మహంకార మదియుఁ బొరయుం జిత్తుఁ.

క. కలిగె విను మహంకారము
వలన నభము దానఁ జేసి వాయువు గ్రమసం
కలితజనములఁ దేజము
జలము నిలయుఁ దత్తదాత్త జన్యత్వమునన్. 271

వ. బుద్ధికి మహత్తనుతత్త్వనిర్దేశంబునుం గలిగియుండు. 272

క. వికృతులు మహదాదికస
ప్తక ముభయవిధేంద్రియములు పదియు విషయపం
చకమును మనసును గూడఁగ
వికారషోడశక మిది వివేకాభ్యర్థీ. 273

క. ఘనమ్ము దేహతత్త్వ
భాసిత మిది దేహి యైన పరమాత్ముని వి

న్యాసమునకుఁ గా నొదవి యు
పాసించుం గరుణరూప ♦ నైం యాకర్తన్. 274

తే. పుత్ర వినుము నవద్వార ♦ పుణ్యపురము
నం దచింత్యసంవ్యాపకుఁ ♦ డై శయించు
నీ సమస్తభావంబుల ♦ నెసఁగి యట్టి
లగుటఁ బురుషుండు నాఁ జను ♦ నవ్విభుండు. 275

క. అమరుం డవ్యయుఁ డజరుం
డమేయుఁ డమలస్వభావుఁ ♦ డప్పురుషుఁడు దే
హమున మహీజమునం దన
ల మున్నగతి నుండు మథన ♦ లక్ష్యుం డగుచున్. 276

ఆ. వినుము యోగమథన ♦ మునఁ దోఁచు నత్తేజ
మది ప్రబోధసాంద్ర ♦ మఖిలభూత
గణసమాశ్రయంబు ♦ గావున శ్రవణాద
ర్శనముఖక్రియాక ♦ రంబు దాన. 277

క. భూతము లవ్యక్తంబున
జాతము లగు నంద పెరుఁగు ♦ సమయుఁ దదీయ
స్థితత్వమునన పురుషుం
డేతద్విధసాక్షితాన ♦ మిద్ధుఁడు వత్సా. 278

### భీష్ముఁడు ధర్మజునకుఁ గాలచక్రప్రభావం బెఱిఁగించుట.

ఆ. వ్యక్తసప్తధార ♦ మవ్యక్తనాభంబు
షోడశకవికార ♦ సుపరిమండ

లంబు ధ్రువ మధిష్ఠి । తం బాత్మచేతఁ జ
క్రంబు దిరుగుచుండుఁ । గాలవశత. 279

క. ఈచక్రంబున సకలచ
రాచరమయ మైనలోక । మవశానిష్ఠా
గోచర మై చరియించుట
చూచికొనన్ వలయుఁ దత్త్వ । శోధనదృష్టిన్. 280

తే. పొందు సత్త్వరజస్తమం । బులు విశుద్ధ
నంతరాత్ముఁ బాసుప్రాత । మనిలుఁ జెంద
నట్లుసద్వివేకమునఁ దర । దంతరంబు
బుధుఁడు గాంచి యగ్గుణములఁ । బారయ కుండు. 281

క. వేదాంతవిదుఁడు దుర్లభుఁ
డాదరము ప్రవృత్తిలక్ష । ణాన్విత మగుధ
ర్మోదయమందు గలుగు నది
లేదరయ నివృత్తి సౌఖ్య । లీనత్వమునన్. 282

క. ఆర్యులుఁ బ్రవృత్తిలక్షణ
కార్యంబులచేతఁ జేసి । గ్రాహ్యము నగుత
ద్ధుర్యత్వమందు విడువ ర
నార్యము లగుమదన మద భ । య క్రోధాముల్. 283

తే. వినుము దేహాభిమానికి । వీనినెల్లఁ
దాఱఁగ దొరకొన దెంతశాం । తునకు నైనఁ
గాన యేమిటు దేహాభి । మాన మెడలు
నట్టిమా వభ్యసించు వే । దాంతవిదుఁడు. 284

ఆ. అడవి సొచ్చి యంత ♦ కంతకు నవులకు
నతికుతూహలమున ♦ నరిగి యరిగి
చూచుచుండునట్లు ♦ సూవె సంసారకా
ననమునందుఁ దిరుగు ♦ జనులనడపు. 285

క. విను తెవు లుడుపఁగ భేషజ
మునకుం దలకొనిన చంద ♦ మున మది సత్త్వం
బును శౌచము శమమును దమ
మును నెలకొలుపంగవలయు ♦ మోహచ్యుతికిన్.

తే. భూమి మొదలుగఁ గలభూత ♦ ములకు నింద్రి
యముల కన్నింటికిని సత్త్వ ♦ మాది యైన
గుణములకు నెల్ల జగముల ♦ కును దదీశ్వ
రునకు నరయ నహంకార ♦ మునికిపట్టు. 287

తే. స్మృతియు సంప్రీతియును బ్రస ♦ న్నతయు మఱియు
నీదృశములును సత్త్వగు ♦ ణోదితములు
రాగలోభరోషాదులు ♦ రాజసములు
దర్పశోకప్రముఖములు ♦ దామసములు. 288

క. జ్ఞానమునకు నగ్గుణసం
తానం బడ్డంబు గాన ♦ తత్ప్రతిహతికై
పూని మును సాత్త్వికమునను
మానస మాన్పంగవలయు ♦ మహనీయధృతిన్. 289

క. విను సాత్త్వికములు మది నెల
కొని రాజసతామసముల ♦ కును విగతత్వం

బొనరించుc బదంపడి స
త్త్వనిరూఢత బోధసంప ౯ దకు హేతు వగుc౯. 290

తే. క్రియ లహంకారమునcగల్గుc ౯ గ్రియలవలన
దేహసంబంధమెడలక ౯ తిరుగవలయు
జన్మపర్యాయములయందు ౯ జన్మ మనcగ
మిళితనవశుక్లశోణిత ౯ కలితవృత్తి. 291

ఆ. మాతృమునcబుకీష ౯ మున నూనుచును గర్భ
మునc బ్రవర్ధనమ్ముc ౯ బొందివెడలి
సంతతానుబంధ ౯ సంసారదుఃఖని
ర్మగ్నుc డగుచు నుండు ౯ మానవుండు. 292

క. ఇంతకు మూలము దృష్ణా
తంతులతయ వత్స వినుము ౯ దానికి నడరం
గాంతాజనంబు దోలుపాcc
కింత యెఱcగి తృష్ణ దొఱcగు ♦ టిచ్చు విముక్తి౯. 293

క. జ్ఞానాజ్ఞానంబులకుం ౯
దాన యుపాశ్రయము బుద్ధి ౯ తత్త్వాహంకా
రానూనలక్షణాఢ్యం
బైనయెఱుక దాని జీవుc ♦ డని చెప్పు శ్రుతుల్. 294

ఆ. అతcడు కాలకలిత ♦ మైనకర్మమున సం
సారవర్తనంబు ౯ సలుపు చుండు
స్వప్నసంప్రవృత్తి ౯ సలిపెడునరుమాడ్కి
నింద్రియములతోడ ౯ నెనయ బెరసి. 295

క. రాగపరిలి ప్తమానస
యోగంబున నింద్రియంబు ◌ లుల్లసితము లై
భోగ లగుట యుడిపిన నప
రాగతసంసారదుర్వి ◌ రామము సేయున్. 296

క. పురుషు లఖిలభూతములను
బురుషులలో భూమిసురులు ◌ భూమిసురులయం
దరయంగ మంత్రవేదులు
నరు లధికులు బోధయుతులు ◌ వారలకంటెన్. 297

క. జ్ఞానంబు దృష్టి నరునకుఁ
గాన నయనహీను నడపు ◌ కరణి యగుటఁ బ్ర
జ్ఞానవిహీనునినడవడి
దీని నెఱుఁగ వలయు నెఱుక ◌ దెచ్చికొనంగన్. 298

క. క్షమయును సత్యంబును శౌ
చమును సుధర్మములు బ్రహ్మ ◌ చర్యం బత్యు
త్తమధర్మము వానికిఁ జి
త్తము నలవఱుపంగవలయు ◌ ధైర్యముపేర్మిన్. 299

క. పరిహాసము భాషణమును
నిరీక్షణము లోను గాఁగ ◌ నింద్యంబులు సుం
దరులయెడ దీని [1]కే మని
చొరఁ దగ ద ట్టైన మనసు ◌ సొత్తురు సుదతుల్.

క. విను మాంసాస్థిమయం బని
వనితాంగము సద్వివేక ◌ వైభవమునఁ గాం

---

1. కేమఱి.

చిన నాడు మది దగుల దా
పనికిని నాడీవిశుద్ధి ప్రాపగుఁ బుత్రా. 301

క. శారీరస్థితికిఁ బ్రథమ
కారణ మై యుండు నాడి కాదశకము సం
చారక లగునింద్రియముల
కారయ నాడికలు మఱియు నై దమలమతీ. 302

తే. స్థూలభాగులు పదియును సూక్ష్మభంగు
లైదు నివి కనికంటె నత్యంతసూక్ష్మ
భంగి హృదయంబునడుమగాఁ బరఁగి యున్న
నాడి యది సర్వగత యగు జూడఁ జూడ, 303

క. ఆమూపు మఱిగి చిత్తం
బేచవికిం బోదు పోయెనేని మరలుపఁగ
గోచర మగు వెలిచవులం
బాచిన లోచవిన నిలిచి పరమాత్మఁ గనుఁగ. 304

క. ఆవిధము శుక్లగతి గను
భావమునకుఁ గాని పట్టువడదు వినుము శు
క్లావేశము సంకల్పజ
మావాసము శుక్లమునకు నఖిలాంగకముల్. 305

క. అరయఁగ సంస్పర్శమునన
తిరుగుడు వడు శుక్ల మనుట తెఱఁగే సంక
ల్పరతిం గలదే చోఁకెడఁ
జరింప కుండంగ వలయు సంకల్పంబుల్. 306

తే. అత్రిముని యింద్రిదైవత్యయని జనులకుఁ
దెలిపె నది కారణముగ నిఁకదిద్రియ మనంగఁ
బరఁగుఁ జూవె నృబీజంబు ♦ పరమ మెల్ల
ధాతువుల కది విను పుత్ర ♦ దానివిధము. 307

ఆ. శుక్లమునకు మనసు ♦ సూక్ష్మరూపము మనో
బలము నిల్వరింపఁ ♦ బక్వబుద్ధి
మోపుఁ దరుణావృద్ధ ♦ లోప రజ్ఞానదౌ
ర్బల్యమూఢవికల ♦ భావు లగుట. 308

క. కావున శుక్లస్థితికిం
గావించినయట్టిపుణ్య ♦ కర్మము లగుస
త్సేవితయమనియమాదుల
త్రోవ నొరఁగ వలయు విషయ ♦ దూరాత్మకుఁ డై.

క. అరయఁగ విషయము లెంతయు
దురంతములు వానియందుఁ ♦ దొడరినఁ జేటుం
బొరయుదురు దొడర కున్నం
బరమపదవి యమ్మహాను ♦ భావులకు నగుర్.

క. జననము జరయును మరణం
బును మొదలుగఁ గలుగుదుఃఖ ♦ ములు లోకమునం
గనుఁగొని బుధుండు మోక్షం
బున కుద్యోగించు నియతిఁ ♦ బూతహృదయుఁడై.

తే. వాఙ్మనఃకాయములు శౌచ ♦ వంతములుగఁ
జేసికొని యనహంకార ♦ శీలశాంత

బుద్ధియై నిరపేక్షతఁ ♦ బొంది యఖిల
భూతదయ గల్గి మెలఁగంగ ♦ బోధ మొందు.

క. మనసును వాక్కును గాయం
బు నియంత్రితములుగఁ జేసి ♦ పొందుదురు ధనం
బునకై ప్రముచ్చులు దానిం
గనుఁగొనఁగా వలదె మోక్ష ♦ కాంక్షికి వత్సా.

ఆ. బుద్ధిఁ గొని మనంబు ♦ వో నీక నిలిపి మ
నోభియుక్తి నింద్రి ♦ యముల నాఁగి
విషయసమితి నెడల ♦ విడిచినవానికి
ననిమిషులు ప్రసన్ను ♦ లగుదు రనఘ. 314

క. విను దేవతాప్రసాదం
బున నిర్మలయోగతంత్ర ♦ ములు పనుపడున
య్యనువున నిశ్చలమతి ని
ల్చునది శిథిలితాన్నపాన ♦ సుఖతృష్ణుం డై. 315

క. శాకకణమూలఫలపి
ణ్యాకాదుల భైక్ష మైన ♦ యన్నంబున ని
శ్శోకత నాఁకలి వుచ్చుచు
లోకాలోకంబున నచ ♦ లుఁడు గావలయున్. 316

క. జ్ఞానమ యింధనముగ వి
జ్ఞానాగ్నిం బ్రబలఁ జేయ ♦ జరయు మరణమున్
నానావిధదుఃఖంబులు
లేనియమృత మక్షరంబు ♦ లెస్సై తోఁచున్. 317

క. విను నిద్రాదోషంబునఁ
గనుకలల రజస్తమోని ♦ కారంబులచే
మనసు విరుగఁబడఁగాఁ గఱ
చినవి మఱచి యపుడ దుష్ట ♦ శీలుండ యగుఁ. 318

వ. అది యోగి కొప్పదు గావున. 319

క. వినుతజ్ఞానాభ్యాసం
బున సమధికజాగరత్వ ♦ ము బడసి సకృ
జ్జనితం బగు నిద్రాభర
మునఁబొందునుయోగియదియుఁ ♦ బోద్రోచుఁడుదిన్.

వ. అని వెండియు. 321

భీష్ముఁడు ధర్మజునకుస్వప్నాద్యవస్థల తెఱంగెఱింగించుట.

క. విలయం బింద్రియములకుం
గలుగఁగ విషయానుభవము ♦ గలిగినభంగిన్
మెలఁగును స్వప్నంబున మెయి
గలయట్టుల దేహి భావ ♦ గతి యెయ్యదియో. 322

క. అని యిట్లొలయువితర్కం
బునెడ హృషీకేశుఁ డైన ♦ పురుషోత్తముద
ర్శనమును గ్రమమున నెఱిఁగిన
మునివర్గము శిష్యవర్గకేమున్ బోధించున్. 323

క. శ్రమమున నింద్రియములు లీ
నము లగునపు నిద్ర కల యనసం పత్సంస్కా

రము లింద్రియవిషయప్రా
ప్తి మగుట ముఖ్యమను దేహిదా సాక్షి యగుట.

తే. అనిలముఖ దోషములను సత్త్వాదిగుణవి
కారముల జాగరంబునఁ గలుగునట్టి
తోఁపు జెందఁగఁ గల యయి తోఁచు నది శు
భాశుభములకు సూచకమనియుఁ గలదు. 325

క. స్వాపావస్థం బ్రకృతిక
దీపిత వాసెల్లనపుడుఁ జెలి వెడలక తా
దీపించుఁ బురుషుఁ డిమ్మయి
చూపు బ్రబోధంబు పరమ 1సూక్ష్మత పుత్రా. 326

తే. తెలియ మేల్కనియుండుట గలలునిద్ర
యనునవస్థాత్రయంబును నవ్వులఁ బెట్టఁ
జాలు 2విజ్ఞాననిర్మలసత్యబోధ
రూపనిర్భరానందస్వరూపుఁ డనఘ. 327

తే. వ్యక్తమవ్యక్తమును రెండునవగతములు
గాక మోక్షంబుమార్గంబు గాన రాదు
వ్యక్త మది మృత్యు వవ్యక్తమమృత మనియె
నతుల విజ్ఞాన ఘనుఁడు నారాయణుండు. 328

క. అనఘా విను మవ్యక్తం
బనునది త్రైలోక్యమునకు నాధారము దా
ని నివృత్తిలక్షణం బగు
ననుపమధర్మ మది చాటు నాగమఫణితుల్. 329

1. సూత్రత పుత్రా. 2. విజ్ఞాన నిర్మల.

తే. వినుము బ్రహ్మోదితంబు ప్రవృత్తిధర్మ
మది గతాగతవ్యాప్తులనావహించు
బ్రహ్మమంత్రుఁడు నివృత్తి ధర్మంబు సమ్మ
హాశ్రయము మోక్షదంబనునాగమములు. 330

క. కట్టినచీరయునుం బైఁ
బెట్టినచీరయును వాలిబిగి యారంగాఁ
జుట్టినచీరయుఁ బోలెను
నెట్టన పొదివినది దేహిని గుణత్రయముల్. 331

క. విను సత్త్వరజస్తమముల
పెనఁకువ కవుల వెలుఁగొందు పెంపు గలుగుతు
ర్యనిరంజనతత్త్వము పర
మనఘా యది భావనీయమను వేదంబుల్. 332

క. వాకును మనసును గాయము
నేకాయనవృత్తిశౌచమెడలనితపముం
జేకొనునది యది బోధ
శ్రీకి ఘృతంబునకు వెన్నకిక్రియ జనక మగుల్. 333

తే. బ్రహ్మచర్యమహింసనాఁబరఁగుపరమ
ధర్మములు రెండు సువ్వె యుత్తమతపంబు
దానిఁ గలవాఁడు నిర్మలజ్ఞానయోగ
వంతుఁడై చూడనేర్చు సర్వంబు ననఘ. 334

క. ఆతతసంసారము తృ
ష్ణాతంతుస్యూతిబంధనంబున దృఢమై

చేతస్సంగతిఁ బాయుమి
కా తెలియఁగుతపంబు పుత్రకసూక్ష్మమము సుమీ. 335

క. వికసితతృష్ణాలతికకు
నకుటిల మగుతపము దాత్రమై నటికంగా
వికృతులఁ బ్రకృతిని బురుషుని
నకలంకజ్ఞానదృష్టి నవలోకించున్. 336

క. అని యమ్ముని పలు తెఱఁగులఁ
దను బోధించినఁ గృతార్థతం బొందెఁ దపో
ధనుఁ డాశిష్యుఁడు నీవును
గనికొను మీతద్వచోనికాయార్థంబుల్. 337

తే. అనిన విని ప్రీతుఁ డై పాండవాగ్రజన్ముఁ
డాపగాసూనుతో మిథిలాధినాథుఁ
డైనజనకుండు మోక్షంబునకు నఘుయేమి
కృత్యమునఁ గాంచె నది యెఱింగింపు మనుడు. 338

వ. అతం డతని కి ట్లనియెఁ దత్సంబంధి యైన యితిహాసంబు
చెప్పెద. 339

క. విను మాచార్యులు నూర్వురు
జనకనృపాలునకు వారు సతతంబును న
జ్జనపతి వినిపింతురు త
త్త్వనిరూపకశాస్త్రములు పృథగ్విధములుగన్. 340

క. ఏవాఁ డెమ్మెయిఁ జెప్పిన
నానసుధాధిపుఁడు దానినను మోదించున్

భావము సంతోషకృ
భావిత మగు చుండ గురునృపాల ప్రవరా. 341

వ. అట్టిమొదట దత్త్వజ్ఞానఘనుండును నిర్ద్వంద్వుండును సంశయ రహితుండును నగు పంచశిఖుం డనుమునివరుండు మహిం దిరుగు చుండి మిథిలకుం జనుదెంచె నతండు కపిలాభిధాన యగుగురుకుటుంబినిచన్ను గుడిచి పెరిగినవాఁ డగుటంగా పిలేయుండునను బరఁగు నమ్మహాత్ముండు హేతుమద్వాక్య విశేషంబుల నయ్యాచార్యుల నూర్వుర నయ్యుర్వీపతి సన్ని ధిన నిరుత్తరులం జేసిన నాతం డతని విశేషజ్ఞత యెఱింగి వారల విడిచి తన్నుం బ్రబోధించుటకై ప్రార్థించి యతనికిం బ్రణతుండై నమ్మానసనీయుం డనూనదయాయత్తచిత్తుండు గావున నాభూవల్లభునకు మోక్షోపాధిబోధ ప్రదంబు లగు వాక్యంబు లిట్లని యుపదేశించె. 342

పంచశిఖుం డనువిప్రుండు జనకునకుఁ దత్త్వోపదేశంబు సేయుట.

ఆ. విను మవిద్య కామకమునకుఁ గామము గర్మ
మునకుఁ బుట్టఁ బట్టులనఘ యింత
వట్టుఁ గారణముగ వచ్చుఁ బునర్జన్మ
మండ్రు తత్త్వవేదు లైనమునులు. 343

ఆ. 1బలసి లోభమోహములు దోషసంసేవ
నం బొనర్పఁగా ఘనతత్త్వగాధ

1. ఎలసి.

యోగనపేక్ష్య భోగాసక్తుండై బహుకర్మవి
ధముల కంకురాజికర్తు లొసఁగఁ. 344

క. ప్రియములు నప్రియములును హృ
1దయమును జొక్కనక దివ్యబోధ త్తవనేక
క్రియలకుఁ జొచ్చు నరుఁడు మేన్
2వ్రయు మగు వెఱుఁగఁడు పితరజరావ్యాధులచేన్.

క. ధనములు బంధులు భోగము
లనియెడునస్థిరము లెల్ల నాత్మ కెరవు సే
సిన శాంతి యలవడును మన
మున శాంతిశ్రీసమృద్ధి మోక్షము నిచ్చున్. 346

వ. అనిన విని జనకజవల్లభుం డమ్మునివల్లభునితోడ. 347

క. కేవలవైరాగ్యము మో
క్షావహ మగునేని నట్టులైన విరక్తిన్
భావమున నరుఁడు దాల్చెడిఁ
బో వాఁ డవ్యయపదంబుఁ బొందునె యనుడున్. 348

వ. అవ్విప్రవరుం డతని కిట్లనియె. 349

క. విను నృప హర్షంబు ప్రియం
బనూనసుఖయుక్తి నిర్భరానందము శాం
తినిరూఢి యనఁగ మనమునఁ
బనుగొనునవి సాత్త్వికాఖ్యభావంబు లగున్. 350

1. దయమునఁ...దిప్పఁ. 2. వ్రయు...జరాదివ్యాధులచే...

క. పరితాప మనభితోషము
నరేశ్వరా శోచనము జనవ్యాపారా
దర మక్షమ యనిమొహనివి
యరయంగా రాజసంబు లగుభావంబుల్. 351

క. తలఁపులు గ్రిందుగఁ బొడముట
గల గను లేమఱుట భ్రమము గదురుట జాడ్యం
బలసత యనునీభావం
బులు దామసకోటి యందు బుధులు నరేంద్రా. 352

క. కారణము గలిగియును ని
ష్కారణకలితంబు లయ్యు జనియించు ధరి
త్రీరమణ మూఁడుదెఱఁగులు
నారయ నివి యస్థిరంబు లై తిరుగఁబడున్. 353

చ. జనవర సౌఖ్యముం బొరసి సాత్త్వికభావసముద్గమంబు సు
మ్మనియును దుఃఖముల్ గదిరినప్పుడు రాజసభావభంగి సు
మ్మనియు జడత్వసంగసమయంబునఁ దామసభావవృత్తి సు
మ్మనియును ద్రోచి వానిఁ బడ కాత్మరతిన్ నిలు పిచ్చు
మోక్షమున్. 354

తే. నరుఁడు సుఖదుఃఖముల నెంటఁ బొరయనీక
మలఁచి యాత్మనిఁ జేర్చిన మానసంబు
లీన మగు నంద జలములలోన నిడిన
లవణకణముచందమ్మున నవనినాథ. 357

క. తోలు దిగవిడిచి నాగము
లీలఁ బొలుచుమాడ్కిఁ గర్మలేపముఁ దనతోఁ
గీలుకొన నీక వెలుఁగు ని
రాలంబనబోధఘనుఁడు రాజవరేణ్యా. 358

వ. అని బోధించె నిట్లు పంచశిఖునిచేత బోధితుండైన కావె జన
కుండు దనపురం బైన మిథిల గాలు నప్పుడు దుఃఖంబులం
బొరయమిం జేసి తన కేమియుం గాల దని పలికెం గాంతే
యాగ్రజా యాకర్ణింపుము. 359

క. అమలం బగునీయితిహా
సము భక్తిం బఠించినం బ్రశాంతి యొలసి దుః
ఖములం దొలఁగి మనుష్యుం
డమృతత్వావాప్తిమహితుఁడై వెలుఁగొందున్. 360

వ. అనిన విని ధర్మతనయుండు దేవవ్రతుతో నెట్టివాఁడు సుఖి
యును మంగళవంతుండును నిర్భయుండును నై వర్తించు నని
యడిగిన నప్పు డమ్మేటి కప్పురుషవరుం డిట్లను దమసంప
న్నునకు నీచెప్పినచందంబు గలుగు నాకర్ణింపుము. 361

తే. సర్వవర్ణాశ్రమములకు [1] శమము దమముఁ
గలిగి యునికి విశిష్టప్రకారమగుట

1. సమము దమము.

శాస్త్రమ్ములకు విశేషించి రాజవర్య
జనసమాహితవృత్తి పెద్దయును నలయు. 362

వ. సమంబు సద్గుణంబులరాశి యని యెయ్యవి యంటేని.

సీ. శౌచ మక్రోధంబు సంతోష మార్జవ
మనసూయ విగతదైన్యత్వవృత్తి
యప్రమాదంబు మనోరభిమానరాహిత్య
మతివాదవర్జనమఖిలభూత
దయ గురుపూజ నిందాస్తుతి పరిణతా
త్యాగంబు బ్రహ్మ శుచిత్వంబు సాధు
జనసంగమం బమృషాభాషణంబు ని
స్పృహత యహింస సుశీలభావ

తే. మింద్రియగ్రామజయ మిట్టియుల్ల [illegible]
నాకృతులు వీనిఁ గలపుణ్యుఁ డడభయుఁ డైహి
కములవలనను నాముష్మికములవలన
శాంతిమంగళనిధి బోధసౌమ్యమూర్తి. 364

వ. అనినం బితామహునితోఁ బాండవేయాగ్రజుండు నత్తస్థు
లొక్కొక్కయెడ భోజనంబులు సేయుదురు వారలకు వ్రత
హాని లేకుండునే యని యడిగిన నతనితో నతండు. 365

తే. వినుము విప్రకామార్థభోజనము లోను
గాఁగఁ గలుగు వేదోక్తపరికారభోజ
నములు వ్రతహాని సేయవు నరవరేణ్య
యని నిరూపించి పలికి యిట్లనియె మఱియు. 366

వ. సదోపవాసియు సదాబ్రహ్మచారియు నమాంసభోజియు
విఘసాశనుండును నమృతాశియు నస్వప్నుండును గాన
నయ్యుఁ దత్స్వరూపంబు లెట్టి వంటేని. 367

సీ. క్షుధ వచ్చినఁ గుడుచుచు నెడ నెడ గుడువక
యుండునాతండు సదోపవాసి
ఋతుకాలమున నాత్మసతియందె రతి సల్పు
ధన్యశీలుఁడు సదాబ్రహ్మచారి
దేవపితృతిథిపూజా విధులం దిడి
మఱి నంజుపురుషుఁ డమాంసభోజి
దనయట్లు పంక్తివారును భుజింప భుజించు
నుచితాత్ముఁడు విఘసాశనుండు
తే. [illegible] పదపఁ గుడుచు
నతఁ డమృతాశి దివసంబునందు నిదుర
వో పుణ్యుఁ డస్వప్నుఁ డివ్వాలములగు మ
హావ్రతములు దేహక్లేశబాధకములు. 368

## ఇంద్రప్రహ్లాదసంవాద ప్రకారము.

వ. అనిన విని కౌంతేయాగ్రజుండు శాంతనవునితోడఁ గర్మం
బులు సంస్కారయోగంబున శుభాశుభంబులం బురుషుం
బొందించు వానికిం గర్తయప్పురుషుండ యగుట గాకుండుట
నిశ్చయింప రాకుండు నా కేర్పడం జెప్పవే యనుటయు
నప్పుణ్యుం డక్కురువరేణ్యున కిట్లను నింద్రప్రహ్లాదసంవాద

సమాకర్ణనంబున నది దేటపడు నాకర్ణింపుము సత్త్వస్థుండు
ను సంయమనిరతుండును ననహంకారుండును నమర్షక్రోధ
దూరుండును తుల్యనిందాస్తుతియును సమలోష్టకాంచనుం
డును నారాయణధ్యానపరాయణుండును నగుప్రహ్లాదుం
డొక్కయెడ నొక్కరుండ యాసీనుండై యుండ నిందుం
డతనియంతరంగం బారయ వేడ్క చేరం బోయి. 369

క. సంపద లేమికి మది శో
కింపవు శత్రువులచేతఁ గికిని లోఁగవు టూ
హింపవు నిను నూరకునికి
పెంపని పాటించె దిట్టిబేలవు గదవే. 370

వ. అనిన విని హిరణ్యకశిపునందనుం డప్పురందరున కిట్లనియె.

ఆ. కలిమి లేమి యనఁగఁ గల వొకరొం డవి
యత్నగౌరవము వియత్నతయును
గలుగ వచ్చు ననుట గాదది సూ బేలఁ
దనము వినుము తెలియ ననిమిషేంద్ర.

క. తేరక యుండఁగఁ జేరుం
దేరంగాఁ బోలియు విధియధీనంబులు గా
కారయ విత్తంబులు పురు
షారంభాయత్తములె మహాబుద్ధినిధీ. 373

క. [1]శత్రుజనులు చెఱుచుటయును
మిత్రులు బ్రతికించుటయును మిన్నక యూప

1. శత్రుజనులఁ జెఱు... మిత్రుల.

క్షాత్రతయును సంపదయు వి
ధాతృండు సంధించుం జూవె తజ్జ్ఞతోం బురుషుల్. 374

ఆ. భావములు నిజస్వభావంబునన తోంచు
నడంగు నట్లు గాన యస్థిరతకు
నెలవు లని యెఱుంగ నేర్చిన భావంబు
లందుం దగులు నెట్లు పొంద మనఘ. 375

ఆ. ఏను గర్త ననుట యెఱుంగమి దాం గర్త
యేని నేమిఫలము నెడల కుండ
నఖిలకర్మములు నాచరించుచు నున్న
వాండె కాన కర్త గాండు దాను. 376

వ. అని పలికి వెండియు. 377

క. అనఘా విధివిహితంబుం
దన చేతం గం దలంప ఫలము దగులు నహంకా
రనిరూఢున కనహంకా
రున కది లేమి ఫలయుక్తిక్రియ ద్రోవం జాలున్. 378

క. విను విధికృత్యము లూరక
కనుంగొనుచును సిద్ధ్యసిద్ధి కల్పితసుఖదుః
ఖనిరూఢిం బొంద కుండంగ
మనముం దొలంగించు వెరవు మహనీయ మగున్. 379

క. కావున భూతానిత్యత
భావించుట యెపుడుం గలిగి బంధచ్ఛేద
ప్రావీణ్యము సంపరితో
షావహముగ నున్నవాండ వమరప్రవరా. 380

క. దాంతుఁడుఁ బ్రజ్ఞావంతుఁడు
శాంతుఁడు నగువానిమానసం బాయాస
శ్రాంతము గా దెమ్మెయి ని
శ్చింతుఁడ నై యుండుమును విశేషవిచారా. 381

క. అనవుడు ననిమిషపతి యే
యనువున నీశాంతి నీకు నెనగపడియె మహా
జనపూజ్య చెప్పవే నా
కని యడిగిన నిట్లు లనిమె నతఁ డాతనితోన్. 382

తే. ఆర్జవంబు ప్రసన్నతయాత్మవత్త్వ
మప్రమాదంబు వృద్ధసేవాభినిరతి
మేలు సేయుఁ బ్రజ్ఞాశాంతిశాలియగుట
కాలపాకంబుతోఁ దానకలుగు ననఘ. 383

క. అనిన విని విస్మయము నె
మ్మనమునఁ దళుకొత్తఁగా నమర్త్యపతి యభివం
దన మొనరించి పొగడుచుం
జనియె నిజావాసమునకు జగతీనాథా. 384

వ. అని చెప్పిన విని యప్పాండవాగ్రజుండు భూపాలునకు లక్ష్మీ భ్రంశం బేమిటం గలుగు ననుటయు నయ్యాపగానందనుం డతని కిట్లనియె. 385

తే. వాసవునకును బలికి సంవాద మనఘ
కలిగె నయ్యితిహాసంబు కర్ణ గోచ

రంబు సేయుమా నీవు గరిష్ఠమునకు
నుత్తరం బిడి చెప్పుమ గజిత్తమలర. 386

సీ. ఇంద్రుఁ డబ్జజునకుఁ గేల్మోడ్చి వినతుఁడై
బలి మహాసంపద వెలుఁగుచుండె
నతని నిప్పుడు కానమాత్రఁ జెప్పు మన్న
వాఁడొకో యనుఁడు న♦వ్వారిజాస
నుండు నీవలఁ బొప్పఁ గుఁడుట యెఱిఁగితి
నైనను జెప్పెద నస్మృతవాది
గాకుండుమీ యుష్ట్రిఁ ఖరగోహయంబుల
యందుఁ దా నొక్కటి చెంద మొంగి

తే. యడఁగి యున్నాఁడు వధియించు టనుచితంబు
వాని నని పల్కె నటు సేయ నాఁడఁ గాను
మాట వెట్టుదుఁ గన్నచో♦మానసీయ
వాక్య యని వీడుకొనియె నవ్వాసవుండు. 387

వ. వీడ్కొని చని జగతిం జరియించి యొక్కచోట ఖరరూపం
బున సంప్రీతుం డయి యున్న యబ్బలిం గని బలారాతి యి
ట్లనియె. 388

ఇంద్రబలిచక్రవర్తిసంవాదప్రకారము.

క. ఏనుఁగులు 1సుట్టి రాఁ బే
రేనుఁగుపై మణిమయంపు♦టెల్లులు మెఱయం

1. సుట్టు.

గా నీ వేత్తెంతువు మమ్ముఁ
గానికిఁ గొన నప్పు డిప్పుడు గాడిద వైతే. 389

క. కనకమయాంగరాగ మొప్పఁగ
ననూనవిభవమున నీవు శ్రీమాగం బ్రకటిం
చినయెప్పును నిప్పటి నీ
యునికియునుం జూచి నాకు నుమ్మలమయ్యెన్. 390

ఆ. ఊక దినుచు నిట్టు లుండి నీ తొల్లింటి
లీలఁ దలఁచి యుమ్మలింతొ లేదొ
యున్నరూపు సెప్పు మన్న గార్దభరూప
ధారణైకనిపుణ దానవేంద్ర. 391

సీ. అన విని బలి దేవతాక్షేశుతో నీకు
నావిభవంబు గానంగ రాదు
గుప్తమైయున్న ది గుహయందు నాకిచ్చ
పుట్టిన నప్పుడ పొలిచి తోఁచు
నది యటు లుండెనీ వధికుండ వల్పుల
యెదుర రజ్జులు వల్కు టేఁటి పెంపు
పొమ్ము దుశ్చ్యవన నీ పోయెదు తెరు వన్న
నాతండు నవ్వుచు నతనిఁ జూచి

తే. మున్ను పలికినట్లు[1] కన్నొట లేక ప
ల్కుటయు నతఁడు భూతకోటి మంచు
పోలెఁ దోఁచు విరియు బుద్ధిమంతులు దాని
కిచ్చ వగవ రింత యెఱుఁగ వెట్లు. 392

---

2. మోమోట.

వ. అని వెండియు విరోచనసంభవుండు. 393

క. హాని నర్థంబు ననర్థము
మరణము జీవితము సుఖసమాగమమును మ
స్తరదుఃఖసంగమంబును
నారకొనునే నెపుడు సమతతోడన నిలుతున్. 394

చ. బలమును నొప్పు బుద్ధియును బ్రౌఢతయుం గలవారు లేనివా
రలసక యొక్కభంగిఁ జతిరాకయ చూచి హరించు చుండువి
చ్చలవిడిఁ గాలుఁ డట్లగుట సారమతిం గని యున్నవాఁడ ను
మ్మలికయు నుబ్బు నాదుమదిఁ యెందున నైనను లేదు వాసవా

ఉ. గాడిదరూపు దాల్చి యమరేశల్ డిను చూడఁగ జూచి యు
ల్లసం । బాడెదు శత్రు శాంతిసమయం బగుటన్ విను
మింకఁ గొన్ని నీ । వాడిన నామచిత్తమున నల్క యొకిం
తయుఁ బుట్ట దిట్లు నీ । వాడితె మున్ను ని[1] న్నెఱుఁగ నా
వలదా నను నీ వెఱుఁగఁగన్. 396

క. ఎలమియు వాడుటయును దన
వలచినయట్టివె యెఱుఁగవా విధిచరితం
బులు బలవంతంబు లగుట
వలదె వివేకంబు పెద్దవారికి నింద్రా 397

క. ఇటు గర్వించుట నీచత
యెటువోయెదొ శోమ్ము మాను మిూ వలవని త్రు
ళ్లుట వజ్రము నీవును బిడి
కిటితాఁకున నొఱగు దేను గినిసితి నేనిన్. 398

---

1. న్నెఱుఁగఁగా వలదో నను నీ వెఱుంగగనో,

క. ఇది మేలపుమాట సుమీ
మది నుద్ధతి లేదు నాకు నమహితాశ్చర్యా
స్పద మగువిధాతృచెయ్దిం
నుది నీవును దుస్సహోదగ్రతుల్లు టుడుగుమీ. 399

వ. శాంతుండ వగు మని పలికె నట్టియెడ నవ్విరోచననందను శరీరంబుననుండి సురూపయు [1]సుగౌరయు నగు నొక్క మగువ నిర్గమించినం గని కౌశికుండు విస్మయ వికసితాక్షుం డగుచు నతనితో నివ్వనిత యెవ్వత యనిన నాతండే నెఱుంగ నీవ యీయమ నడుగు మనుటయు నయ్యనిమిష పతి యమ్ముద్దియ మొగంబు గనుంగొని మాకు ని న్నెఱిం గింపు మనవుడు న ద్దేవి యతనితోడ. 400

క. శ్రీయును భూతియు లక్ష్మియు
నాయభిధానములు మీరు నన్నెఱుఁగమి పె
ద్దే యింద్ర యెజ్జగంబుల
నేయుగములయందు నెఱుఁగ రెవ్వరు ననినన్.

క. అనవుడు నతండు నీ వీ
దనుజేశ్వరుఁ బాయుటకుఁ గతం బేమియొకో
యనిన విని లక్ష్మి సత్యం
బును ధర్మము దమము దానమును నాయిక్కల్.

క. అవి గలిగి పరాక్రమయుతుఁ
డవు పురుషునిపాల నిలుతు నమరాధిప యీ

1. 'సగౌరయు'

దివిజారి దొల్లి యట్టిఁడ
యవినీతత నిపుడు బ్రాహ్మణాసూయమెయిన్. 403

క. తొల్లి టిసచ్చారిత్రము
తెల్లను దిగ విడిచెఁ గాన | యీతనికడ నే
నొల్ల నిలువ వచ్చెద సుర
వల్లభ నీపాల నెలమి | వసియింపంగన్. 404

ఆ. ఆగుణములు మఱియు | నాగమోదితసమా
చారములును గలిమిఁ | గోరి యింద్ర
నిన్నుఁ బొంది యేను | నిల్చెద నేమిట
నేమఱంగ వలవ | దెపుడు నీవు. 405

వ. అని పలికె నిట్లు లక్ష్మిచేతం బరిత్యక్తుం డైన బలి యాఖం
డలు నాలోకించి. 406

క. అయనవశంబునఁ దేజో
వియుక్తుఁ డై రవి ప్రతాప | విరహితుఁ డగునా
క్రియఁ బొనుఁగుపడినఁ బొంగకు
జయింతు నిను దేవదనుజ | సంగర మగుడున్. 407

వ. అనుటయు మహేంద్రుం డను. 408

క. అది యట్టు లుండె నీతోఁ
బదరం బని లేదు నాకుఁ | బద్మభవునిమా
ట దలంప వలయు నీపై
భిదురం బిడ దనుజనాథ | ప్రియ మందు మెదన్.

క. అనిన విని యొండు పలుకక
దనుజాధీశ్వరుఁడు వోయె | దక్షిణదిశకుం

జనితయె నుదఙ్ముఖుఁడై దివి
కనిమిషనాథుండుఁ గౌరవాన్వయముఖ్యా. 410

వ. అని చెప్పి యనిమిషనదీనందనుండు వెండియుఁ బాండవా
గ్రజున కిట్లను నింద్రనముచిసంవాదం బను నితిహాసంబు
హృదయ ప్రసాదకరంబు దాని నాకర్ణింపుము. 411

## ఇంద్రనముచి సంవాద ప్రకారము.

సీ. సిరిఁ బాసియును నొక్క చింతయు లేక వీ
చుల క్రందడంగిన జలధివోలె
నముచి యేకాంతస్థలమున నుండఁగ నింద్రుఁ
డచటికి నేతెంచి యతనిఁజూచి
పేఁగవడ్డాఁడవు ప్రియజనంబును బరి
వారంబు లే దియ్యవస్థ కెంత
వగచెదవో దానవశ్రేష్ఠ నావుడు
నాతండు వగపు నిరర్థకంబు

తే. వలయువస్తువు వగచిన వచ్చునయ్య
రామి[1]యొక్కటియే శరీరంబు నెదయుఁ
దాపమునఁ [2]బొందు వగపున ధర్మ మేదు
నింతయెఱుఁగుదు వగవ నేనేమిటికిని.

తే. సకలభూతంబులకును శాసకుఁడు గలఁడు
గాదె యొక్కరుఁ డాతని కల్పనమునఁ

1. యొకటియె తన శరీరంబు. 2. గుందు.

ప్రాప్తమైనది నీళ్ళులు పల్లమునకు
వచ్చుక్రియఁ దాన వచ్చు గీర్వాణముఖ్య.

క. ఇది నా కయ్యెం గాఁగల
యది యై యనుగాఢనిశ్చ యం బెవ్వనిన
మ్మదిఁ గలుగు నుబ్బు వగ సం
పద యాపద గలుగ వట్టి భవ్యున కింద్రా. 414

క. ధైర్యంబున వీర్యంబున
శౌర్యంబునఁ బ్రజ్ఞఁ బడయఁ ♦ జాలునె నరుఁ డె
క్కార్యము నప్రాప్య మయిన
నార్యుం డది యెఱుఁగు గాన యడలఁడు శక్రా.

తే. మేలుఁగీడును నరుఁబొందుఁ గాలముల న
వశ్యమును వానిఁ గోరిన వచ్చుటయును
వినుము ద్రోచినఁ బోవుట యును సురేంద్ర
కలదె వానికిఁ గావున వలదు చింత. 416

క. అని యిట్లు నముచి పలికిన
విని మెచ్చుచు దివికి నమర విభుఁ డరిగెం బా
వనచరిత యింక నెయ్యది
వినవల తనవుడును భరిత వినయుం డగుచున్. 417

క. ఆనరపతి శాంతనవుని
తో ని ట్లను నెద్దియేని దుర్దశ యైనన్
మానవుఁ డెట్టిఁ డగుట మే
లానతి యీవే దయామ యా తేటపడన్. 418

వ. అని యడిగిన నయ్యుధిష్ఠిరునకు బుధశ్రేష్ఠుం డి ట్లనియె.

క. ఏవిధమున దుర్దశలకు
భూవర ధైర్యంబ మందు ♦ భూరిధృతిమెయిం
జేవ గలుగు దృఢనిశ్చయ
భావమ్ము నెవ్వగలఁ ద్రొక్కు ♦ వడిఁ దెబ్బఁగిన్. 420

క. ధృతి యారోగ్యము నొసఁగును
ధృతి యుజ్జ్వలలక్ష్మిఁ బెంచు ♦ ధృతి కీర్తి సము
న్నతిఁ జేయుఁ గాలగత్యవ
గతి గలిగినఁ గలుగు ధృతి వి ♦ కారవిదూరా. 421

### ఇంద్రబలిసంవాదప్రకారము.

వ. ఏతద్విషయం బైనయది యొక్కటి యింద్రబలిసంవాదం
బనునితిహాసంబు గల దాకర్ణింపుము దేవాసురులకు సమ
రంబు సెల్లిన నందు విష్ణునిమహానుభావంబున దేవతలకు
గెలు పైన రుద్రాదిత్యమరుద్వసుగంధర్వసిద్ధాదులు పరివేష్టింప
నింద్రుం డైరావతారూఢుం డై లీలం ద్రైలోక్యంబును
జరించుచుండి యొకప్పుడు సముద్రప్రాంతంబున నొక్క
గిరిగహ్వరంబునయంగణంబున వైరోచనుం డగుబలిం గని
చేరం జని యద్దనుజపతి దన్నుం జూచి నిస్సంభ్రముండును
వైమనస్యరహితుండును నై యునికి నిరూపించి యతనితో
ని ట్లనియె. 422

క. హీనస్థానమున విభవ
హీనత ని ట్లుండి రిపుల ♦ మెలమిఁ గనియు నీ

మానసమున శోకింపమి
దానవకులనాథ మెచ్చి ♦ ధంబునఁ గలిగెన్. 423

ఆ. శౌర్యముననొ వృద్ధ ♦ సంసేవవలననొ
తపముననొ యుదాత్త ♦ తానిరూఢి
గలిగి మమ్ము నరకు ♦ గాఁ గొన కున్నాఁడ,
వేమికతము దీని ♦ నెఱుఁగఁ జెపుమ. 424

వ. అనిన విని బలి యతని కిట్లనియె. 425

ఆ. నరకుసేయ వను చ ♦ నద్దమాటలు గొన్ని
యాడినంత నేమి ♦ యయ్యె నింద్ర
నిమశక్తి వింత యే దైవవశమున
నెట్టిపాటివారు ♦ నెట్లుఁ గారె. 426

క. నీవు మును హీనుఁ డగుటయు
నావలనం గాదు నీకు ♦ నను హీనదశా
భావితునిఁ జేయ రా దివి
దైవకృతము లట్లు గాన ♦ ధైర్యము వలయున్. 427

క. విను పర్యాయంబున సుఖ
మును దుఃఖముఁ జెందు జనులఁ ♦ బురుషుఁడు ధైర్యం
బున గర్వంబు విషాదం
బు నడంగింపఁ దగు నంద్రు ♦ బుధు లది వినమే. 428

క. చెలుతుం జుట్టలును సహా
యులు విభవము పెం పకాల ♦ యుక్తి నవస్థం

దొలఁగించుట గలదె మదిం
దెలిసి 1 మనుము మనికి యిట్టి ♦ దియ కా చెప్పుమా.

క. నిను నే గెలుచుట కాలము
నన నీకును గాలయుక్తి ♦ నను గెలిచితి గా
వున నశుభమునకు శుభమున
కును గాలము సూవె కర్త ♦ కుశికతనూజా 430

ఆ. నాకు నీకు నేల ♦ నాకేశ శత్రుత్వ
మేరి కైనఁ గలదె ♦ యెందుఁ బాక
మునకుఁ దెచ్చుచుండు ♦ జనులఁ గాలము వృక్ష
ఫలవిధముగ రజ్జు పలుకు లుడుగు. 431

వ. అని చెప్పి యంత నిలువక. 432

క. కాదిది విక్రమకాలము
లే దిప్పుడు నాకు నలుక ♦ లీలాత్మక రో
షాదరముఁ గలిగినను నిను
నీ దగుపరిజనముఁ గూల్పఁ ♦ నే పెడసేతన్. 433

వ. అని పలికి వెండియు. 434

క. సిరి పెంపున గడు నొప్పెదు
సురనాయక యిపుడు మీఁదఁ ♦ జూచెదు నీకుం
బరిభవము దెచ్చుటకునై
కరము వెసన్ వచ్చుఁ జేటు ♦ కాలము తెలియఁగన్. 435

తే. ఇంద్రు లెందఱు పోయి రింద్రు ♦ లేల బ్రహ్మ
లుండుదురె తఱితోఁ దెగు ♦ చున్న వారు

1 మనువుమనికి యిట్టి ♦ దియ

గాక దానవసంఘంబు ॥ కాలవశతఁ
బొందు టేటికి నెగ్గింపఁ ॥ బొమ్ము శిబి. 436

క. క్రతువులు సేఁతయు దేవ
వ్రతములు సల్పుటయు వృత్త ॥ వంతుఁ డగుటయుం
గతమే కాలము ద్రోచుట
కతర్క్యవర్తనము గాల ॥ మది గానను సుమీ. 437

క. అని యి ట్లాడినమాటలు
విని దనుజునిఁ జూచి యమర ॥ విభుఁ డుల్లములో
నన సంరంభంబు నుడిపి
కొనుచు నతని కిట్లు లనియెఁ ॥ గురువంశవరా. 438

క. అకట భవచ్చిత్తము ని
ర్వికార మై భరితధృతివి ॥ వేకవినయశాం
తిక మగుచు వెలింగెడు దీ
నికిఁ గారణ మైననిష్ఠ ॥ నెఱి వొట్టిదియో. 439

క. అనిన నతఁ డతని కి ట్లను
విను మనిమిషనాథ యేను ॥ వేఱొకచోటం
గొని వచ్చితినే చిత్తం
బున కవికృతికృతివివేక ॥ ముఖ్యగుణంబుల్. 440

వ. కాల ప్రకారం బెఱుంగుదుం గావునఁ గలంగ కుండుదు.

తే. చెప్పుచున్నాఁడఁ గాలంబు ॥ చేత నెల్ల
విధము లొప్పును జనులకు ॥ వినుము కాల
హేతుప్రమాదవర్తన మతి ॥ కప్రమాద
సంగ మంత్రులకు వా రెట్లు ॥ భంగపడరు. 442

క. కళలుం గాష్ఠలు లోనుగఁ
గలచిదురలఁ గూర్చుకొనుచుఁ గాలంబు జనం
బుల వృద్ధి కిచ్చునాతని
నల నలవడఁ బొడిచి తనకు వశ్యులఁ జేయున్.

క. కాల మడఁగించు జనుఁ గ
ల్లోలిని గిరిఁ ద్రొంచుకరణి లోభక్రోధా
శీలత్వకామభయములఁ
దేలుజనుఁడు గాలవృత్తిఁ దెలియఁగ నేర్చునె. 444

క. ఇంతకు మును సూచితి నతఁ
డెంతయు నొప్పు గాని యుంకి నిది గనుఁ జిత్తం
బెంతవెసఁ జచ్చు ననుఁ దనుఁ
జింతింపఁడు జనుఁడు మోక్షచిత్తత్వమునన్. 445

క. విను భావాభావంబులు
గని యత్యుత్తమతపంబు గైకొనువిద్వ
జ్జనుఁడు గనుఁ గాలగతి యె
ల్లను గరతలశోభితామలకముం బోలెన్. 446

క. కాలగతి గనుట శాంతికి
మూలం బై యంతరంగమున నాత్మమయా
త్మాలంబనంబు నిచ్చుఁ ద
దాలీనుం డైన పురుషుఁ డక్షోభ్యుఁ డగున్. 447

వ. అనిన విని పాకశాసనుం డతని వివేకపాకంబున కచ్చెరు
వొంది యభినందించి యతని కిట్లనియె. 448

ఆ. దనుజనాథ యిట్టి దంభమునఁ గాలచా
రిత్ర చేసి నైన విచిత్రశీల
యుతుఁడ వైతి నీవు కృతకృత్యుఁడవు నీదు
వృత్తి గోరవలయు నుత్తములకు. 449

తే. లోక మెల్లను గరచేతి లోన నున్న
యట్లు గనికొని సత్త్వాదు లైన మూఁడు
గుణములను బాయఁ బెట్టి ని ర్గుణత వెలుఁగు
నాత్మఁ గనుచున్నవాఁడ వే మందు నిన్ను. 450

క. కెలనికిఁ జూడఁగ వైన్యా
కలనం బగుచున్న యిపుడు గదిసినదశయుం
దొలఁగుం గావునఁ గడునే
తెలిసి పరమసుఖముఁ బొందు మిచ్ఛావృత్తిన్.

క. అని పలికి యుచితము గ ప్పి
నొక్కని విభవం బెసఁగ నభ్ర కుంజరముపయిన్
వినువీథిఁ జనియె సురలును
మునులును వేష్టింప భూత ములు వినుతింపన్. 451

తే. అమృతపానంబుఁ జేసిన యాతకంటె
నద్దనుజపతిమథనునా క్యామృతమున
సంభృతానందుఁ డై సురే శ్వరుఁడు దనదు
పురమునకు నేఁగి సుఖ ముండెఁ గురువరేణ్య. 453

వ. అని యిట్లు ధర్మతనయునకు భీష్ముఁడు పునర్వ్యాఖ్యాతం బైన

యింద్రబలి సంవాదంబు సెప్పె నని చెప్పిన విని మఱియేమి
సత్కథలు సెల్లెఁ జెప్పు మని యడుగుటయు. 454

చ. పరమమునీంద్రసంయమన ♦ పక్వవివేకవిభూతిరమ్య వి
స్తరమహనీయతార్కికవ ♦ చఃకలనానభిగమ్య దేవతా
సురపరిరక్షణోన్మథన ♦ శోభికటాక్షవిహార నిత్యసుం
దరశుభకాంతిపూర దురి ♦ త ప్రవిదారణ పీతకారణా.

క. ఆదిత్యమరుద్వసురు
ద్రాదిసకలదేవతామ ♦ యాత్మక శ్రుతిసం
పాదనవిధావిచక్షణ
పాదసరోజా మహర్ధి ♦ భక్తసమాజా. 456

మాలిని. అమలహృదయవేద్యా ♦ హవ్యకవ్యప్రసాద్యా
శమసుఖమయమూర్తీ ♦ సర్వలోకప్రవర్తీ
కమలభవనిషేవ్యా ♦ కామదూరానుభావ్యా
యమనియమవికాసీ ♦ వ్యాసచేతోనివాసీ. 457

గ ద్య ము.

ఇది శ్రీమదుభయకవిమిత్త్ర కొమ్మనామాత్య
పుత్త్ర బుధారాధనవిరాజి తిక్కనసోమ
యాజిప్రణీతం బైన శ్రీమహా
భారతంబున శాంతిపర్వం
బునందుఁ జతుర్థా
శ్వాసము.

శ్రీరామ

# శ్రీమదాంధ్రమహాభారతము.

## శాంతిపర్వము తృతీయాశ్వాసము.

## లఘువివరణము.

### విషయసంగ్రహము.

ధర్మజుని మనోవ్యాకులత బాపుటకై భీష్మాచార్యులచే బోధింప మొదలిడిన ధర్మములు ద్వితీయాశ్వాసమున నారంభింపఁబడి కొంతవఱకు జెప్పఁబడినవి.

ఇందు రణోపాయములు, పగఱయెడనుండవలసినవిధము, నిజపరివారదోషమున సంపద సెడిన నేమిసేయవలెను? శత్రుఁడధికుఁడైన హీనబలుఁ డెట్లాపద దాఁటవలయును? కులజనులగు పరిజనులు దొరకొనకున్న కర్తవ్యమేమి? పెక్కండ్ర పగకగ్గమైన హీనబలుఁడగువాఁ డేయుపాయమునఁ దప్పించుకొనువాఁడు? నమ్మకయుండుట నమ్మియుండుట యనువానిలో రాజునకు పరమకర్తవ్యమెద్ది? మొదలగు రాజధర్మములు ప్రధానముగా నిరూపింపఁబడినవి.

ఈధర్మముల నితిహాసముల నుదహరించుచు వృద్ధసమ్మతిని జూపుచు బహుప్రకారముల జెప్పుచున్నంత నచ్చెరుపడి యుధిష్ఠిరుఁడు ధర్మసూక్ష్మమును విశిష్టధర్మమును జెప్పవేయని యడిగెను. అంత శరణాగతరక్షణము, ఆప్తరక్షణము, మత్సరగ్రస్తుఁడయిన నపాస్తవిశ్వాసుఁ డగుననువిష

దయము, తపము, దమము; సత్యము, మొదలగు ననేకధర్మములు బోధింపఁబడినవి. ప్రసంగవశమున నాపద్ధర్మములును ప్రతిపాదింపఁబడినవి.

ఒక్కొకచో సామాన్యముగాఁ జెప్పఁబడినవిషయము ప్రసంగాంతరమున సోదాహరణముగా విస్తరింపఁ బడినది.

పెక్కండ్రు పగఱైన హీనబలుండైన నరపతి యెప్పుడసున నాపద నిస్తరించువాఁడను ప్రశ్నమున కుత్తరమైన మూషికమార్జాల సంవాదమున పలితుని (మూషికము) సంభాషణవలన నమ్మఁదగినవారైన దద్వయము నమ్మకమునకు మేలగు విషయము స్పష్టపఱుపఁ బడినది. ఈప్రసంగమున విద్వాని కితనాని యొక్కటి చెప్పఁబడియె. పైవిషయము ద్వితీయాశ్వాసమున సామాన్యముగా చెప్పఁబడినదియే. ఇచ్చట తెల్లము గావింపఁబడినది. ఇట్లు బహుభంగుల ధర్మములు వివరింపఁబడినవి.

యుద్ధరంగమున బంధు, గురు, పుత్త్రుల హింసకు కారణభూతుఁడ నయితినని ధర్మనందనుఁడు నిర్వేదమునందున్నవాఁడు. అట్టివాని నిర్వేదము తొలఁగఁ ద్రోయుటకు వారలజంపుట న్యాయబద్ధమను విషయము తెలుపుటకో యన శీలస్వరూపము బోధింపుమని యడిగిన పాండవాగ్రజునకు దుర్యోధన ధృతరాష్ట్ర సంవాదము యుద్ధపూర్వభావియగు దాని నుదాహరణముగా జెప్పి వాని దుశ్శీల మాతని చెఱచెనను నది వ్యంగ్యముగా దెలియపఱుపఁ బడినది. ఈ తెఱఁగున సమయము ననుసరించి నవక్కొలి చమత్కృతులును గలవు.

కృపాణరణనిపుణుఁడగు నకులుఁడు ఖడ్గప్రభావము నద్దాని యుత్పత్తి ప్రచారములను దెలుపుమని కోరిన నాయాచార్యుఁడు వానిఁ బ్రతిపాదించిన విషయము మొదలగునవి యనేకములీ యాశ్వాసమునఁ జక్కగా చేర్పఁబడి యున్నవి.

3 శీతు = చలి, ఘాసి = గడ్డి, సిడములు = ధ్వజములు, కంకటము= కవచము, విడిదల = విడిసినచోటు, సమతలము = చదరము.

4 చరుఁడు = చారుఁడు, (చరులు)

6 కాల్బలము నేల = నేలమీఁదనిలచి పోరునట్టి బలమున కనుకూల మగు స్థానము. వ్యాఘ్రాదులచే నాక్రమింపఁబడక సమమగు నేల వీరుల కాయోధనోపయోగియని భా.

కరు (ఏనుఁగు)లు పోట్లట కచ్చటచ్చట చెల్లు మడుగులు వలయును.

తనకు గల మొన (సైన్యము) ననుసరించి యుద్ధరంగము నేర్ప ఱచుకొని సమశీతోష్ణమగు కాలమున రణమొనరించిన జయము సిద్ధము.

7 ఘోటకము = గుఱ్ఱము, అనీకము = సేన.

8 తాఁకుదలలన్ =యుద్ధప్రారంభములందు, బొబ్బలార్పులుఎసఁగన్ = సింహనాదములు మొదలగు నుత్సాహధ్వనులువిస్తారముకాఁగా.

11 సంబలశము = ఆయుధవిశేషము, కైదువు = ఆయుధము, ఏనిక కయ్యము=ఏనుఁగులమీఁదనుండిచేయు యుద్ధము, అడిదము=కత్తి.

12 ఉత్సాహ అనూనము = మిక్కుటమగు నుత్సాహము గలది.

16 పెనువెఱ = గొప్ప భయము, ఉక్కఱి - బలహీనమై, బహుళ సైన్యము, అతిముతిపఱచినన్ = కలఁతనొంది చెదరినయెడ.

17 కడిమి = పౌరుషము, మొన = సైన్యము.

20 అరి = శత్రువు. వెడన్ = నీచముగా, ఉల్లిపట్టులను = మర్మభేద కములగుమాటలచేతను, పూఁపు = పూనిక.

23 అదృష్టములేనిసమయమున విరోధి పాదములపైనం బడి వానికి లోఁబడియుండి తను శక్తుఁడు కాఁగా శత్రుని తుదముట్టించుట తగునని భా. కాలునిపురి = యమునిపట్టణము.

24 చెడిదపుఁదనము = కాఠిన్యము, మార్తురు = శత్రువులు.

ఏఱుమొక్కలఁగొని క్రమముగా నాక్రమించినటుల శత్రువు నెల్లగాఁ బెగటార్చి తాను వృద్ధిఁబొందవలెనని భా

25 పెక్కుం బ్రతోవకా, ఈరసము = ద్వేషము.

25 కార్యములు ప్రతికూలముగా గాన్పించుచు అంతమున సఫలము లగును. అనుకూలములుగాఁ దోఁచియు ప్రతికూలములగును. దాన సామాన్యుఁడు సుఖదుఃఖముల నొందును. విద్వాంసుఁ డెందెడిటియుఁను దగుల్పాటునక నిర్వికారుఁడై యుండును.

29 పగపు = దుఃఖము, మగిడెంచునొకో = మరల్పగలుగునా?

32 మనుజుఁడు కోరకయే శ్రీతొలఁగిన విధమున దైవము కరుణించిన శ్రీరాకయు తాను కోరకయే కలుగునని భా,

34 ధీరుండు-చిత్తము కలఁకనొందుటకుంగల కారణములున్నను యెట్టి చిత్తవికారము నొందనివాఁడు.

"వికారహేతౌ సతి విక్రియన్తే యేషాం న చేతాంసి త ఏవ ధీరాః" అని మహాకవి కాళిదాసు.

35 ఇది యుపశమనప్రకారంబు. శాంతుఁడై యొండేని నణఁగియుండ గోరువాని విషయమీ పైనఁ జెప్పఁబడినది.

ఇతరయెత్తంగించెద నాకర్ణింపుము—ఎవ్విధముననేని సంపదను సాధింపవలయునను పట్టుదల గలవాఁ డాచరింపదగు విధానము నుపదేశించుచున్నాఁడు.

37 చెరవుకలిమి = నేర్పుతో, నెయ్యంబుపాటించి = స్నేహము కల్పించి,

43 తల్లిదండ్రి గురువు, తనచే నధ్యేయమగు ఋగ్యస్సామములను వేదత్రయము, ఉపాస్యమగు గార్హపత్య ఆహవనీయ దక్షి

98 ఓట = భయము, పూర్వావాసానుచయము = తొల్లింటి ధర్మముఁబట్టి నుచితమగు బుద్ధిగలదై.

98-99 అగ్గలపు విభూతి = విశేషసంపద.

యుక్తాయుక్తముల నెఱుఁగక జాత్యుచితకులసంజాతుఁడనిమాత్రము యున్నతపదములనుంచక ఉత్తమ మధ్యమాధముల నెఱింగి వారి వారికిం దగిన స్థానముల నియమింపవలయును. శౌర్యము, సత్యము, సదసత్కార్యవివేకజ్ఞానము, మొదలగు గుణసంపద గలిగినచోఁ గులము విచారింప బనిలేదు. వాఁడున్నతస్థానమున నిలచి పరిపాలింప నర్హుఁడని భావము.

ఈ చెప్పిన విషయము "తగు పదంబులకుఁ గులవంతులగు పరిజనులు దొరకొనకున్న నరనాథుం డేమిసేయంగలవాఁడు" అని యడిగిన ధర్మజుని ప్రశ్నమునకుఁ బ్రత్యుత్తరమగుటఁజేసి ఇది యాపద్ధర్మమని యెఱుఁగదగును.

గుణవంతుఁడగు ఉన్నతవంశజుని గౌరవస్థానముల నిలుపుట ముఖ్యధర్మము. ఈ విషయము వెనువెంట సోదాహరణముగ నిరూపింపఁబడుచున్నది. పై ప్రశ్నమునకు సమాధానముగ భీష్మునిచే నుదహరింపఁబడిన కుక్కకథేతిహాసముగూడ నీవిషయమును ధృవపఱచుచున్నది.

103 వలను = ఉపాయము, అగ్గలిక = ప్రానిక, ఇలువడికగ్గనేని = కుటుంబభక్తిమముగానున్నరౌడల.

105 మయూరరాజ్యములకు సామ్యనిరూపణముఁజేసి "మయూరంబు

విధమున నెగడుటసితి" యని బోధింపఁబడినది. రాజునకు మయూరమునకు పోలిక ఏవిధమున నెఱుఁగునది.

చిత్రవర్ణములచే నెమలి మనోహరమైనటుల ప్రజను బహుభంగుల నాత్మ వశముజేసికొనవలయును. శ్రవణానందమగు నెమలి కూఁతవలె ప్రియమైన మృదువాక్యముల బలుకుచుండవలెను. అందు సందర్భవశమున శాఠ్యకౌర్యముల బయల్పరుపక ఆవిషయమున శరత్కాలమునందలి మయూరము ననుకరింపవలెను. శరదృతువునందు మయూరధ్వని యస్ఫుటము అమధురమును నయియుండును. వర్షర్తువున మయూరముయొక్కయు శరత్కాలమునందు హంసయొక్కయు ధ్వని యింపగునను కవుల సంప్రదాయ సరణి జూడుఁడు.

"వారి మయూరవిభ్రమములం చలజెందె........శరత్సమాగమం బారయ నంబుదాగమ మహామహిమోన్నతి నాక్రమించి నన్" అని. మఱొండు మహాకవిప్రయోగము. నలుఁడు దేవదూతయై దమయంతికడకేగ నాయమ నీ గోత్రనామముల జెప్పుమనఁ జేయునదిలేక యాత్మనామము జెప్పుట శాస్త్రదూరమని చెప్పి తప్పుకొననెంచిన నైషధుని వాక్యమునకు శ్రీనాథుని యుపమానము.

సీ. అని శారదంబైన వనమయూరమువోలె
నహితాపకారకుం డతఁడు పలుకు
రాజహంసియుబోలె రమణీలలామంబు
పదములం దనురాగ ముదయమంద" యని

శృం. నైష. 4 ఆ.

నెమలి పక్షరత్నమున విజృంభించి శరత్కాలమున నణఁగిన తెఱంగున బ్రజలఁ దనపక్షమున ననురాగయుక్తులఁ జేయు మృదువాక్యములను బలుకుచు రాజ్యమంత్రముల విషయమున రాజా మాశీభావము నొందవలెనని తాత్పర్యము.

నెమలి తలపై జుట్టువలె ఛత్రమును శిరస్సున ధరియింపవలెను (అనగా ప్రాధాన్యము నొందింపవలెననుట) రాజ్యతంత్రమున నెద్ది యాచరించిన నది ఛత్రచ్ఛాయపై వెలుగొందవలయునని భా.

స్వపక్ష బలముగలవాఁడై (ఱెక్కలకాంతి ప్రకాశింప సమోదముగా నడచు నెమలివలె) యుద్ధమునకు బోవుచుండవలెను.

పక్షము = ఱెక్క, తనవైపు.

ఆశ్రితులఁ బ్రోచుటఁ దగిన సమయమున విజృంభించి (కాలము నెఱింగి విజృంభించు నెమలివలె) నీచ కపటవర్తనుల మనుమాడుచు (వక్రగమనము నిడిచి యొందముగా నడచు నెమలివలె) ప్రసిద్ధిగనుట రాజునకు దగును.

105 సూర్యుఁడు తన కిరణముల వ్యాపించి కర్మసాక్షియని నెగడినట్లు ధరణీశుఁడు తన పరిజనుల సర్వదేశమున వ్యాపింపఁ జేసి లోకవృత్తము నెఱుఁగుచుండవలయునని భా.

109 దండము మనుష్యాకృతిగా జెప్పఁబడి యందు విశేషాకారము వర్ణింపఁబడుచున్నది.

అసితోత్పలచ్ఛాయమై = నల్లకలువవంటి దేహకాంతితో, దంష్ట్రికాచతుష్టయము = నాలుగుకోరలు, జిహ్వాకా = నాలుక, శరాసనము = విల్లు, ముసలము = రోఁకలి, పాశము = ఉఁచె

తోమరము=చిల్లకోల. పరశు=గండ్రగొడ్డలి, ముఖ= మొదలగు ఏపు అణచుచు= గర్వమునణంచుచు.

111 సమ్యక్ప్రకారంబు అసమ్యక్ప్రకారంబునను స్థితి ధర్మాధర్మంబుల నుచోఁ గ్రమముగా నన్వయించుకొనవలెను.

112 శాస్త్రసమ్మతమగు ధర్మము నెల్లప్పుడు ననుష్ఠింప వలయు. దానఁ బ్రీతుండై యింద్రుఁడన్నము నొసఁగు "పర్జన్యాదన్నసంభవః" శాస్త్రము యని.

118 తదీయ అభిధానంబులు=ఆగ్రంథమునకుం గల పేరులు.

119 'పదునెనిమిదివిద్యల భవుఁడేర్పరించె జగత్త్రయహితము పొంటెఁ' ఈ పదునెనిమిది విద్యల విభాగమును, అవి ముల్లోకములకు హిత మునాచరించు విధము ఈక్రింద తెలియఁబడుచున్నది— ఋగ్వేదాది .........నాలుగు — ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అధర్వణవేదము, నని. యాగములచే దేవతలఁ దృప్తులఁజేసి వారివలన సస్యాది సంపదలను బడయవలయును. అట్టియాగ ప్రవర్తకమగు ఋత్విగ్గణము త్రివిధము.

అధ్వర్యుగణము, హోతృగణము, ఉద్గాతృగణము, నని. ఇందాధ్వరగణము పూర్వాంగ ఉత్తరాంగ రూపమగు యాగమున తత్సంస్కారములు మొదలగు క్రియల నిర్వర్తించునది. వారలకు వినియోజకమగు మంత్రము యజుస్సు. యజ్ఞాంగములగు దేవతల స్తోత్రములచే నాహ్వానించు నది హోతృగణము. ఈగణమునకు స్తోత్రోపయోగములగు సూక్తములుగలది ఋగ్వేదము. ఆదేవతల సామగానములచే సంతుష్టులజేయు కార్యము ఉద్గాతృగణము వారలది. వారలకు గావాల్సిన సామవేదము. మొట్టమొదటి, మూఁడు వేదములు సహాభావమున కర్మోపయోగులై త్రయీయనఁ

ప్రసిద్ధపడెసినవి. ఇంక నథర్వణవేదమున నాభిచారిక కర్మయు శస్త్రాది సాధనమగు మంత్రశాస్త్రము ప్రతిపాదింపఁబడి యారోగ్యోపకారులైనవి.

కల్పాదులైన యంగంబులారు — శిక్ష, వ్యాకరణము, ఛందస్సు, నిరుక్తము, జ్యోతిషము, కల్పము, నవి.

ఇవి వేదమున కంగములని చెప్పఁబడుటచే నవియనికి యవయవము లనఁ జెలఁగి యంగములు వేదమున కుపకారకములని తెలియఁబడుచున్నవి.

వర్ణోత్పత్తిని వర్ణోచ్చారణనియమములను బోధించునదియై శిక్ష, ప్రకృతిప్రత్యయాదులైన పదముల నియమపూర్వకముగ దెలుపునదియై వ్యాకరణము, పదసమూహరూపమగు వాక్యాత్మకమై పాద నియమములఁ బ్రతిపాదించునదియై ఛందస్సు, ను వేదశబ్దాంగములై తెలియుచున్నవి.

నిష్పత్తిపూర్వకమైన పదార్థప్రకాశకమై నిరుక్తము, వేదవిహితక్రియాజాతము నాచరించుటకు యోగ్యమగు కాలనిరూపణాదులచే జ్యోతిషము వేదార్థవిశేష ప్రకాశకమై కర్మాచరణ విధానమును బోధించు కల్పమును వేదార్థాంగములై తనరారుచున్నవి. ఇవి వేద వేదాంగములు పది.

" పురాణంబులనియును లోకవిద్య ధర్మవిదులు చెప్పెడు శాస్త్రవితతియంతియు నొక విద్య — వేదము విధి, యర్థవాదము నని సామాన్యముగా రెండు తెఱఁగుల విభాగార్హమై యున్నది. అందు మొదటి భాగము కర్తవ్యాకర్తవ్యముల దెలుపును. విహితకర్మములందు పురుషుఁడు ప్రవృత్తుఁడగుటకు కర్తవ్యసాధనముచు,

చెడ్డపనులనుండి మరలుటకు వాని దుష్ఫలమును, బోధించునది రెండవ భాగము. విధి రూపపదార్థమును విపులీకరించునది ధర్మ విధులు చెప్పెడి ధర్మశాస్త్రము. అర్థవాద గర్భాగమును తేట తెల్లముగా తెలుపునది పురాణము.

సర్వన్యాయవిస్తరంబు నానొక్కటి— దీని తర్కశాస్త్ర మని వ్యవహరింతురు. ఇదియుక్తిప్రతిపాదకము. సర్వవాదములకు యుక్తులిందు లభింపఁగలవు.

మీమాంసనా నొక్కటి— వేదసిద్ధాంతములను తదను కూల యుక్తులచే ప్రతిపాదించు శాస్త్రము. కర్మబ్రహ్మప్రతిపాదకమైన వేదము పూర్వకాండ, ముత్తరకాండమను విభాగము ననుసరించి నిదియు పూర్వమీమాంస ఉత్తరమీమాంస (వేదాంతము) యని రెండు విధములుగా వాడఁబడుచున్నది.

వైద్య—ఆయుర్వేదము కోదండ - ధనుర్వేదము, గాంధ ర్వము, అర్థశాస్త్రము ననునివి నాలుగు. (18 మొత్తము)

124 అనయము = ఎల్లప్పుడు. పేర్చు కామమునన్ = అతిశయమగు భోగ ము చేత, క్రాగున్ = నశించును.

129 భవదీయ సభ యొప్పునకు— మయుండొసఁగిన సభయందమునకు

158 ఆసఆసలన్ =(ద్విరుక్తమయిన ఆసపదము) ఆశ గలవాఁడనై, మృగ యావ్యాసక్తుఁడు = వేటయందు రుచిగలవాఁడు.

161 ఉడిలకొనక = డగులొందక.

164 తదీయ బాలికత్వము పేర్మిన్ = ఆరాజుయొక్క మూర్ఖత చేత

169 అసపజ్జ = అశాసనిరాపము

171 పెట్టిదంపు వెరవు = కఠినోపాయము, సాకేతము = అయోధ్యానగరము.

రాజు కేవల కాఠిన్యమునను మార్దవమునను రాజ్యసంపదఁ బొంద శక్యపడదు. ప్రజనొవ్వని యాజ్ఞాపాలనచే మెలఁకువతో దాని బొందవలెను.

182 ప్రుష్వ = ప్రసగు.

189 జడవిధి=సముద్రము. ఒయ్యనన్ = మెల్లగా

190 అంబుస్రోతః జనిత అఘయ పథమునన్=ఏటిజాలుచే నిర్మయమగుచున్న మార్గమున.

193 తూఁతలు= చేఁపలనుపట్టు సాధనములు: ఎత్తెలన్ =వలలచేతను, కరములన్=చేతులచేతను, కరము=మిక్కిలి.

203 లాఁగ=బిలము, మహీజము=చెట్టు; ఎర=ఆహారము.

209 ఉలూకము=గుడ్లగూబ, నకులము=ముంగిస.

212 కడఁకన్=పూనికతో, కృతఘ్నత=చేసిన మేలు మఱచుట.

229 దీమములు=బలవంతమైన జంతువులబట్టుకొనుటకై పెంచబడిన పశుపక్ష్యాది జంతువులు.

230 వాతికిని గరము=నోటియందలివిషము.

231 ఉద్గతవికారీభూతమై=వికారము నొందినదై.

234 బలవంతుఁడగు శత్రునివలనఁ బ్రయోజనము గలుగుటచే వానితో సఖ్యము చేయవలసివచ్చినను కార్యము తీఱినవెంటనే వాని సాంగత్యము విడచియుండుట మంచిది. అట్లుచేయనిచో నంతమున కీడు వాటిల్లునని శుక్రనీతి.

239 నమ్మఁదగిన వారినైనను నమ్మినట్టుల యుండి నమ్మకయే తన్ను వారు విశ్వసింపునట్టుల యుండుటనీతి. 'నమ్మినమ్మక మిత్రులఁ బనులు గొనవలె'' యని ద్వితీయాశ్వాసమున నీవిషయము సామాన్యముగా చెప్పఁబడినది.

243 పలుపగఱపలని యాపద నొంగు నుపాయమును పలితుఁడను మూషికచరిత్రమువల ననుహీనత్రువుఁడైన శత్రువు నైన నాశ్రయించి కార్యము నెరవేర్చుకొను మార్గము రోమశుఁడను మార్జాలము వలనను నేర్చికొనఁదగునని భా.

245 చతురభాషిణి= తీపుగాఁబలుకునది, పూజనియను లోకశారిక = గోరువంకపక్షి, ఆర్ద్రీకృత=ప్రేమముతో. అ+దారకుండు=పిల్ల వాఁడు.

257 తనభూమినాక్రమించినవానియందు దాయాదియందు మాటలయందు ఆఁడువారివిషయమునను అపకారముచేసిన వానియందును పగ జనించును. విరోధమునకీయైదు మార్గములు.

263 కోపము ప్రస్తుతము చల్లనిమాటలచే గప్పఁబడినను సమయమున నది వెలువడును. సముద్రమున బడబాగ్ని నీటియందు దాగి చల్లారక వెలుపలికి దెలియరాకయుండుచు నొక్కపరి బయలుపడుచున్నది గదా.

268 వికచముఖుఁడు=ప్రకాశించుచున్న మోముగలవాఁడు. ఎడ్డ= హృదయము, తనశత్రులకు హితులగువారికి మాటలు రుచికరములగు వాని జెప్పుచు హృదయమున కాఠిన్యము సహింపవలెనని భా.

276 అప్పు- అగ్ని-పగ- తెగతీర్పక-అర్పక- తెగటార్పక- క్రమాన్వయము.

277 మృదువు=మెత్తందనము; ఖరము=తీక్ష్ణమైనది.

278 అవగ్రహ ఆదిదురితంబులు=క్షామము మొదలగు పాపములు.

280 కర్షనము=కృషి (వ్యవసాయము)

288 సాగమేయము=నుక్కు' కేలు=హస్తము

289 పలలము=మాంసము. ఏను=నేను, విభావసుండు=అగ్ని.

294 అగస్త్యుండు దైత్యమాంసముం దినండె

వాతాపి-ఇల్వలుండు- అనువారు రాక్షసులు సోదరులు గలరు. వారొకయరణ్యమున నివసించుచుండిరి. అచటికి వచ్చిన బ్రాహ్మణుల సాదరముగ పిలచి అతిథిపూజలజేసి వారిలో నిల్వలుండు మేషాకారముగానున్న వాతాపిమాంసమువండి దానగూడిన శ్రాద్ధభోజనముచే నాభూసురుల సంతుష్టులజేసి వాతాపి! నిర్గమించుమని పిలచును. వాతాపి బ్రాహ్మణగర్భము భేదించుకొని వెడలి రాగా వారు మృతినొందుదురు. తరువాత వారిరువురుకలసి యా బ్రాహ్మణమాంసము తినెదరు. ఈవిధముననే నేకుల హింసించుచుండిరి. ఇట్లుండ నొకప్పుడగస్త్యుం డచటికు వచ్చెను. ఇల్వలుండు తనపూర్వాచారప్రకారము భోజనముచే సంతుష్టు జేసి వాతాపినిపిలువ నగస్త్యుండు వాండు జీర్ణమగును గాని రానేరండని చెప్పెను. అంత ఇల్వలుండు కోపించి వాని గూడతన తేజస్సుచే భస్మముగావించెను. లోకోపకారమునకై యగస్త్యుండు రాక్షసమాంసము దినినను దోషయుక్తుండు కాడయ్యెనని తాత్పర్యము.

297 మాహాత్మ్య=సామర్థ్యము. బ్రాహ్మణతా, విద్వత్త, శ్రియంబు=బ్రహ్మతేజమునకు, పాండిత్యమునకును స్థానము, దానికి ... లేదు, ఈరెంటివలనను లోకోపకారముగలుగ గలదు. పరోపకారమునకై చేయుపాపము నిష్కృతిచే బోగొట్టుకొనవచ్చు నగుటచే నని భా.

303 మహిషజనస్తుత్యము=పండితులచే గొనియాడదగినది.

305 దనుజమంత్రి=రాక్షసులకుమంత్రి శుక్రాచార్యులు.

307 కాన=అడవి, బెగ్గిలి=భయమునొంది, వఱ్ఱుడి=ప్రవాహపువాడి

మిట్టకన్=ఎత్తుచోట, వనస్పతి=గొప్పవృక్షము (వనమునకుపతి) తొంపయైయున్నదానిన్ = గుబురుగానున్నదాని, ద్విజ=పక్షి.

309 కోటరము=చెట్టుతొఱ్ఱ, కపోతము=పావురము

311 అతివ=స్త్రీ, గెలిచితి జమునిన్ — భర్తను సంతుష్టుని జేసిన నాకు పుణ్యలోకములు గలుగగలవు గాన యముని బారినతప్పించుకొన గలిగితినని సంతోషించెను.

314 విహగము=పక్షి. లుబ్ధకుఁడు=బోయవాఁడు

316 ప్రతన్నములు=మిక్కిలివ్యథపెట్టఁబడినవి.

317 పుల్లతల=కట్టెచిదుర, ఇంగలము=నిప్పు.

318 తనుకంగా జేసి=తపింపఁజేసి, నెమ్మి=ప్రేమ.

319 గువ్వ=పావురము. అనలశిఖాకలాపమునన్=అగ్నిజ్వాలలయొక్క సమూహమునందు.

323 వలగొని=ప్రదక్షిణముచేసి, ప్రాన్పడియుండెన్ = నిశ్చేష్టితుఁడై యుండెను.

325 పులుఁగు=పక్షి, తలపన్ వచ్చినన్=యోచింపఁగా

328 పక్షిని హతిసాధనములు= పక్షులబట్టునట్టియుపకరణములు

329 ఎలుఁగు=గొంతు, రాలుపడఁగన్=నొవ్వఁగా, అశ్రుజలతరంగిత ఆస్య=కన్నీటిచేఁ దడుపఁబడిన ముఖముగలదియై పలవించెన్ = దుఃఖించెను.

332 విరులు=పుష్పములు, క్రేవలకు=పార్శ్వములకు మావిప్రోకలన్, ఎలతీఁగలన్=మామిడి మొలకలచేతను, లేత తీగలచేతను. నవ్రీతో డన్=ప్రీతితో, అలరు=ప్రకాశించుచున్న. నెత్తమ్ముల కలిమిన్=

అందమైన కమలములు గలుగుటచే (నెఱి+తమ్మి=నెత్తమ్మి. నెన్న డాదులన్ నెఱిదగు, ప్రౌఢ సంధి) డిగ్గియల=నడబావుల

337 కేళిన్=విలాసముచే మీఱిపోన్=అతిశయించునట్టి అచ్చరలేమ పిండు=అప్సరస్త్రీ సమూహము. బలసి=ముట్టుకొని.

352 తెలివిలేనివాఁడు కూడనిపనులుచేసి తరువాత దుఃఖించు చుండును. జ్ఞానవంతుఁడు దోషముల బాపికొను సామర్థ్యము కలిగి యుండుగాన నొకప్పుడు దుఃఖమునొందఁడు.
అతులప్రజ్ఞాసానుమత్ ఆరూఢుఁడు=సాటిలేని బుద్ధియనెడి పర్వతము నెక్కినవాఁడు.

356 నీవు పాపమువలన భయమునందినవాఁడవై నన్నొక్క విషయము నడుగుచున్నావు. నా మనస్సు ధర్మప్రవణమైనది గాన నీతలంపుల దూరకున్నది.

360 ఆదరమేదుర అవలోకనము=మిక్కిలి ప్రేమతోఁగూడిన చూపు.

363 బుద్ధిపూర్వకముగాఁజేయని పాపము దొడరినచో దరువాత యథా
364 ర్థముగా పశ్చాత్తాపము నొందినవాఁడై ఇఁకమీఁద నివిధమున చేయనని నిశ్చయముకలిగి బుద్ధిపూర్వక పుణ్యకార్యములఁజేసిన నబుద్ధిపూర్వక పాపము నశించునని భా.

392 దబ్బాటు=ఆకస్మికము, మెకమెకపడితి=గర్వపడితివి.

417 సమత=సర్వభూతములందుసమానప్రేమకలిగియుండుట. దమము= ఇంద్రియనిగ్రహము తితిక్ష=ఓర్పు అమత్సరము = ద్వేషములేకుం డుట. హ్రీ=సిగ్గు. ధృతి=ధైర్యము అనసూయ=మేలోర్చుట.

426 నృశంసుఁడు = ఘాతకుఁడు అఱు, కలుగుజనుకంటెను= కామ; క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యములను అరిషడ్వర్గములు

గలవానికంటె, పేమ=పెద్దవాఁడు, అంసప్రదేశ...ధరణీవలయా అంసప్రదేశ=భుజములపై, లలిత=వెలుఁగుచున్న. ఉత్తంసీకృత= శిరోభూషణముగా జేయఁబడిన. ధరణీవలయా = భూచక్రముకల వాఁడా.

427 కుజనుఁడు=దుర్మార్గుఁడు. చుట్టములు, ఆలోకింపక. మేలు. అను భవించు. అదియు స్వకంసాశీలము = ఘాతకుని ధర్మము. పంచి కుడుచునతఁడు = తినకున్నవరకు బంధువులకిచ్చి తానను.భవించు వాఁడు,

430 క్రియాశేషయోగదానాదులు= కర్మసమాప్తికై వలయుదానములు మొదలగువానిని తెలుపగవలయుక=పూర్తిచేయవలెను.

435 అమృతము, విద్య, అనునివి లోకోపకారకములుగావన విషమునుండి యమృతమును నీచజమునివలన విద్యను గ్రహింపనగునని తా. ఈశైధర్మము లాపద్విషయకములని గ్రహింపవలెను.

443 ఉల్కము=అగ్నికణము. పడిలెక =రాలెను.

449 నిస్త్రింశము=ఖడ్గము.

457 ధర్మార్థములుఁ రెండును పరస్పరాశ్రయములుగావన నవి సమానములు. వీనిలో నర్థము కామమునకు సాధనము. అర్థమువలనజనించుఫలము కామము, కాన అర్థముత్తమమని వీరల యభిప్రాయము.

ధర్మార్థకామముల తెఱంగెఱింగింపుమన భీష్ముఁడు రాజధర్మపరికరణముఁ నర్థమునకు ప్రాధాన్యము నిచ్చి ధర్మరతిచేనర్థము సంపాదింపఁబడవలయునని ధర్మము ప్రభావమను విషయము సూచించినాఁడు. ఇచట విదుర వాక్యమువలనను ముందు చెప్పఁబోవు ధర్మజుని మాటలచేతను ధర్మప్రాధాన్యము సిద్ధాంతీకరింపఁబడినది.

460 అళి=తుమ్మెద అళులన్=పుష్పములందు తుమ్మెద పుష్పములోని మకరందమును సంపూర్ణముగా ననుభవించినవిధమున మనుజుఁడు భోగముల ననుభవింపవలయును. అటుగానిచో గింజపట్టక యెండిన పైరువలె వ్యర్థమగునని భా.

464 అతతవర్గత్రయ సంజాతమనోదుఃఖభారసహుఁడగుకంటెన్ = విస్తారమగు ధర్మార్థకామములచేఁబుట్టిన మనోదుఃఖముల నోర్చియుండుటకంటె.

466 ధర్మమువలన సుఖము అర్థమువలన దుఃఖము కామమువలన మదము, దీనభావము కలుగకయుండుట మోక్షమును కలిగించును,

కీలుకొనక=వహింపక పొరపొచ్చెములై చనన్=తగులుచు విడచుచు నుండగా.

469 శఠుఁడు=మూర్ఖుఁడు పంద=పిఱికివాఁడు. కృతఘ్నుఁడు = చేసిన మేలు మరచువాఁడు.

470 బేహారము=వ్యాపారము. గిరిగహనదుర్గమము=కొండలచే నడవులచే పోవుటకువీలుకానిది.

472 సాతు=జనసమూహము.

475 కాందిశీకుఁడై=భయముచే పరుగిడినవాఁడై కెలన=పక్కన.

478 బకము, కొక్కెర=కొంగ.

493 రాజధర్ముఁడనునది కొంగపేరు, అనుగలము=అనుకూలము.

502 నిచ్చలున్=ఎల్లప్పుడు రేపకడ=ఉదయకాలము. తులువ = దుర్మార్గుఁడు. పొచ్చెము=కపటము.

505 పయిమెయి=అతివేగముగా పొరిగొని=చంపి,

503 కుక్కపదుపు=కుక్కలగుంపు (పదుపు—సజాతీయ సమూహము)

512 పురపురక, పొక్కుచుక = మిక్కిలి దుఃఖించుచు కరంకము = డొక్క, నెయ్యురు=స్నేహితులు.

517 సురభి=గోవు నర్మిలి=ప్రేమ క్రేపు=దూడ=సొద=చితి.

525 విచారింపఁగా మిత్రద్రోహము కృతఘ్నతకంటె మిగుల పాప జనకము. మిత్రులనైనను మిత్రద్రోహికృతఘ్నుఁడు అను పేరల విక్షోభము కల్పించుకొనియైనను విడువవలయునని భా.

ఉత్తమకులజుఁడై సుగుణాయత్తుఁడైన మిత్రునిచెంత చేరవలయును. అట్టి సన్మిత్రునిబొందిన శుభము చేకూరును. రాజధర్మోపదేశమున నమ్మకునికి మేలనుట శత్రుహితాచరణ పరాయణులై నిబిడసఖ్యము నాచరించువారు రాజ్యతంత్రములలో పాల్గొనుదురుగాన యేకాగ్రమనస్కుఁడై తానాలోచించి మెలఁగవలయునని బోధించుటకని యెఱుఁగదగును. మైత్రివలన రామసుగ్రీవాదులు పరస్పరసహాయముగలవారలై యతులమయిన లాభము బడసిరి. సన్మిత్రుని సంపాదించిన సర్వము సాధ్యమగుననునది పై నాడీజంఘుని యితిహాసమువలన తెలియవచ్చెను. కావున మిత్రద్రోహ మధికపాతకము. సుగుణసంపన్నుఁడగు మిత్రునిబడయుట శుభావహమని భావము.

తృతీయాశ్వాసము,
సంపూర్ణము.

## శాంతిపర్వము — చతుర్థాశ్వాసము.

### లఘువివరణము.

---

ఇంతవఱకు రాజధర్మములు బహుప్రకారముల వివరింపఁబడెను. దానధర్మసందర్భమున ప్రియుంబంది రాజధర్మములవిశదముగా నెఱింగి, సకలజనములకు పరమ హితమగు ధర్మమును తెలుపవేయని యడిగెను. అంత పితామహుండగు భీష్మాచార్యుఁడు సర్వధర్మములు హితకరములు, ఫలవంతములుకాని ధర్మమొండును లేదు. మోక్ష ముత్తమమని తత్త్వజ్ఞులు చెప్పెదరు. అనిచెప్పి తత్త్వవిదులగు పూర్వాచార్యుల సంవాదముల ప్రమాణీకరించుచు నీతిపాఠముల నుదహరించుచు మోక్షధర్మముల ననేకతెఱఁగుల విశదపరచెను. ఈసందర్భవశమున బోధింపబడిన వ్రతనియమములు విష్ణుమంత్రప్రభావము మొదలగువిషయము లనేకము లీయాశ్వాసమున బొందుపఱుపఁబడినవి.

3 ఉజ్జ్వలవిసరత్ తేజోధన = ప్రకాశించుశక్తియు, వ్యాపించుశక్తియు అగు తేజస్సు అనెడి ధనముకలవాఁడా.

4 సమాదరసమ్యక్చిత్తుడు అనుమాట = ప్రీతిచే నొప్పిన మనస్సుకలవాఁడగుచు.

6 ఆయసుహితా = శుభగుణములచే నొప్పువాఁడా

8 ఎనటకా = శోకమును, ఎనరందగునే = యెక్కసపడఁదగునా.

10 నదీప్రవాహమున నెచటనుండియో వచ్చిన రెండుకాష్ఠములు కలయును. కొంతకాలములో విడిపడి పోవును. కానివానికలయికకు దగిన సంబంధమేమియు కాన్పింపదు. అవిధముననే పితృపుత్రా

కుల సంబంధముగూడ నెఱుఁగదగినది.

12 పరిపాటిమెయిన్ = క్రమముగా.
సుఖదుఃఖము లొకటియైన పిదప నొకటి క్రమముగా నరునిపొందుచుండును. కేవలసుఖముగాని కేవలదుఃఖముగాని పొందబడదు. అటుల క్రమప్రాప్తములగు సుఖ దుఃఖముల విషయమై వివేకి ఖేద మోదముల నందరాదని భావము.

13 ఇత్యాది నాదియను గాఢాభిమానమే శోకమునకు కారణమని భావము.

14 జ్ఞానియై సన్మార్గప్రవర్తకుఁడగువాఁడు గూడ పూర్వజన్మార్జితమగు కర్మఫలము ననుభవించి తీరవలయును. స్థైర్యముకలిగి యుండుటయే అపుడు కర్తవ్యము.

17 వేమఱుగుడు = పిచ్చివానవగుచు. చమరు = నేర్పు.

20 భూతక్షయ ఆవహంబు = ప్రాణులకు నాశము కలుఁగజేయునట్టి. అతిక్రాంతంబగుచున్నయది = సమీపించుచున్నది.

21 మేధావివరుఁడు = బుద్ధిమంతులలో శ్రేష్ఠుఁడు. ధీరతతలఁగొల్పి = ధైర్యముబూని.

23 ఇవిరెడు నీటిమీనవుకావె = ఇంకుచున్న నీటిలోని చేఁపవంటి వాఁడుగదా.

25 మృత్యువుపట్టు = మృత్యువునకు వాసస్థానము. అమరగృహము = ముక్తులకు నివాసప్రదేశము. నెట్టన = చక్కఁగా.

26 అమృతమువలన సత్యము, మృత్యువువలన మోహము, నని క్రమాన్వయము. సత్యమునన = అమృతమువలన.

27 పుత్రునివలన పుం అనెడి నరకమునుండి తప్పికొని సద్గతిబడయవచ్చునని, పితృఋణము దీఱునని శాస్త్రము చెప్పుచున్నది-

కాని మేధావి యీమార్గముచాఁటి స్వస్వరూపమును బ్రహ్మనుగా తెలిసికొని ప్రపంచమునంతయు నభేదముగా దృష్టిగోచరము చేసి కొనుచున్నవాఁడు. అందువలన స్వస్వరూపము నే తెలిసికొనిన యెడ పరమపురుషార్థమగు మోక్షము ప్రాప్తించుచుండ ప్రజవలన గలుగు వేఱుసద్గతితో నాకు బనిలేదని చెప్పుచున్నాఁడు.

28 పశువు సాధనముగాఁగొని చేయు యజ్ఞములవలన సాధింపఁబడునవి స్వర్గాదులైన అనుభోగ్యపదార్థములు. అవి యీకర్మ పుణ్యక్షయమున నశించునవికాని నిత్యములుకానేరవు. వాఙ్మనస్సుల నియమముచే జేయఁబడు తపోరూపమైన యీయోగమువలన నిత్యమైన మోక్షము సాధింపవీలగుచున్నది. కనుక పశుహింసాత్మకమైన బహిర్యాగములకదలి యాత్మయజ్ఞముల నొనరింపవలయునని మేధావి (పుత్రుని) యుపదేశము.

ఈపితాపుత్ర సంవాదమున వీరిలో పుత్రుఁడు పూర్వజన్మార్జిత కర్మవిశేషమున నీజన్మమున పుట్టుకతోడనే దృఢమైన వైరాగ్యము కలవాఁడు గాన కేవలమోక్షమున కున్నతమార్గముల జూపుచున్నాఁడు. తండ్రి అట్టిఅధికారి కానందున నిష్కామకర్మాచరణుఁడై దాన చిత్తశుద్ధి కలుగజేసికొని క్రమముగా ముక్తి సంపాదింపవలెనని చెప్పుచున్నాఁడు. వీరిరువురి సంభాషణమువలనను అధికారి భేదముచే మార్గద్వయము బోధితమగుచున్నది. ఫలము గోరక కర్మల నాచరించువాఁడు బ్రహ్మను సాక్షాత్కరించుకొనునని మున్ముందీయాశ్వాసమున నే నిరూపింపఁ బడుచున్నది.

30 మానసవిక్రుతులు=మనస్సునకుంగల వికారములు. ఏకాంత గుహారాముఁడవై=నిర్మలమైన హృదయమను గుహాయందు సంచరించుచున్నవాఁడవై. నిను వెదకుట=నీస్వరూపమును తెలిసికొనుట.

32 శాంతిపరాయణుండు=మోక్షమునందు నాసక్తిగలవాఁడు.

34 దనుకఁగన్=పొందగా. శిఖ=అగ్ని.

38 అధనతాజనిత అధీనత్వము=దారిద్ర్యముచే బుట్టిన స్వాతంత్ర్యము.

40 గుజ్జుదోయి = పొట్టియెద్దుల జంటను, జట్టిగొని=గొని లంకించి = పలుపుతో పెనవైచి. గనపలొట్టెనుఁగుపై=పెద్ద ఒంటెమీఁద.

43 అర్థక్రియావిశారద భంగుల్=ధనము నార్జించు వ్యాపారమునందలి నైపుణ్యపు రీతులు. ఉరవు=ఉచితము. (తగినది)

51 ఆలముదు=వ్యాపించుదువు. అగాధరసాతలభంగి=లోతైన పాతాళమువంటి రీతిగలది. బచ్చెనరూపు పోకలన్=బొమ్మ నాడించి నటుల.

55 రూపుసెడుట విషాదమును, సంపన్నుఁడై యునికి మోదమునని క్రమాన్వయము.

59 పిణ్యాకము=తెలికపిండి.

62 పిరుపెట్టి=అనాదరణముచేసి. నిశ్చలమనస్కుఁడై జనన మరణముల లక్ష్యముసేయక కామము గలవారలను పరిహసింపుచు కలిమి లేములు సమానములుగా నెంచుట యజగరవ్రతము (అజగరుని వ్రతము వంటి వ్రతము).

63 విధాత్ర సంప్రయుక్త భంగిన్=బ్రహ్మచే విధింపఁబడిన రీతిగా.

66 వృజిన, భయ, మన్యు, శోకములు=పాపము, భయము, కోపము. దుఃఖము.

69 తత్ అవమాన దూయమాన మానసుండు=ఆయవమానముచే పరితపించుచున్న మనస్సుకలవాఁడయి. సృగాలము=నక్క.

పురుషుఁడు తనదురితములనలన కఁబవు వెంట కఁబవును భయము వెంట

భయమును నొందుచు నెడతెగని యాపదలచే పీడింపబడు చుం
డును.

74 ఈవిధమున సత్కృతి సుఖములవెంట సుఖమును బడయును.

75 పులుఁగులలోన్=పక్షులలో. పూత్యండకములు=వాసనగల గ్రు
డ్లు. పొల్లుంబోలె=తరకలవలె.

77 నిష్ప్రయత్నకలిత ఉద్భూతిన్=ప్రయత్నము లేకయే పొందఁబడిన
పుట్టుక కలవియై.

78 చదలన్=ఆకాశమునందు.

79 నినుచుచు=నిండించుకొనుచు.

81 అవ్యయుఁడు = వృద్ధిక్షయములు లేనివాఁడు. అనంతుఁడు=నాశము
లేనివాఁడు.

83 అస్థులు=ఎముకలు. సిరలు=నాడులు. విష్ణుతను భూతంబైన=విష్ణు
వునకు శరీరమైన. అప్రమేయంబు=ఇంతయని కొలుచుటకు వీలు
కానిది.

84 అది, నాన్=మునుపుట్టినది యనుటకు.

జలములో కమలము పుట్టుట ప్రసిద్ధము. కమలమున కుత్పత్తి
స్థానమగుజలము బ్రహ్మవలన పుట్టినది. బ్రహ్మవలన బుట్టిన
యుదకమునం దుద్భవమైన కమలము, బ్రహ్మపుట్టుకకటుల కార
ణమయ్యెనని భరద్వాజుని సంశయము. గగనమాశ్రితమగు=ఆకస
ముతలఁగాగల (ఆకాశము తాఁకుచున్నదనుట.

88 అశనినిర్ఘోషంబున్=పిడుగుయొక్క ధ్వని, నిదాఘంబుపోకునన్=
ఎండతాఁకుడుచేత. చాఁగెడు=చిగిరించి కొమ్మలుసాగుట. పాద
పసంజ్ఞఁబరఁగున్ = పాదముచే పానముసేయునది యను పేరుచే
నొప్పును. పాదజిహ్వాలన్=వేళ్లనియెడి నాలుకలచే.

తెఱవు శేవంబు=వృక్షశాస్త్రము

పిడుగు చప్పుడుచే వృక్షములు చిగురించుట పుష్పించుట మొదలగునవి గలుగును. ఇయ్యది వృక్షమునందలి యాకాశ స్వభావమువలన జనించుచున్నది. ఆకాశమునకు శబ్దము గుణము. అటులనే యెండవేడిమికి వృక్షములు వాడుట వాయుధర్మము- తీగలు కొమ్మలు వ్యాపించుట తేజోధర్మము- వేళ్లనెడి నాలుకచే నీటిని త్రావుట జలశక్తి- పుష్పములు ధూపములు మున్నగువాని వాసనలం గొనుట పృథివీధర్మము (ఇయ్యది దోహదమున సంభవించును) ఈ విధముగ పంచభూతముల ధర్మములు వృక్షములందు కానంబడుచున్నవి గాన నవియు పంచభూతాత్మకములని యెఱుంగదగునని భావము-

91 విషయములు:— శబ్దస్పర్శరూపరసగంధములు. ఇంద్రియములు= త్వక్-చక్షుస్సు-శ్రోత్రము- జిహ్వ- ఘ్రాణము- అనునైదుజ్ఞానేంద్రియములు- వాక్కు- పాణి- పాదము- పాయువు, ఉపస్థలను కర్మేంద్రియములైదు- మనసును కొందఱు ఇంద్రియమని చెప్పుదురు- కొందఱంగీకరింపరు- కాన నిట మనస్సు వేఱుగా గ్రహింపఁబడినది-

93 నిఖిలగాత్రవ్యాప్తత్వమహిమన్=సమస్తశరీరములందు వ్యాపించుట యనుశక్తిని. సమీరణ ఆసూత్రణమునన్ =వాయుసంబంధమువలన. గోత్రమునై=కులముగలవాఁడై-

94 సత్త్వాది గుణత్రయ వికృతికి = సత్త్వరజస్తమో గుణములయొక్క వికారమునకు. అత్యతీతంబై=విలక్షణమై విగతత్వంబునకున్ = విడుదలకు (అనగా ముక్తికి) నెలవు=స్థానము-

95 సూక్ష్మవిమలబుద్ధిన్=సూక్ష్మమై నిష్కామకర్మానుష్ఠానాదులచే శుద్ధమైన అంతఃకరణచే. పరమసుఖమున్=ముక్తిని.

100 అనృతంబుచేతన్=అబద్ధముయొక్క పనిని-

102 మోహవిఘాతి నియమములు = మోహమును నాశముజేయునట్టి వ్రతములు.

103 ఒలయు=కలుగునట్టి. గాఢశోకదశశోకాంపులు=మిక్కిలి బాధించు శోకము సున్నగునవి.

107 త్రిషవణస్నానము=ప్రాతర్మధ్యాహ్న సాయంకాలములందు మూఁడు మార్లుచేయు స్నానము. శౌస్కర అనల సపర్య=సూర్య అగ్నులపూజ.

110 కర్మభూమి=కర్మలనాచరించుటకు యోగ్యమైన చోటు. అలోకంబు భోగాస్పదము. అని అన్వయము.

114 వ్యవసిత వచనములు=నిశ్చయింపఁబడినవాక్యములు. అవిరత బహు దుఃఖనిలయము=ఎడబాటులేని దుఃఖములకు స్థానము.

115 విషయసుఖములందాసగలవారు కాని సుఖకరములగు యజ్ఞాదులను దుఃఖకరమగు పరదారగమనాదికములను జేయరు. అటుల చేసిన వారు భోగాస్పదములగు స్వర్గాదులను దుఃఖాస్పదములగు నరకాదులను బొందుదురు. తుచ్ఛములగు వైషయిక సుఖములం దాస లేక సంసార బంధమునుండి విడివడ దలంచువారికి పుణ్యపాప మార్గములు రెండును నవసరములేమి ఈలోకములందు తిరుగక ముక్తిని బడయుదురు.

117 పంచశర్గభావము ఒంది—— చేతులు (2), పాదములు (2), ముఖము, కలసి యైదు. ఈ యైదింటిని కడిగికొని.

124 మాయకు స్వరూపము సత్వరజస్తమోగుణములు. అందు రజస్తమోగుణముల నడంచి కేవలసత్వగుణసంపన్నుడైనిలచి సత్వరూపమైన పరమాత్మవిషయకజ్ఞానము కలిగినపిదప ఆసత్వగుణమునుగూడ వదలి స్వచ్ఛమైన జ్ఞానస్వరూపుడగును.

127 మేఘమునందలి మెఱుపువలెను తామరాకునందలి నీటిబిందువువలెను మనస్సు మిక్కిలి చంచలమైనది. కాన మనసు నేకాగ్రముగ

ముంచుటకు యత్నము చేయవలెను. మనస్సునకు వాయుగమనమే గమనముగాన వాయు నిరోధము ముఖ్యము. అది క్రమముగ గాని సిద్ధింపదు. కావున సలసట నొందక విసువక యమనియ మాదియోగముల నభ్యసింపఁగా జ్ఞానము వాయువిధంబున నతివేగము నొందును. అంత శీఘ్రముగ జ్ఞానమభివృద్ధి నొందుననిభావము.

130 అత్యంత శౌచశాలియై=అతిశయమగు ఆచారముచే నొప్పువాఁడై విశోకహర్షరాగాదికంబు=పోయిన దుఃఖముసంతోషము రక్తి గలదియును.

133 సంహితాజపము=వేదజపము. విహితశీలతన్ = శాస్త్రమునందు జెప్పఁబడిన యాచారముతో.

139 గీటునఁబుచ్చుచు=అనాదరము సేయుచు.

155 విలిచి=వెలయిచ్చికొని.

156 ముట్టంబట్టిన వాదుపుట్టిన=తీసికొను విషయమై తగవుపుట్టగా

166 మహాజ్యోతిర్జ్వాలాకృతి = గొప్పయగ్ని జ్వాలవలె ప్రకాశించుచున్నయాకారముగలవాఁడు. ప్రాదేశమాత్రుఁడు=చూపుడు వ్రేలిని బొటనవ్రేలిని చాచిపట్టిన కొలత ప్రాదేశమనంబడు. అంత పరిమాణముకలవాఁడు. (లాడితడనుట)

174 ఉత్కృష్టమగు నాపరబ్రహ్మరూపమైనవస్తువు జ్ఞానేంద్రియములలోనే దానికిని గోచరముగాదు. ఇంద్రియగోచరమగువిషయములు శబ్దస్పర్శరూపరసగంధములలో నేదేనొకటి దాని కలిగియుండవలెను. ఈపరమార్థవస్తువు శబ్దస్పర్శరూపరసగంధ రహితమైనదగుటచేనింద్రియగోచరము కాదని భావము.

176 అలఘునిత్య బోధన జ్యోతి = గొప్పదైశాశ్వతమైన జ్ఞానమనెడి తేజస్సు, విగతజాడ్యముల = పోయినమాంద్యము గలవానినిగా

177 ప్రభువునకు మంత్రులాయాకార్యముల నాయాకాలని వెలయఁజేయు నటుల ఇంద్రియమును మనస్సును కలసి యాపరమాత్మకు క్రియల గలుగఁజేయును. స్వయముగ క్రియారహితుఁడని తాత్పర్యము.

179 తర్పినన్ = మన్నించిన. ఆలంగఁజేసి = శ్రమపరచి. విన్ననువునన్ = నైపుణ్యముతో, ఆగమోక్తమథనంబు = శాస్త్రవాక్యముల విమర్శించుట.

181 ఓదము = ఏనుఁగును పట్టుటకై చేయబడిన పల్లము, మృగము = లేడి, ఝషము = చేఁప, దక్షులు = సమర్థులు.

183 అమవసన్ = అమావాస్యయందు, మనసు గానని కలుషన్ = మనస్సున్ తెలిసికొనలేని దోషముచేత.

185 బాగుగ తేరిన నీటియందు రూపము గనుటకు యోగ్యమైనటుల నిష్కామకర్మచే శుద్ధమైన యంతఃకరణమునందాత్మను గనుటకు వలనగును. మలినజలమునందు తన ప్రతిబింబమును జూడని తెఱఁగున శుద్ధముగాని యంతఃకరణమునందాత్మను జూడసమర్థుఁడు గాఁడు.

189 సమ్యగ్జ్ఞానంబునకున్ = బ్రాహ్మజ్ఞానమునకు, మొఱంగు తెఱంగు = వంచన చేయు రీతి.

192 ఇట్టలముగన్ = బాగుగా. సత్త్వరజస్తమోగుణములు మూఁడును పెనవేసికొని యాత్మను జుట్టికొనియున్నవి. అవి విషయములందలి వైరాగ్యమను కొడవలితో ఛేదించినంగాని తెగవని భావము.

204 ఇల = భూమి. క్రియానిష్ఠాతత్త్వ వినోదవితృష్ణన్ = కార్యమునందలి నేర్పుదనముయొక్క క్రీడయందలి ఆశచే.

211 రాజునకు మంత్రులవసరమయినవిధమున నన్ను ధ్యానించుటకుత్కృష్టమైనభక్తి నిష్కల్మషమయినశ్రద్ధ యింద్రియజయము ఆవశ్యకములని భా.

213 ఐశ్వర్యసమగ్రవీర్యాది షడ్గుణైశ్వర్యసంపన్నుఁడని జెప్పఁనట్టియు
సమస్త చరాచర ప్రపంచమునందు నివసించువాఁడని తెలుపునట్టియు
శబ్దములవరుసగనుంచి చతుర్థీవిభక్తిం జేర్చిననామంత్రమగునని తా.
చెరని_చేరి.

222 యజ్ఞమునందేవిష్ణు వారాధింపఁబడుచుండెనో ఆవిష్ణువు నాకు ప్రస
న్నుఁడగుగాక. దేవతల నుద్దేశించి యగ్నిముఖమున హవిస్సును
త్యాగముచేయుట యాగమనఁబడును. విష్ణుస్వరూపులగు నాదేవ
తలను హవిస్సులచే నారాధింపునపుడు అధ్వర్యుఁడు అగ్నీధ్రుఁడు
హోత అనువి ఋత్విక్కులు ప్రధానముగా జెప్పఁదగిన పదములు
గలవు. ఆముఖ్యపదములే నాలుగిట. రెంట. అను పదములచే
నిట జేర్కొనఁబడినవి. చూడుఁడు.

నాలుగింటను ఆ శ్రా వ య, (4) అను అధ్వర్యుప్రేష రెం
డియు నాలుగింట అ స్తు శ్రౌ షట్, (4) అను అగ్నిధ్రిప్రేష.
రెంట య జ. (2) అనెడి అధ్వర్యుఁడు హోతకిచ్చుప్రేష. ఐదింట
యే య జా మ హే, (5) హోతృయాజ్య. మఱియును రెంట.
వౌ షట్ (2) అనెడి హోతృయాజ్యాంతపదము. ఇట్టి యజ్ఞ
స్వరూపుఁడగు విష్ణువుస్తోత్రము చేయఁబడుచున్నాఁడు.

223 పంచయజ్ఞాండు=బ్రహ్మ మనుష్య, భూత, దేవ, పితృ, యజ్ఞములు.

236 ఫలము నపేక్షింపక కర్మలజేయుచు క్రమముగ చిత్తశుద్ధిద్వార
మున జ్ఞానమునుపొంది జ్ఞానాగ్నిచే కర్మల నశింపజేసి ద్వంద్వ
రహితులై యుండువారు నిన్ను తెలిసికొనెదరని భావము.

237 పరమాత్మను దెలిసికొని ముక్తులు కాగోరువారికి పాపకర్మముల

వలె పుణ్యకర్మలును బంధకములుగనుక రెంటిని నిరశించువారు నిన్ను తెలిసికొనెదరని భా.

243 ఘ్రాణము, మహిన్, జిహ్వ, ఉదకమునన్, దృక్కు, తేజంబునందును, త్వక్కు, వాయువునను, శ్రోత్రము, ఆకాశమునన్ అని యన్వయము.

కార్యము కారణమునందు లీనమగుట స్వభావసిద్ధము. త్వక్చక్షు శ్రోత్ర జిహ్వా ఘ్రాణములకు ఆకాశాది పంచకము కారణము గాన వానియందు లీనము చెప్పఁబడినది.

243 పైపద్యమున పంచభూతకార్యములైన శ్రోత్రాదులు భూతపంచకమునందు లయమగునని చెప్పఁబడినది. ఇపుడు పంచభూతాదికము క్రమముగా తమతమ కారణములందు లయమగుస్థితి జెప్పబడుచున్నది. ఇంతపట్టును=వీనినన్నిటిని పడిసన్న= ప్రసిద్ధమైన భూతతన్మాత్రలు=అపంచీకృత పంచభూతములు.

252 బారసి=ద్వాదశి.

258 అనిషమునిపతి = దేవర్షిశ్రేష్ఠుఁడగు నారదుఁడు.

263 ఆశాస్త్రములు వినినను తెలియజెప్పినను పరబ్రహ్మ స్వరూపమిట్టిదియని పరోక్షజ్ఞానము కలుగును. కాని యాశాస్త్రముల వలన నెఱిఁగిన పరమాత్మస్వరూపానుభవము దేవాదులకుఁ గూడ దుస్సాధ్యము. నారాయణునకు మాత్రమా యపరోక్షానుభవ జ్ఞానము కలదని భా.

269 సకలదుఃఖ భేషజంబు = సమస్తమైన ఆపదలకు మందువంటిది అర్హాగమ్యమైన = తగినవారిచే పొందదగిన.

270 ప్రకృతి, పురుషసమేతత్వవిశేషమునన్ = ఆత్మతో గూడుటచే.

చైతన్యశక్తిః = జ్ఞానశక్తిని (పురుషునితో సంపర్కమున్ను జడమని యర్థము) తజ్జాత=అప్రకృతివలన పుట్టినది. చితున్=జ్ఞానమును.

78 మహదాదిక సప్తకము- బుద్ధి, అహంకారము, పంచభూతములు' అను నేడును, వికృతులు=వికారములు. ఈసప్తకము ప్రకృతులునగు. అహంకారము బుద్ధివలన బుట్టినదిగాన బుద్ధి అహంకారమునకు ప్రకృతి. ఈవిధము ఉత్తరోత్తరమునకు పూర్వ పూర్వము ప్రకృతియని తెలియఁగదగినది.

ఉభయవిధఇంద్రియములు జ్ఞానేంద్రియకర్మేంద్రియములు విషయపంచకము శబ్దాదులు. ఈపదియారు వికృతులు మాత్రమే దీని సాంఖ్యులిట్లు చెప్పిరి.

శ్లో॥ మూలప్రకృతి రవికృతి ర్మహదాద్యాః ప్రకృతివికృతయస్సప్త షోడశకశ్చవికారాః నప్రకృతిర్నవికృతిః పురుషః॥ అని.

285 అరణ్యమున సంచరించువానికి చూచుకొలదియు నింకను చూడవలెనను కోరికపాడమినట్లు సంసారమను అరణ్యమున సంచరించు వానికిగూడ నాయరణ్యమున సంచరింపవలయుననియే కుతూహలము కలుగుగాని బుద్ధి మరలదని భా.

286 తెవులుపట్టిన నద్దానిదొలఁగించుటకు వైద్యము సేయురీతి మోహమను తెవులుడుపుటకు సత్యశౌచాదులను నౌషధము సేవింపవలెను.

297 బోధయుతులు = ఆత్మజ్ఞానసంపన్నులు.

307 ఇంద్రదైవత్యము = ఇంద్రుఁడు దేవతగాగలది. నృబీజము= మనుజుల వీర్యము.

322 జీవుఁడు స్వప్నమునందు యింద్రియములు స్వాధీనములు గాకయున్నను స్థూలదేహము గలిగినవానివలెను, విషయములు లేకు

స్వను శబ్దాది విషయములననుభవించువానిఁ జేసి మెలఁగును. ఇది యంతయును మానసిక వికారము. మనోగతి యెట్టిదియో యని వితర్కము.

324 శరీరమున కలసటగలుగుటచే నిందిర్యములు పరవశములగును- అదియే నిద్ర- కలయన జాగ్రదవస్థలో యనుభూతములైన విషయ సంస్కారము- అందు విషయములు లేకయే విషయములున్నటుల భాసించును, అస్వప్నావస్థలోగూడ ఆత్మ సాక్షియైయుండును-

326 సుషుప్త్యవస్థలో నీమాయాప్రపంచము లేనియట్టుల నుండును- ఆత్మ సాక్షియై యాయవస్థయందును ప్రకాశించును. ఇటులనే సర్వావస్థలయందును ప్రపంచము లేనియటుల దోచుచు సాక్షియై ఆత్మభాసించిన జ్ఞానమనఁబడును-

331 సత్త్వరజస్తమోగుణము లాత్మకు స్వాభావసిద్ధములు కావని తా.

336 దాత్రిస్త్రై=కోమలవల్లియై- వికృతులన్ =పంచభూతాములను. ప్రకృతిని మాయను. పురుషుని = ఆత్మను-

346 తీవ్రన్=ఆకర్షింపఁగా. ప్రయమగుట=నాశమగుట.

352 క్రమంగన్=తరచుగా పైరెండుపద్యములయందు నీపద్యమున రజస్తమోగుణములన్యూనాధిక భావము వలన గలుగు వికారములు చెప్పఁబడినవి-

361 పైనవివరింపఁబడిన గుణత్రయమును ఆత్మతత్త్వమునందు లీనము చేసిన యెడ సముద్రమునంగలసిన నదులు వేఱుగా కాన్పించని రీతినియివి యు ఆత్మకంటె భిన్నముగా కాన్పింపవు-

368 తోలు=కుబుసము- కీలుకొననీక=తెగులొ్కననీయక.

368 ఏడ నెపడన్=ఎప్పుడెప్పుడు. నంజు=తిను. ఇహా్మలములగు =ఈవిధ ములగు.

389 సంయమినిరతుండు = ఇంద్రియనిగ్రహమునందాసక్తి కలవాఁడు సమలోష్టకాంచనుఁడు = మంటిని బంగారమును సమానముగా జూచువాఁడు.

390 కనకమయయూపము=బంగారముతోఁ జేయఁబడిన యూపస్తంభము (యూపస్తంభమనగా యాగీయపశువును బంధించుకంబము ఉమ్మలము=దుఃఖము.

392 పొలుచు=ప్రత్యక్షము, గజ్జులువల్కుట=వ్యర్థభాషణములాడుట. మఘవనుఁడు=ఇంద్రుఁడు. కన్నోటలేక=భయములేక=విరియు= విడిపోవు,

400 కౌశికుఁడు=ఇంద్రుఁడు=నానార్థము=విశ్వామిత్రుఁడు. గుడ్లగూబ.

422 నిస్సంభ్రముఁడు=వేగిరపాటులేనివాఁడు వైమనస్యరహితుఁడు = విరోధములేనివాఁడు.

436 సెగ్గింపఁగ=నిందింపగా. ఏఁటికి అని అన్వయము.

చతుర్థాశ్వాసము.

సమాప్తము.

---

తెనాలి ఆంధ్రముద్రాక్షరశాలయందు ముద్రింపబడియె.

# తప్పొప్పుల పట్టిక.

| పేజి. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 17 | 18 | శాదూలము | శార్దూలము |
| 63 | 10 | పిలికిన | పలికిన |
| 79 | 19 | నిత్యాంత | సత్యాంత |
| 99 | 14 | గోత్రపా | గోత్రవా |
| ,, | ,, | గాష్ఠిం | గోష్ఠిం |
| 144 | 14 | నితంమును | సతంమును |
| 161 | 20 | జరంబుబులు | జరంబులు |
| 171 | 16 | ప్రముఖమూలు | ప్రముఖములు |

---

# Telugu Pocket Classics Series

# ఆంధ్రగ్రంథమండలి

మాకీసుపేట, తెనాలి.

( స్థాపితము ౧౯౨౫. )

పురాణములు, ప్రబంధములు, కావ్యములు.

చక్కని అచ్చుతో, ముద్దులొలుకు క్యాలికో బైండుతో మాసమున కొక సంపుటము వెలువడు చుండును.

## నిబంధనలు.

1. ఇందు చందాదారులుగ చేరగోరువారు ప్రవేశరుసుము రు 0-4-0 లు చెల్లించవలెను.
2. ఇందు మాసమున కొకటిగ వెలువడుచుండు క్యాలికో బైండుగల ప్రతి సంపుటమును రు 0-11-0 లకు చందాదారులకు మాఆథరైజుడు ఏజంట్ల ద్వారాగాని, వి. పి. గా గాని పంపుచుందుము. ఇతరులకు రు 1-0-0.
3. సంపుటము పంపుటకగు పోస్టేజి మొదలగు ఖర్చులను చందాదారులే భరించవలెను.
4. ప్రస్తుత గ్రంథములు పీఠిక, లఘుటీక, విశేషాంశ సహితముగ ప్రచురింపబడుచున్నవి.

5. సంవత్సరచందా (అనగా ముందు ప్రకటింపబోవు గ్రంథముల చందా)ను చందాదారులు ముందుగా చెల్లింపవచ్చును.

6. ఇదివఱకు భాగవతము, భారతములోని ఆదిపంచకము యుద్ధపంచకము వెలువడినది. శాంతిపర్వ మచ్చగుచున్నది. పూర్వ సంపుటములు నిలువలో నున్నవి. కావలసినవారికి వి. పి. ద్వారా అందజేయగలము.

7. భాగవతము రెండవముద్రణము త్వరలో జరుగనున్నది. చందాదారులుగా ముందు చేరువారికి పూర్తి సంపుటములు పీఠిక, టీకగల మేలు ప్రతులు రు 7-8-0 లకు యివ్వగలము. ఈమొత్తము రెండు మారులుగా పంపవచ్చును.

8. చందాదారులు పుస్తకములను గుఱించి జేయు సూచనలను దయతో స్వీకరించి సాధ్యమగువంతవఱ కాచరణలో నుంచగలము.

ఇట్లు

వసుమూర్తి రామకృష్ణయ్య,

మేనేజరు.

